



ముఖచిత్రం: సంభవామి యుగే యుగే

చిత్రకారుడు: వడ్డాది పాపయ్య

వచ్చే సంచికలో – నాలుగవభాగం
'మొగలుదర్బారుకుట్రలు'


యువ సాలుచందా – 12-0

దీపావళి ప్రత్యేక సంచికతో – 16-

యువ, పోస్ట్‌బాక్స్ 216, హైదరాబాద్




ఆగష్టు యువలో మీరు ప్రచురించిన శీలా వీర్రాజుగారి "నీడపట్టు మనిషి" బాగున్నది. రచయితకు ధన్యవాదాలు.

ఎ. ప్రభాకర్
ఖిలాయునగర్-1

'ఆగష్టు యువలో ప్రచురించిన 'అశాంతి', 'నీడపట్టు మనిషి' కథలు చాలా బాగున్నాయి.

పాకా మధుసూధన్ దాస్
బరంపురం (గంజాం)

ఆగష్టు యువలో ప్రచురించిన "మొగలుదర్బారుకుట్రలు" నవల చాలా బాగున్నది. ఇంతచక్కటి నవల ప్రచురించినందుకు మీకు, రచయితకు నా అభినందనలు.

తిరుమల లక్ష్మీబాయ్
పార్వతీపురం

మీ సంపాదకీయములు నిష్పక్షపాతముగా వుంటూ, అందరికీ కనువిప్పు కలిగేలా వున్నది. 'మొగలుదర్బారు కుట్రలు' చాలా ఆశ్చర్య ఆనంద ఆసక్తి జనకంగా, చదువుతున్నకొద్దీ ఇంకా చదవాలనిపిస్తూంది.

శెట్టిపల్లి క్రిష్ణమూర్తి
అనంతపురం

ఆగష్టు నెల యువ సంపాదకీయం వెలలేనిది, విలువైనది, అమూల్యమైనది, అత్యుత్తమమైనది. సంపాదకులు చేసిన సూచనను మన నాయకులు ఏమాత్రంగానైనా పాటింప పూనుకుంటే, కనీసం వారికీ విధంగానైనా కనువిప్పు కల్గితే, 'యువ' చేసిన మేలు ఆంధ్రజాతికి గర్వకారణం.

ఆర్. వి. సీతారామారావు
బళ్లారి

కథలలోకెల్ల బలివాడ కాంతారావు గారు వ్రాసిన "అశాంతి" చాలాబాగుంది. అత్యుత్తమ కథ వ్రాసిన రచయితకు నా కృతజ్ఞతలు.

బి. చెన్నకిషన్‌రావు
మామిడాల

ఆగష్టు సంచికలో బలివాడ కాంతారావుగారి అశాంతి చాల నచ్చింది. "మొగలుదర్బారు కుట్రలు'' చాలా రసవత్తరంగా వుంది.

సి. నారాయణ
ఆర్మూర్

ఆగష్టుసంచిక 'యువ'లో ప్రచురింపబడిన 'ఖండసరి చక్కెర_కాశీమజిలీలు' ఆహ్లాదకరముగా ఉంది. రచయిత 'పాలగుమ్మి పద్మరాజు'గారికి మా అభినందనలు.

అనంతలక్ష్మి
పూనా_2

లైన్, హాఫ్‌టోన్ మరియు మల్టీకలర్ బ్లాకుల కొరకు

# యువ ప్రాసెస్

పబ్లిక్ గార్డెన్ రోడ్

## హైదరాబాదు-1

వారిని సంప్రదించండి

ఫోన్ 34400



మీ అందమైన శిరోజ
ములకు జాగ్రత్త
మరియు సంరక్షణ
అవసరం

బెంగాల్ కెమికల్స్‌వారి

**కాంథారిడైన్**

హేర్ ఆయిల్, కురులను
కాంతివంతముగా
సొగసుగ వృద్ధి పరుస్తూ
రాలిపోవుటను
నిలుపు చేయును.



**BENGAL CHEMICAL**

CALCUTTA
BOMBAY
KANPUR


కండనొప్పి
ఎంత ఎక్కువగా ఉన్నా
స్థానికమే

# యువ ప్రచురణలు

| | | |
|---|---|---|
| గడ్డురోజులు_నవల | కుటుంబరావు | 1_50 |
| వరప్రసాదం | ,, | 1_25 |
| కాలభైరవుడు | ,, | 1_25 |
| నిలవనీరు | ,, | 1_25 |
| నీకేంకావాలి | ,, | 1_25 |
| మొండివాడు | ,, | 1_00 |
| కులంలేని మనిషి | ,, | 1_00 |
| అరుణోదయం | ,, | 1_00 |
| మారుపేర్లు | ,, | 1_00 |
| పాతమంగలి | చక్రపాణి | 1_25 |
| పాంచజన్యం | ,, | 1_25 |
| శిథిలాలయం | కీ. శే. గోపీచంద్ | 1_75 |

ఏజంట్లకు 25% కమిషన్ ఇవ్వబడుతుంది. పైకం ముందుగానే పంపాలి. V. P. పద్ధతి లేదు.

వివరాలకు:

## యువ కన్సర్న్స్

పబ్లిక్ గార్డెన్ రోడ్

హైదరాబాద్_1.


సరేనండీ రేపట్నుంచీ వంటు
మానేసి రెస్టు తీసుకొంటూ


పెళ్లయిన కొత్తల్లో
కొత్తిమీర లాటివో
తరిగి
పెట్టేదానివి-

# యువ

## సచిత్ర మాస పత్రిక

సంచాలకుడు : చక్రపాణి

సంపుటి 14 సెప్టెంబరు, 1966 సంచిక 3


అయిదవ ఉక్కు ఫాక్టరీని ఎక్కడ స్థాపించాలా అనే విషయంలో వచ్చిన తగాదా ప్రస్తుతం వెనకబడిపోయినట్లున్నది. ఏమంటే, అసలు అయిదవ ఉక్కు ఫాక్టరీ స్థాపనే జరిగేటట్టు లేదు కనుక. కాని, మరొక ఉక్కు-ఫాక్టరీ నిర్మాణం జరుగదు అని అనుకోవడానికి వీలు లేదు. ఏమంటే, మదరాసు ప్రభుత్వం అతి చాకచక్యంగా పని జరిపి, సేలం జిల్లాలో ఉక్కు-ఫాక్టరీని స్థాపించడానికి ఏర్పాట్లన్నీ చేసుకున్నది. కేంద్ర ప్రభుత్వం అనుమతి లేనిదే అక్కడ ఉక్కు ఫాక్టరీని స్థాపించడానికి వీలులేదన్న తక్కిన రాష్ట్రాల వాదన గాలిలో కలిసిపోయింది. రూపాయి విలువను తగ్గించడం కారణంగా, అయిదవ ఉక్కు-ఫాక్టరీ నిర్మాణం జరుగకపోవచ్చుననే సూచనలు క్రమక్రమంగా బయటికి వస్తున్నాయి. ఆ సూచనలే చివరకు ప్రభుత్వ నిర్ణయంగా మారవచ్చును. అలా జరిగిననాడు, అయిదవ ఉక్కు ఫాక్టరీ నిర్మాణం విషయంలో, మాకు మాకు అని ముందుకు వచ్చిన ఇతర రాష్ట్రాల కోరిక విఫలం కాగా, మదరాసు రాష్ట్రపు పంట పండవచ్చును.

ఏమంటే, మధ్యరకపు ఉక్కు ఫాక్టరీని స్థాపించడానికి అవసరమైన ఏర్పాట్లన్నిటినీ చేసుకున్నాము గనుక, సేలంలో మధ్యరకపు ఉక్కు

ఫాక్టరీని స్థాపించవలసిందని మదరాసు ప్రభుత్వం కేంద్రప్రభుత్వాన్ని ఒత్తిడి చేస్తూవుంది. ఈ కోరికను కేంద్రప్రభుత్వం దాదాపు అంగీకరించి నట్లే. రూపాయివిలువ తగ్గించిన కారణంగా, పెద్ద ఉక్కుఫాక్టరీని ఇతర రాష్ట్రాలలో ఎక్కడ స్థాపించడమా అన్న సందేహంలో పడిందిగనుక, సేలంలో మధ్యరకపు ఉక్కు ఫాక్టరీని స్థాపించడం జరగవచ్చును; ఆ తరువాత, ఆ మధ్యరకపు ఉక్కు ఫాక్టరీయే క్రమంగా భారీ రకపు ఫాక్టరీ, అయిదవ ఉక్కు ఫాక్టరీగా రూపొందవచ్చును. "ఇంతింతై, వటు డింతయై" అన్నట్లుగా ఏమీ గందరగోళం లేకుండా అయిదవ ఉక్కు ఫాక్టరీ మదరాసు రాష్ట్రంలో రూపొందడం జరిగిననాడు, తక్కిన రాష్ట్రాలవారు ఆశ్చర్యపడడమూ, మదరాసు నాయకుల చాకచక్యానికి జోహారు లర్పించడమూ తప్ప, వేరే చేసేది ఏమీలేదు.

అలాజరుగుతుందని గ్రహించి ఆంధ్రనాయకు లూరుకోవలసిందేనా?

అయిదవ ఉక్కుఫాక్టరీని నిర్మించాలన్న నిర్ణయం ఏనాడో జరిగింది. దానిని ఎక్కడ నిర్మించాలనే విషయంలో నిపుణుల సలహాలను తీసు కోవడం కూడా జరిగింది. రూపాయివిలువను తగ్గించడం అనేది యిటీవల జరిగింది కనుక, అయిదవ ఉక్కుఫాక్టరీ నిర్మాణాన్ని ఆపడానికి ఎంతమాత్రమూ వీలులేదు. ఈ ఫాక్టరీ నిర్మాణానికి విశాఖపట్టణం అన్ని విధాలా తగిఉన్నదని నిపుణుల నివేదిక స్పష్టంగా చెప్పుచున్నది కనుక, యీ ఫాక్టరిని ఆంధ్రరాష్ట్రంలోనే, విశాఖపట్టణంవద్దనే నిర్మించాలని మనం పట్టుపట్టాలి. అంతేకాదు, వామనాకారంలో ప్రారంభమై విశ్వ రూపాన్ని పొందబోతున్న సేలం ఫాక్టరీని, విశాఖపట్టణంలో అయిదవ ఉక్కుఫాక్టరీ నిర్మాణం జరిగిన తరువాతనే ప్రారంభించాలిగాని అంత వరకూ సేలం ఫాక్టరీ ని ర్మాణం ప్రారంభించగూడదనికూడా మనం పట్టుపట్టాలి. సేలంలో ఉక్కుఫాక్టరీని అసలు స్థాపించకూడదంటే మనది తప్పు అవుతుందిగాని, మాకు రావలసింది మాకు యిచ్చి, తరువాత సేలం సంగతి చూసుకోండి అని కేంద్రప్రభుత్వంమీద ఒత్తిడి తేవడంలో ఏమీ తప్పులేదు.

ఇలాటి ఒత్తిడి తెచ్చి, ఆంధ్రదేశపు హక్కులను కాపాడగల నాయకు లెవరు? కేంద్ర మంత్రిమండలిలో ఇద్దరు ఆంధ్రులు వున్నారు. ఈ ఇద్దరూ కూడా ఆంధ్ర రాష్ట్రానికి ముఖ్య మంత్రులుగా వున్నవారే; ఆంధ్రదేశపు అవసరాలను బాగా తెలుసుకొన్నవారే; ఆంధ్రదేశపు అవసరాల విషయంలోనూ, హక్కుల విషయంలోను కేంద్ర ప్రభుత్వం ఇన్నాళ్ళూ ప్రదర్శిస్తూవున్న ఉదాసీన భావాన్ని గ్రహించినవారే. అంచేత, ఇప్పుడు తాము ఉన్నతస్థితిని ఉపయోగించుకొని, ఆంధ్ర రాష్ట్రాన్ని కొంత ముందుకు తేవడానికి గట్టి ప్రయత్నం చేయవలసిన బాధ్యత వారిమీద ఉంది. కాని, యీ యిద్దరు నాయకులూ కేంద్ర ప్రభుత్వంలో చేరి ఎనిమిది మాసాలయింది. ఇంకొక ఆరు మాసాలలో ఎన్నికలు రాబోతున్నవి. ఇక రెండు మాసాలు పోయిన తరువాత, వీరు ఎన్నికల కార్యక్రమంలో కొట్టుకులాడుతూ వుంటారు. అలాటి పరిస్థితులలో, ఆంధ్రప్రదేశ్ అవసరాల విషయంలో జాగ్రత్తగా ఆలో చించి, తగిన పథకం ప్రకారం పని జరిపించడానికి వ్యవధి వుండదు. ఈలోగా, చాలావరకు ఏర్పాట్లు పూర్తి చేసుకున్నాము గనుక, మా సేలం ఫాక్టరీకి అనుమతి ఇవ్వవలసిందనీ, అనుమతి యివ్వకపోతే కేంద్ర ప్రభుత్వం దక్షిణ దేశంపట్ల సవతిప్రేమ చూపుతున్నదని ద్రవిడ కళగంవారు ఆందో[illegible] ఎన్నికలలో కాంగ్రెసును దెబ్బకొట్టడానికి ప్రయత్నిస్తారనీ మదరాసు కాంగ్రెసు నాయకులు ఒక ప్రచారం సాగించి, కేంద్ర ప్రభుత్వంమీద ఒత్తిడి తెచ్చి, సేలం ఉక్కుఫాక్టరీని సాధించుకో వచ్చును.

మనకీ అదేమాట. విశాఖపట్టణంలో అయిదవ ఉక్కు ఫాక్టరీని స్థాపించే నిర్ణయం జరుగకపోతే, ఆంధ్రప్రజలు కాంగ్రెసు ప్రభుత్వం తమకు చాలా అన్యాయం చేసిందని నిశ్చయించుకోక మానరు. ఎన్ని కలలో కాంగ్రెసుపట్ల తమ విముఖత చూపకమానరు. అంచేత యీ విషయాన్ని కేంద్ర ప్రభుత్వానికి స్పష్టపరచవలసిన బాధ్యత రాష్ట్ర ప్రభుత్వానిది.

—:o:—

# చిత్రవార్తలు

ఆగష్టు 15 న శ్రీమతి ఇందిరాగాంధి ఢిల్లీ ఎర్రకోటపై జాతీయ పతాకాన్ని ఆవిష్కరించిన తదుపరి సందేశాన్నిచ్చినపుడు వర్షాన్ని కూడా లెక్కచేయకుండా వింటూన్న జనసందోహం.





ఆగష్టు 14 న న్యూఢిల్లీలో ప్రెసిడెంట్ రాధాకృష్ణన్ శ్రీ ఎస్. రంగనాథన్‌గారిచే ఆడిటర్ జనరల్‌గా ప్రమాణస్వీకారం చేయుచున్నారు.

కెప్టెన్ హెచ్. ఎస్. అహ్లూవాలియా, డిప్యూటీ కెప్టెన్ లెఫ్టినెంట్ కలనల్ యన్. కుమార్ 1965 ఎవరెస్టు పర్వతారోహకులుగా డాక్టర్ ఎస్. రాధాకృష్ణన్ నుంచి అర్జున్ ఎవార్డులను పొందారు.





1966 జూలై 29 న 1963_64 సం. శాంతిస్వరూప్ భట్నగర్ సైంటిఫిక్ రిసెర్చి ఎవార్డు విజేతలతో శ్రీమతి ఇందిరాగాంధీ, శ్రీ ఎమ్. సి. చాగ్లా.

---

కుమారి ఇ. బ్రిట్టో (కుడి) హాకీ ఆటలో ప్రావీణ్యతకు 1965 అర్జున్ స్టాట్యూను డా॥ ఎస్. రాధాకృష్ణన్ న్యూఢిల్లీలో జూలై 8 న బహూకరించారు.





.. ధీరేంద్రనాథ్ పాల్ ..

[ అనేక సంవత్సరాలు గడిచినాయి. షాజాదా కరీమ్, లూలియాలు మొగలు సామ్రాజ్యానికి అభిషిక్తులై, షాజహాన్, ముంతాజ్‌మహల్ అనే పేర్లతో దీర్ఘకాలం సుఖంగా జీవించి; పిల్లలనూ, మనమలనూ కూడా కని, వృద్ధులయారు. షాజహాన్ కిప్పుడు నలుగురు కొడుకులూ, ఇద్దరు కుమార్తెలూనూ. కుమార్ల పేర్లు దారాషుకో, షుజా, ఔరంగజేబ్, మురాద్; కుమార్తెల పేర్లు జహానారా, రోషనారా. ]

ఆగ్రాలోని కోటలో అంతఃపురంలో బేగముల జలకాలాడేచోట ఒక చలవరాతి అరుగుమీద రోషనారా చేరగిలబడి కూర్చునిఉన్నది. ఒకతె ఆమె జుట్టుకు గులాబీఅత్తరు రాస్తున్నది. ఆలోచనానిమగ్నురాలైన ట్టుండిన రోషనారా చప్పున లేచి కూర్చుని. "రంగమహలులో అడావుడిగ ఉన్నదట, దేనికో ?'' అన్నది.

"ఏమోనమ్మా. అక్కడ దాసీలు తమలోతాము గుసగుస లాడుకోవటమేతప్ప పైవాళ్ళ కేమీ తెలియనివ్వటం లేదు," అన్నది బానూ అనే ఆ దాసి.

"నా గూఢచారికి కూడా రంగమహలు రహస్యాలు దొరకటం లేదా ? వింతగా ఉందే ?" అన్నది రోషనారా.

"అమ్మా, ఎక్కడి రహస్యాలైనా ఇట్టే పట్టగలను గాని, ముంతాజ్‌మహల్ సాహేబా మందిరంలో రహస్యాలు మాత్రం నావల్ల కాదు. నాలుగైదు రోజులుగా

ఆ మందిరంలోనికి కొజ్జాల బందోబస్తు చాలా జాస్తిగా ఉన్నది. పైనుంచి ఒక పురుగైనా లోపలికి రానివ్వవద్దని పాదుషావా రాజ్ఞాపించారట.''

"పాదుషావా రెక్కడ ?''

"వారూ ఆ మందిరంలోనే ఉన్నట్లున్నారు."

"అక్క జహానారా ?"

"ఆమెకూడా అక్కడే ఉన్నారు.''

రోషనారాకు మండిపోయింది. ఏదో గూడుపుఠాణీ జరుగుతున్నది. అదేమిటో తనకు తెలియటం లేదు. తనకు అనేకమంది విరోధు లుండటంచేత తొందరపడి ఏ పనీ చెయ్యరాదు.

పాదుషా బేగంమహలు పెత్తనమంతా తన కూతుళ్ళ కిద్దరికీ ఇచ్చేశాడు. అయితే ఆ యిద్దరిమధ్యా పొత్తు లేదు. పెద్ద షాజాదీ అయిన జహానారా ఉదార స్వభావురాలు; ఎప్పుడూ తండ్రిని కనిపెట్టుకుని ఉంటుంది. గొప్ప పాండిత్యమూ, కవిత్వశక్తీ కలది. రోషనారా అలా కాక, ధూర్తురాలు; అపారమైన తెలివితేట లుండి కూడా కుబుద్ధికలది.

ఏమైనాసరే స్నానం పూర్తిచేసి త్వరగా ముంతాజ్‌మహలు మందిరానికి వెళ్ళటానికి రోషనారా నిశ్చయించి, తనను ఎవరుగాని ఎలా ఆపుతారో చూతామనుకున్నది.

ఇంతలోనే మరొకదాసి వచ్చి, పాదుషాకు జబ్బుగా ఉన్నట్లు వార్త తెచ్చింది. పాదుషాబేగం మందిరానికి వైద్యులు పిలవబడ్డారు; ఎక్కడెక్కడో ఉంటున్న షాజాదాలను పిలుచుకురావటానికి మనుషులు వెళ్ళారు; పాదుషాకుమారు లీ సరికి వస్తూంటారు కూడా.

రోషనారా గుండెలో రాయిపడింది. పాదుషా అకస్మాత్తుగా చనిపోయే పక్షంలో సింహాసనం ఎవరికి దక్కుతుంది ? తన చెప్పుచేతులలో ఉండేవాణ్ణి సింహాసనం ఎక్కించి, తాము నూర్జహాన్‌లాగా అధికారం చలాయించాలని కన్న కలలన్నీ గాలి కెగిరిపోతాయా ?

ఎందుకంటే, తన అనంతరం దారాషుకో చక్రవర్తి కావాలన్నది పాదుషా నిర్ణయం. దారాకు వత్తాసు జహానారా. అందుకే ఆ ఇద్దరినీ చూస్తే రోషనారాకు తగనిమంట. ఆమె ఔరంగజేబ్ పక్షం. అతనే భావి చక్రవర్తి కావాలని ఆమె సంకల్పం. అయితే ఇప్పుడు దారా తప్ప మిగిలిన షాజాదా లందరూ దూరదేశాల్లో పదవులు నిర్వహిస్తున్నారు. ఈ క్షణాన పాదుషా చనిపోతే దారా చక్రవర్తి కావటం నిశ్చయం. ఆ తరవాత అతన్ని ఎవరూ దించలేరు. అంతటితో రోషనారా



కంటూవచ్చిన కలలన్నీ కరిగి అంతర్ధానం అవుతాయి. పాదుషాకు ఆరోగ్యం సరిగా లేనట్టు ఏమాత్రం ముందుగా తెలిసినా ఇంత చిక్కు లేకపోను.

తలలో వెయ్యి ఆలోచనలు పెనగులాడుతూ రోషనారా స్నానాలు చేసే చోటి నుంచి తన మందిరానికి బయలుదేరింది. దారిలో ఒక దాసి పరుగెత్తుకుంటూ వచ్చి, ఆమె కొక జాబు అందించింది. దానిని చించి చదువుకుని, వెలవెలబోతూ రోషనారా మూర్ఛిల్లినంతపని చేసింది. దాసీలు చప్పున ఆమెను పడకుండా పట్టుకున్నారు. ఆమె అంతలోనే తెప్పరిల్లి, దాసీలను తోసేసి గబగబా నడుస్తూ తన మహలుకు వెళ్ళి, తన మహలులో ఉండే కొజ్జాలకు నాయకుడైన గామా కోసం కబురుపెట్టింది.

గామా రాలేదుగాని, రోషనారా వద్దకు ఒక పధ్నాలుగేళ్ళ ప్రాయం గల అందమైన పిల్ల ఒకతె వచ్చి, "సలామ్, షాజాదీ, మిమ్మల్ని వెంటపెట్టుకురమ్మని ఆజ్ఞ అయింది," అన్నది.

రోషనారా మండిపడి, "నన్నాజ్ఞాపించే హక్కెవరికున్నది ?" అన్నది.

"మీ అక్కగారికి లేదా ?" అన్నది ఆ బాలిక.

"లేదు. లేదు."

"పోనీ పాదుషావారి కున్నదా ?"

"నీతో ఈ సోది మాట్లాడటానికి లేదు, పియారాజాన్! నా కవతల రాచకార్యం ఉన్నది."

"షాజాదీ జహానారా పిలిపించటంకన్న పెద్ద రాచకార్యం ఏమిటి ?"

"అక్క ఏమని చెప్పమన్నది ?"

"తక్షణం రమ్మని ఆజ్ఞాపించారు."

"ఒకరి ఆజ్ఞలను నేను లక్ష్యపెట్టేదాన్ని కాను."

"అదంతా నా కెందుకు ? నా పని నేను చేశాను." అంటూ పియారాజాన్ వెళ్ళిపోబోయింది.

"కొంచెం ఆగు. షాజాదీ జహానారా ఇప్పు డెక్కడ ఉన్నది ?"

"ముంతాజ్‌మహల్ మందిరంలో."

"అక్క డెందుకు ?"

"ఏవో రాజకీయం ఉండే ఉంటుంది."

"పాదుషాగారికి సుస్తీగా ఉందిట. ఇప్పు డెలా ఉన్నారు ?"

"ఆ మాట చెప్పటానికి నాకు అనుమతి లేదు."

రోషనారా కోపంతో లేచింది. పియారాజాన్ కిలకిలా నవ్వుతూ పారిపోయింది.

రోషనారా కలవరపడింది. పాదుషా ఆరోగ్యస్థితి గురించి తనకు తప్ప అందరికీ తెలుసు! దారా, జహానారా కలిసి ఏలేస్తున్నారు. వాళ్ళు పాదుషాకు విషం పెట్టి చంపేస్తే ఏం కావాలి. తాను చూస్తూ ఊరుకుని లాభం లేదు.

ఆమె ఇలా అనుకుంటున్న సమయంలో జహానారాయే స్వయంగా బయలుదేరి చెల్లెలివద్దకు వచ్చి, "నిన్ను రమ్మని పిల్లచేత కబురుపంపానే, రాలేదేం ?" అంది.

"అది నాతో సవాళ్ళువేస్తూ కూర్చున్నది. దానికి పాదుషా అన్నా ఖాతరు లేదు. దాన్ని బాగా గారాబం చేసి చెడగొట్టావు."

"దానిమాట కేంగాని, వెంటనే బయలుదేరు."

"ఎక్కడికి ? పాదుషాకు నిజంగా జబ్బుగా ఉందా ?"

"ఎబ్బె, అలాటి దేమీలేదు. దైవానుగ్రహంవల్ల ఆయన ఆరోగ్యాని కెలాటి భంగమూ లేదు. అవసరమైన రాచకార్యం వచ్చింది. నువు వెంటనే బయలుదేరు," అంటూ జహానారా కదిలింది.

రోషనారాకు అక్కవెంట వెళ్ళకూడదనే ఉన్నది. అయినా ఆమెకూడా కదిలింది. తనను తన అక్క ఎక్కడికి తీసుకుపోతున్నదీ, ఎందుకు తీసుకుపోతున్నదీ తెలియకపోవటం రోషనారాకు బాధగానే ఉన్నది.



వాళ్ళు మధ్యదారిలో ఉండగా ఒక పక్కనుంచి జహానారా భవనపు కొజ్జాల నాయకుడు గనీ, రెండోపక్కనుంచి రోషనారా కింకరుడు గామా వచ్చారు. గనీ ఆరుమూరల ఎత్తుమనిషి, సన్నగా చువ్వలాగా ఉంటాడు, కాని బలాఢ్యుడే. గామా దున్నపోతు, స్థూలకాయుడు; చెమటలు దిగగార్చుతూ, దొర్లుతూ నడుస్తాడు. గనీ జహానారా కేదో ఇచ్చాడు. దాన్ని చూడగానే జహానారాముఖం క్షణంపాటు ముకుళించింది.

గామా తన యజమానురాలికి కూడా ఒక జాబిచ్చాడు. దాన్ని చూసుకుని రోషనారా పాముకరిచిన దానిలాగా అయిపోయి, "అక్కా, నేను వెంటనే నా మందిరానికి వెళ్ళిపోవాలి; చాలా తొందరపని ఉన్నది," అన్నది.

"నాది మరింత తొందరపని," అన్నది జహానారా

"అయితే అదేమిటో చెప్పు."

"ఇక్కడ చెప్పమన్నావా?" అంటూ జహానారా గామాకేసి తిరిగి, "ఆ జాబు నీ కెవ రిచ్చారు?" అని అడిగింది.



గామా, జవాబు చెప్పక తన యజమానురాలికేసి చూశాడు.

అంతలోనే పియారాజాన్ వచ్చి జహానారా చెవిలో ఏదో చెప్పింది. జహానారా తన చెల్లెలికేసి చూడనైనా చూడకుండా చరచరా వెళ్ళిపోయింది. రోషనారా కూడా తన చోటికి వేగంగా వెళ్ళిపోయింది.

గామా, గనీ కూడా ఒకరినొకరు తినేటట్టు చూసుకుని, హుంకారాలు చేసుకుని, ఎవరిదారిన వారు వెళ్ళారు.

## 2

ముంతాజ్ మహల్ కన్నుమూయటానికి సిద్ధంగా ఉన్నది. ఆమెది ఆదర్శప్రాయమైన జీవితం. అనుభవించాలంటే అంతులేని భోగభాగ్యాలుండికూడా ఆమె సాధారణ స్త్రీలాగా జీవించింది. సర్వాధికారాలూ కలిగివుండికూడా వాటి నామె ఉపయోగించలేదు ఆమె ఎన్నడూ రాజకీయాలజోలికి పోయిఎరగదు; తన భర్తను సుఖపెట్టడంలోనే కాలం గడిపింది. భర్తచేత ప్రజోపయోగ్యమైన పనులు అనేకం చేయించింది

ముంతాజ్ మహల్ వ్యాధిగ్రస్తురాలై ఉన్నసంగతి పరమరహస్యంగా ఉంచబడింది. ఆ సంగతి నలుగురికీ తెలిస్తే, కట్టతెగిన సముద్రంలాగా ఆగ్రాపౌరులందరూ రాజభవనం జొరబడి ఉందురు. వారిని ఆపటం రాజభటుల వశం అయివుండేది కాదు. అందుకే ఆమె జబ్బుగురించి తనకూ, జహానారాకూ, కొద్దిమంది పరిచారికలకూ తప్ప మరెవ్వరికీ తెలియరాకుండా పాదుషా కట్టడిచేశాడు.

ఈ వ్యాధి ఆమెకు కొత్తగా వచ్చినదికాదు. ఆమె ఆగ్రాకు చేరినప్పుడే అది ఆమె శరీరాన్ని ఆశ్రయించింది. కాని చాలాకాలం ఎవరూ కనుక్కోలేకపోయారు. ఆమె తన మనోబలంతో తన రోగాన్ని దాచినంతకాలం దాచింది తరవాత రోగబలమే జాస్తిఅయింది.

వ్యాధి ముదిరినదిమొదలు జహా నారా తల్లివద్దనే ఉండి సపర్యలు చేస్తున్నది. ఆ మందిరంలోకి ఎవరూ రాకుండా పహారా ఏర్పాటుచేశారు. చిట్టచివరకు వైద్యులను పిలిపించారు. కాని జాడ్యం వారికి లొంగలేదు.



మరణశయ్యపై నుండి ముంతాజ్ మహల్ తనభర్తతో, "నీ ఖాలియా వెళ్ళిపోతున్నది. సెలవియ్య." అన్నది. తననలుగురు కొడుకులకూ, ఇద్దరు కూతుళ్ళకూ అప్పగింతలు చెప్పింది. రోషనారాతో, ''అమ్మా! నువు మళ్ళీ నూర్జహాన్ లాగా తయారై, అన్నదమ్ములమధ్య తగాదాలు పెట్టకు.'' అని హితం చెప్పి, ముంతాజ్ మహల్ ప్రాణాలు వదిలింది. అందరూ వెక్కి వెక్కి ఏడ్చారు. అందరికన్నా చంటిపిల్లవాడిలాగా ఏడ్చాడు పాదుషా.

ఆమె మరణించిన వార్తను ముల్లాలు ప్రకటించారు. ఆమె భౌతిక దేహాన్ని ప్రజలు చూడటానికి ఏర్పాట్లుచేశారు. ఆమెకోసం ఆగ్రా నగరమంతా మైలపట్టింది. ముంతాజ్ మహల్ ను తాజ్ మహల్ భవనంలో సమాధిచెయ్యటానికి సాయంకాలం అయిదుగంటలకు తీసుకుపోయేటప్పుడు ప్రముఖరాజపుత్రులు వెంట వెళ్ళారు. శవం తాజ్ మహల్ చేరేసరికి అక్కడ ఇసకవేస్తే రాలకుండా జనం పోగయారు. సూర్యుడు అస్తమించుతున్నాడు.

అంతమంది జనం ఉండికూడా ఏమాత్రమూ చప్పుడులేని ఆ వాతావరణంలో ఒక అమానుష కంఠం, "అదుగో, పోతున్నది! పోతున్నది!" అని కేక పెట్టటం వినపడింది. అందరూ కంగారుగా అటూ ఇటూ చూశారు. పాదుషాకూడా కలవరపడ్డాడు

ఆ తరవాత ముంతాజ్ మహల్ భౌతికదేహాన్ని సమాధి చేసేపని నిరాటంకంగా

జరిగిపోయింది. ఒక్కొక్కరే సమాధినుంచి ఇవతలికి వచ్చేశారు. పాదుషా మాత్రం కంటికీ మంటికీ ఏకధారగా ఏడుస్తూ చాలాసేపు అక్కడే కూర్చున్నాడు.

ఒకగంట గడిచిం . బయట చీకట్లు ముంచుకొచ్చాయి. కాని సమాధిదగ్గిర మైనంవత్తులు దేదీప్యమానంగా వెలుగుతున్నాయి. వాటి కాంతిలో గోరీపైన అమర్చిన పెద్దవజ్రం సూర్యుడిలాగా ప్రకాశిస్తున్నది. పాదుషా లేచి, వెళ్ళిపోవటానికి వెనక్కు తిరిగాడు. వెంటనే ఆయన కొక భయంకరాకారం కనబడింది.

పాదుషాను కంగారుపెట్టిన ఆకారం ఒక ముసలిది. ఆమె ప్రాణంతో ఉన్న అస్థిపంజరంలాగా, కళ్ళు లోతుకుపోయి, భయంకరంగా ఉన్నది. కాపలావాళ్ళను ఏమార్చి ఆమె లోపలికి ఎలా రాగలిగిందో పాదుషాకు అర్థంకాలేదు. ఆమె పాదుషాతో, "ఇవాళ ఎంతపని చేశావో తెలుసా ? మొగలుల వంశదేవతను పాతేశావు ! మొగలుసామ్రాజ్యం విచ్ఛిన్న మవుతుందని తెలుసుకున్నావా ?" అన్నది.

ఆ గొంతు ఎప్పుడో విన్నట్టేఉన్నది. కాని గుర్తురాలేదు. పాదుషా దాన్ని జ్ఞాపకం చేసుకోవటానికి ప్రయత్నించేటంతలో ఆ ముసలిది ఎటో మాయమయింది. పాదుషాపరివారం ఎంత ప్రయత్నించీ ఫలితం లేకపోయింది. తరవాత పాదుషా యమునానదిలో ఉన్న నావ నెక్కి కోటకు బయలుదేరాడు. పడవలో కూర్చునిఉన్న పాదుషాఒళ్లు ఒక్కసారి ఝల్లుమన్నది — స్నానాలగది తలుపు కొంచెంగా తెరుచుకుని, ఆ సందులో ముసలిదాని ముఖం కనబడింది. ఆయన ఒక్క కేకపెట్టేసరికి, నలుగురూ ఆయన గదిలోకి వచ్చి స్నానాలగది పరీక్షించారు. అందులో ఎవరూ లేరు. తనకు కనిపించినది దయ్యమో, లేక తన భ్రమేనేమో నని పాదుషా కలవరపడ్డాడు ఆ ముసలిది చెప్పినట్టు సామ్రాజ్యం విచ్ఛిన్న మవుతుందేమోనన్న భయం కూడా ఆయనకు కలిగింది.

పాదుషా పడవవదిలి కోటలోకి రాజద్వారాన ప్రవేశించక, పక్కనున్న రహస్యద్వారంకుండా ప్రవేశించాడు. ఆయన అలవాటు ప్రకారం ముంతాజ్‌మహల్ మందిరానికి వెళ్ళబోతూంటే జహానారా ఆపి, చెయ్యిపట్టుకుని తన మందిరానికి తీసుకుపోయింది. ఆయన తన పెద్దకుమార్తెతో ముసలిదాని ఉదంతం చెప్పి, "రోషనారా మూలాన నా కొడుకులమధ్య స్పర్థలుసాగి సామ్రాజ్యం దెబ్బతిని, ముసలిదాని మాటలు నిజమవుతాయేమోనని భయంగా ఉంది," అన్నాడు.

"నా ంతలో ఊపిరి వుండగా అలా జరగనీయను,'' అన్నది జహానారా.

## 3

ముంతాజ్‌మహల్ అంత్యక్రియలు చూడవచ్చిన అసంఖ్యాకులలో పియారాజాన్ కూడా ఉన్నది. తాజ్‌మహల్ భవనాన్ని అందరితోబాటు ఆమెకూడా తనివితీరా

చూసి, అందరూ నగరానికి వెళ్ళిపోయేటప్పుడు తానుకూడా నగరానికే బయలు దేరింది. కాని రహదారిన వెళ్ళక, ఒక నిర్జనమైన సన్నని మార్గంగుండా బయలు దేరింది. ఆమె పరధ్యానంగా నడిచి వెళ్ళుతుండగా ఒక్కసారిగా జనసమూహం అతివేగంగా ఆగొందివెంట పరిగెత్తుకుంటూ రాసాగింది. ఎవరో కుర్రవాడు ఎక్కడినుంచో ఊడిపడి ఆమెను కాపాడకపోయినట్టయితే పియారాజాన్ ఆ జనం కాళ్ళకింద పడి చచ్చిఉండును. ఆమె అతని చేతుల్లోనే మూర్ఛపోయింది.

ఆమెకు తిరిగి స్పృహవచ్చేసరికి, తానొక పచ్చిక మైదానంమీద పడుకుని ఉండటమూ, పైన నీలాకాశంలో చంద్రుడు ప్రకాశిస్తూ ఉండటమూ, చుట్టూ ఎవరూ లేకపోవటమూ తెలియవచ్చింది. ఆమెకు తన చేతి నుండే పాదుషాచిహ్నం గల వజ్రపుటుంగరం గుర్తుకొచ్చి చూసుకున్నది. ఉంగరం చేతికే ఉన్నది. తనను కాపాడినవాడెవడైనాకానీ, దొంగమటుకు కాడు.

ఆమె చప్పున లేచి ఇంటిదారిన బయలుదేరింది. వెనకనుంచి ఎవరో, "ఒక్కతెవూ ఎలా పోతావు, పియారాజాన్! నేను నిన్ను ఇంటిదాకా దిగబెడతాను." అన్న మాటలు వినిపించాయి. ఆమె వెనక్కు తిరిగిచూస్తే పాతికేళ్ళలోపు వయసుగల హిందూయువకు డొకడు కనిపించాడు.

"మీ రెవరు?" అన్నది పియారాజాన్.

"చెబితే నువు సంతోషించవు," అన్నా డా యువకుడు.

"మీ రెవరోకూడా నాకు తెలీదు. నే నెవరోకూడా మీకు తెలీదు. నేను హిందువునని కనిపిస్తున్నా నన్ను ముసల్మాను పేరుతో పిలిచారు."

"నే నెవరో నువ్వెరగవు. నిజమేగాని నేను నిన్నెరుగుదును," అన్నా డా యువకుడు చిరునవ్వు నవ్వి.

"మీ ప్రవర్తన ఏమీ బాగాలేదు. మీ దారిన మీరు పదండి. నే నింటికి పోగలను," అన్నది పియారాజాన్.

"ఏదో ఏనుగుకు పిచ్చిపట్టి జనంమీద విరుచుకుపడింది. ఆ పారిపోయే జనం కాళ్ళకింద నువు పడబోతూండగా నిన్ను కాపాడాను. అందుకు ఇలాగేనా కృతజ్ఞత చూపేది?" అన్నా డతను ఇంకా చిరునవ్వుతోనే.

"నన్ను రక్షించినందుకు ఒక్క నమస్కారం."

"అప్పుడే అయిందా? నిన్ను దారిలో దొంగలు దోచకుండా కోట చేర్చుతాను."

"నేను కోటకు పోవటంలేదు. అయినా దొంగలు దోచటానికి నా దగ్గిర ఏ మున్నదని?"

"నీ అందం లేదా? నీ చేతిన ఆ ఉంగరం మాట ఏమిటి?"

పియారాజాన్ అతనికేసి తేరిపార జూసింది.

"నేను నిన్నెరుగుదు నని రుజువు చేస్తాను. బెంగాలులో రాజుగా ఉండే శీతబరాయ్ కూతురు ప్రతిభా అనేది, జహానారా దాసీంలో ఒకతె అయి పియారా జాన్ అని పేరు మార్చుకున్నది."

"ఇంతకూ మీ రెవరు?"

"చెబితే నువు సంతోషించ వని చెప్పానుకదా!"

"నా ప్రాణం కాపాడిన మనిషి ఎవరో నేను తెలుసుకోరాదా? ఎంత నిర్దయ!"

"నేను మి తండ్రికి గర్భశత్రువును. మీ తండ్రి శీతబరాయ్ మా సమస్తమూ కాజేశాడు. మాకు నిలవ నీడ లేకుండాపోయింది. ఆ దురాశాపరుడు బీహారుకు సుబేదారు కావాలని, తన కన్నకూతురిని మ్లేచ్ఛులకు దాసిగా ఇచ్చేశాడు. ఆ దురాత్ముణ్ణి అంతు తేల్చటానికే నేను ఆగ్రా వచ్చాను. ఎందు కిది నాచేత చెప్పించావు?"

"ఓ, మీ పేరు శాలీషరాయ్ కామా?"

"అవును. నా తండ్రి దుర్భరపరిస్థితులలో చనిపోయాడు. మా అమ్మ మరణ శయ్యపైన చావుబ్రతుకులమధ్య కొట్టుకుంటున్నది. నే నీ నగరంలో దిక్కులేకుండా తిరుగుతున్నాను."

"అవునా? గర్భశత్రువు కూతుర్ని ఎందుకు కాపాడారు?"

"నీమీద నా కేం పగా? అయినా నువ్వెందు కిలా ఒంటరిగా రంగమహలు దాటి వచ్చావు? నిన్ను క్షేమంగా కోటకు చేర్చుతాను."

ఇద్దరూ మౌనంగా నడుస్తూ కోట చేరారు. ఆమె అతనికేసి తిరిగి, "నన్ను జహానారా కూతురికన్న ప్రేమగా చూసుకుంటుంది. జహానారా అడిగితే పాదుషా ఏదీ కాదనడు. కనక నాకు అసాధ్యమంటూ ఏదీ ఉండదు. మీకు పాదుషాద్వారా ఏమైనా కావలిసిఉంటే నేను సంతోషంగా సహాయం చెయ్యగలను," అన్నది.

అతను మండిపడి, "నేను ప్రత్యుపకారం కోరేటంత దౌర్భాగ్యుణ్ణి కాను నా హృదయం ప్రతిక్రియకోసం దహించుకు పోతున్నది. నా కసి తీరితేగాని దానికి శాంతిలేదు," అంటూ గబగబా వెళ్ళిపోయాడు.

అతను కొంతదూరం వెళ్ళి ఆగి, వెనక్కు తిరిగి చూశాడు. ప్రతిభ ద్వారంవద్ద కాపలావాళ్ళకు తన చేతి ఉంగరం చూపి, లోపలికి వెళ్ళి కనబడకుండా పోయాక అతను నగరంకేసి నడవసాగాడు. అతనిలో ఏదో మార్పు కలగ నారంభించింది; కాని ఆ మార్పెలాటిదో అతనికే అర్థంకాలేదు.



బెంగాలులో బీర్‌భూమ్ రాజైన గోకులరాయ్ అనే అతను ఒక నవాబువద్ద దివాన్‌గా ఉండేవాడు. గోకులరాయ్ వివేకంలేక, భోగలాలసుడై, అప్పులపాలై, ప్రభుత్వానికి శిస్తులు సరిగా చెల్లించలేని దశకు వచ్చాడు. గత్యంతరంలేక నవాబు అతని ఆస్తిపాస్తులను జప్తుచేయించాడు. బీర్‌భూమ్ జమీందారీ కాస్తా పోయింది. దాన్ని శీతబరాయ్ కొన్నాడు. ఈ శీతబరాయ్ ఒకప్పుడు గోకులరాయ్ కింద కొలువు చేసినవాడే. కాని ఆటుతరువాత అతను బీహారు రాష్ట్రపాలకుడికింద దివానుగా చేరాడు. గోకులరాయ్ చేసిన ఋణాలన్నీ తీర్చేసి, ఆయనకు కొంత నెల జీతంకూడా ఏర్పాటు చేస్తానని శీతబరాయ్ అన్నాడు. అది ఎంతో ఉదారమైన సూచనే. అయితే గోకులరాయ్‌కి అలా తోచలేదు. శీతబరాయ్ చేస్తానన్న సహాయాన్ని నిరాకరించి గోకులరాయ్ తన తల్లితాలూకు పాడుపడిన ఇంటికి వెళ్ళిపోయి, త్వరలోనే అక్కడ మరణించాడు.

గోకులరాయ్ కొడుకు శాలీషరాయ్. జప్తు అయిన తమ ఆస్తిని శీతబరాయ్ కొనకపోతే మరొకరు కొనేవారనీ, శీతబరాయ్ తమకు చేసిన ద్రోహం ఏమీలేదనీ శాలీషరాయ్ గ్రహించక, ఆ శీతబరాయ్‌ని నాశనం చేసి పగ తీర్చుకోవాలని నిశ్చయించాడు. కాని అది అంత తేలికకాదు. శీతబరాయ్ ఇప్పుడు ఉచ్ఛదశలో, మంచి పలుకుబడి కలిగి, బలవంతుడై ఉన్నాడు. శాలీషరాయ్ నిస్సహాయుడు, ఒంటరిగాడు.

రెండేళ్ళక్రితం శీతబరాయ్ కప్పం పట్టుకుని ఆగ్రాకు వచ్చాడు. తీర్థయాత్రలు చేసే ఉద్దేశంతో ఆయనవెంట ఆయన భార్యా, ఆయన కుమార్తె ప్రతిభకూడా బయలుదేరారు. ఆ సమయంలో రాయ్ తన కుటుంబంతోసహా రాజమందిరానికి వెళ్ళి, పాదుషా కుటుంబానికి నజరానాలు చెల్లించాడు.

అక్కడ జహానారా ప్రతిభను చూస్తూనే ఎంతో ముచ్చటపడి, తనకా పిల్లను పెంచుకోవాలని ఉన్నట్లు తండ్రితో అన్నది. పాదుషా ఆ మాటను శీతబరాయ్‌కి చెప్పాడు. కాదనటానికి అవకాశంలేదు. ప్రతిభ ఆనాటినుంచీ రంగ మహల్ నివాసి అయింది. తరవాత శీతబరాయ్‌కి బీహారు దివానుపదవి పోయి, పాలకుడి పదవే లభించింది. జహానారా ప్రతిభ తల్లికి అంతులేని నగలూ, చీనాంబరాలూ కానుక పెట్టి, "ఈనాటినుంచీ మీ బిడ్డ నా బిడ్డ. మీరు కోరినప్పుడల్లా వచ్చి మీ పిల్లను చూడవచ్చు," అని చెప్పి సాగనంపింది.

ప్రతిభ కాస్తా పియారాజాన్ అయింది. ఏ కారణంచేతనో జహానారా ఆ పిల్లను తన దాసీల జాబితాలో చేర్చింది. అయినా ఆ పిల్లకు సంపూర్ణమైన స్వేచ్ఛ ఉంటున్నది. ఆమెకు ఎవరి అదుపూ, ఆజ్ఞా లేదు.

శాలీషరాయికి, తమ ఆస్తిని శీతబరాయి కాజేశాడన్న అపోహతోబాటు పదవికోసం తన సొంత కూతుర్ని అమ్ముకున్నాడన్న భావంకూడా తోడై పట్టరాని కసి ఏర్పడింది. ఆయనను శిక్షించటం తన పవిత్ర ధర్మమని అతను భావించాడు. ఆ ఉద్దేశంతోనే అతడు తనకు మిగిలిన కొద్ది ఆస్తినీ అమ్మి, డబ్బు తన బంధువుల కిచ్చి, వ్యాధిగ్రస్తురాలయిన తన తల్లిని వారిపరం చేసి, గంగారాం అనే ఒక వృద్ధ సేవకుణ్ణి వెంటతీసుకుని వచ్చాడు గంగారాం తనదగ్గిర ఉన్న డబ్బంతా తీసుకుని, తన యజమానికి తెలియకుండా దారిఖర్చు తానే పెడుతూ వచ్చాడు. అయితే ఆగ్రా చేరగానే శాలీషరాయికి ఇకమీద ఏం చెయ్యాలో తెలియలేదు. పాదుషా దర్శనం అసంభవం. ఈ స్థితిలో అతను ప్రతిభ ప్రాణాలను రక్షించటం జరిగింది.

ఇది అతనికి గొప్ప అవకాశం. మూర్ఛలో ఉన్నప్పుడే అతను ప్రతిభను గుర్తించాడు. ఆమె రాజభవనంలో ఉంటున్నదని అతనికి తెలుసు ఆమె చేతి ఉంగరం చూస్తేనే ఆమె హోదా తెలుస్తున్నది. కాని అతను ఈ అవకాశాన్ని వినియోగించుకోడానికి మానుషం అడ్డొచ్చింది

శాలీషరాయ్, ఇంటికి తిరిగివెళ్ళేసరికి హింగన్‌మియా అనేవాడు వచ్చాడు. ఈ హింగన్‌మియా దర్బారులోఉండే సభికులలో ఒకడు. ఎప్పుడూ పట్టువస్త్రాలు ధరించి, అత్తరు వాసనలు విరజిమ్ముతూ, తాంబూలం సేవిస్తూ వుంటాడు. పాదుషాకొలువు చేసే హీనుడికికూడా ఎంతో పలుకుబడీ, రాబడీ ఉంటాయి హింగన్‌మియా తెగతాగి తన రాబడి అంతా ఖర్చు చేస్తూ ఉంటాడు. వాడిసంగతి ఆగ్రాలో అందరికీ తెలుసు. కొత్తవాడు కావటంచేత శాలీషరాయ్‌కి మాత్రం తెలీదు వాళ్ళిద్దరికీ ఇటీవలనే పరిచయమయింది

శాలీషరాయ్‌కి ఇలాటి స్నేహితుడే మరొకడు దాపరించాడు. వాడిపేరు గోకుల పాండే. ఈ పాండే అనేవాడు శాలీషుడికి దారిలో కాశీలో తగిలాడు. అతని కథ అంతా విని, సహాయం చేస్తానని ప్రమాణం చేశాడు. హింగన్‌మియాను పట్టుకున్నవాడు పాండేయే. ఆ దుర్మార్గు లిద్దరూ కలిసి, శాలీషుణ్ణి బీహారుకు సుబేదారును చేస్తామన్నంత ఆశపెట్టి, అతని దగ్గిర ఉన్నదంతా కాజేయ్యాలని చూస్తున్నారు

అయితే శాలీషుడి దగ్గిర చిల్లిగవ్వలేదు. తన యజమానికి ఏ లోపమూ రాకుండా గంగారామే తంటాలు పడుతున్నాడు. తమ రిద్దరూ ఉండటానికి ఆ ముసలివాడు రెండురూపాయల బాడుగకు ఒక పాడుపడిన ఇల్లు సంపాదించాడు.

కాని ప్రతిభ కనిపించినది మొదలు శాలీషుడిలో ఏదో వింత పరివర్తన కలిగింది. అత నేదో విచారంగా ఉన్నట్టు కనిపెట్టి అతని కపటమిత్రులు అతన్ని ఉత్సాహపరచ యత్నించారు. "సు ప్వామీ దిగులుండకు; నీ కోరిక తప్పక సిద్ధిస్తుంది," అన్నాడు పాండే.

"పాదుషేబేగం సమాధి చూసి మనవాడు కొంచెం మందంగా ఉన్నాడు. కాస్త సారా నోటి కిందితే అన్ని విచారాలూ పోతాయి," అన్నాడు హింగన్. వాణ్ణి ఒక్క గెంటుతో బయటికి పంపాలనిపించింది శాలీషుడికి. కాని ఆ ఉద్రేకాన్ని నిగ్రహించుకున్నాడు.

"రంగమహల్‌లో ఉండే ఆపిల్లను తీసుకురావటం మన కొక లెక్కలోనిది కాదు. నీ కోసం ఎంత సాహసమైనా చేస్తాను," అన్నాడు పాండే.

"ఏ పిల్ల" అన్నాడు శాలీషుడు తుళ్ళిపడి.

"ఏ పిల్లేమిటి? ఆ దుర్మార్గుడు శీతబరాయ్ కూతురు. నేనూ, హింగన్ మియా కలిసి ఆ పిల్లను అపహరించి తెచ్చి నీ ఎదుట పెడతాం. పండేజీ తడాఖా నువే చూస్తావు.''

"నా మనసు మారిపోయింది. శీతబరాయ్‌కీ, అతని కూతురికీ అపకారం చెయ్యాలనే ఆలోచన పోయింది," అన్నాడు శాలీషుడు.

అతని మిత్రు లిద్దరికీ పట్టరాని ఆగ్రహం వచ్చింది. "ఘోరం! దారుణం! అన్యాయం!" అని హింగన్ అరవసాగాడు. శాలీషుడు తన స్నేహితులపైన చెయ్యి చేసుకోవలసిన పరిస్థితి ఏర్పడె క్షణంలో గంగారాం వచ్చి, రోషనారా పెద్దనౌకరు గామాసాహెబ్ వచ్చాడని తెలిపాడు.

మరుక్షణంలో దున్నపోతులాంటి గామా వచ్చి, "కుమార్‌సాహెబ్! షాజాదీ రోషనారా మీకు సలాములు పంపారు," అన్నాడు.

# 4

ముంతాజ్‌మహల్ మరణానంతరం ఏర్పడిన పరిస్థితిని రోషనారా ఈ విధంగా అర్థం చేసుకున్నది. పాదుషా ఇక నామమాత్రుడు. ఆయన ఇక దారా చేతనే పరిపాలన చేయిస్తాడు. దారా తన ప్రతినిధి అని నిండుసభలో ప్రకటిస్తాడు. ఇక జహానారాదే రాజ్యం.

అన్నదమ్ముల మధ్య కలహాలు రేపెట్టవద్దని ముంతాజ్‌మహల్ తనను చావబోతూ కోరింది; కాని కలహాలూ, సింహాసనంకోసం అన్నదమ్ములకు మధ్య యుద్ధాలూ మొగలు రాజవంశంవారికి ఆనవాయితీగా ఉన్నవే. కొట్లాటలు వస్తే అవి తన మూలంగారావు; అన్ని అనర్థాలకూ విషబీజం జహానారా పెంచుతున్న పియారాజాన్.

ఈ విషయాలను రోషనారా తన ముఖ్యపరిచారిక అయిన ఫతేమాకు చెబుతూఉండగా, పాదుషా వద్దనుంచి పిలుపు వచ్చింది. ఆమె తన తండ్రి మందిరానికి వెళ్ళేసరికి అక్కడ అందరూ అదివరకే చేరిఉండి, ఆమెకోసం ఎదురుచూస్తున్నారు. పాదుషా ఆమెను తన సమీపంగా కూర్చోబెట్టుకుని, అందరికీ తన నిర్ణయాన్ని తెలిపాడు.

దారా ఇకనుంచీ పాదుషా ప్రతినిధిగా ఉండి, ఆగ్రా, ఢిల్లీ నగరాల పరిపాలన కొనసాగిస్తాడు. షుజా బంగాళా దేశానికి సుబేదారుగా ఉంటాడు. ఔరంగ

జేబు దక్కను పరిపాలిస్తాడు; అతనికి అంబరు రాజా సహాయము ఉంటుంది. మురాద్ గుజరాత్‌ను పాలిస్తాడు.

పాదుషా ఈ విధంగా తననిర్ణయం ప్రకటించి, ఎవరికి ఏ అభ్యంతరమున్నా దాచకుండా చెప్పమన్నాడు. అందరూ ఆయన నిర్ణయాలను శిరసా వహించారు. రంగమహాలు పెత్తనం తనకూతుళ్ళ కిద్దరికీ ఇచ్చి, పాదుషా వారిని ముంతాజ్‌మహల్ స్థానాన్ని ఆక్రమించ మన్నాడు.



మర్నాడు దర్బారులో పాదుషా ఈ తన నిర్ణయాలను అందరి సమక్షానా వెల్లడిస్తూ, "జహానారా పెంచుకుంటున్న బాలికకు గుల్‌బహార్ అని పేరు పెట్టుతున్నాను. ఆమెను దారా కొడుకూ, నా మనమడూ అయిన లాల్జీ కిచ్చి పెళ్ళి చెయ్యటానికి నిశ్చయించాను." అని తెలిపాడు. తాను చేసిన ఈ నిర్ణయం ఎలాటి దుష్పరిణామాలకు దారితీసేదీ ఆయన ఎరుగడు.

తరువాత ఔరంగజేబూ, రోషనారా అతిరహస్యంగా మాట్లాడుకున్నారు.

"పాదుషా దారాకు సింహాసనం ఇచ్చేది ఖాయం. అందుకే ఆయన మా మిగిలిన ముగ్గురినీ ప్రవాసం తోలేస్తున్నాడు. మేం ప్రాణాలతో తిరిగి రాము. రోగాలమారి బెంగాలలో షుజా రోగపీడితుడై చస్తాడు మురాద్ తెగతాగి చస్తాడు. నేను దక్కను అరణ్యాలలో ఏ క్రూరజంతువు వాతనో పడతాను," అన్నాడు ఔరంగజేబ్.

"ఓపరకు రాజ్యం నీదే అవుతుంది. చూస్తూ ఉండు." అన్నది రోషనారా.

"అల్లా స్మరణ చేస్తూ తరించగోరే నాలాటి పకీరుకు రాజ్యం దేనికి?

నా విచారమల్లా ఒక్కటే—మొగలాయీ సామ్రాజ్యం ఛిన్నాభిన్నమయిపోతుంది. దారా చాలావరకు హిందువుడే. అతని మిత్రులంతా హిందువులే. వాళ్ళు దారాను సింహాసనంమీద ఉంచి, యుక్తిగా సామ్రాజ్య విధ్వంసం చేస్తారు," అన్నాడు ఔరంగజేబ్.

రోషనారా విచారగ్రస్తురాలై, మొగలు సామ్రాజ్యాన్ని కాపాడటం మన విధి," అన్నది. ఈ కార్యభారం ఔరంగజేబు వహించేపక్షంలో తాను సహాయం చేస్తానని ఆమె చెప్పింది. తాను దూరాన ఉంటాడు గనుక, ఆగ్రాలో జరిగేదంతా శ్రద్ధగా కనిపెట్టమని ఔరంజేబ్ రోషనారాను హెచ్చరించాడు.

* * *

జహానార మందిరంలో పియారాజాన్—ఇప్పుడు గుల్‌బహార్—కూర్చునిఉండగా ఆమె వద్దకు దారాకొడుకు లాల్జీసాహబ్ వచ్చాడు. అతని వయస్సు పదిహేడే ళ్ళుంటుంది. కుర్రవాడు అందమైనవాడూ, మంచి మనసు గలవాడూనూ; పాదుషాకు అతనంటే ప్రాణం. అతను తరచు, జహానారా మందిరానికి వచ్చిపోతూ, పియారా జాన్‌తో చాలా స్నేహంగా ఉంటాడు. వాళ్ళిద్దరూ అన్నా చెల్లెళ్ళలాగా మసిలే వాళ్ళు. పాదుషాచేసిన ప్రకటనా, నూతన నామకరణమూ గురించి ఆమెను అభినం దింతామని లాల్జీ వచ్చాడు. కాని "గుల్‌బహార్" అత ననుకున్నట్టు ఉత్సాహంగా ఉండకపోగా, విచారంగా కూర్చుని ఉన్నది. లాల్జీ ఆమెను విచార కారణం అడిగాడు.

"మన పెళ్ళి విషయం మరిచిపో; నాకు పెళ్ళాడాలని లేదు," అన్నది గుల్‌బహార్.

"అలా అయితే మనం ఎప్పటిలాగే అన్నాచెల్లెళ్ళలా గుందాం," అన్నాడు లాల్జీ.

## 5

రోషనారా ప్రధాన కొజ్జా అయిన గామా వచ్చి, రోషనారా సలాములు పంపిం దని చెప్పగానే శాలీషుడు నిర్ఘాంతపోయాడు

"రేపు సూర్యాస్తమయం వేళకు రోషనారాబేగంసాహెబా ఖుస్రూబాగ్‌కు వేం చేస్తారు. ఆ సమయానికి నేను వచ్చి నిన్నక్కడికి తీసుకుపోతాను," అని చెప్పి, శాలీషుడు ఏమి అనకముందే, గామా వెళ్ళిపోయాడు.

హింగన్‌మియా శాలీషుడు వీపు అదిరేటట్టుచరిచి, ఫెళ్ళున నవ్వుతూ, "మన తడాఖా ఇప్పుడైనా తెలిసిందా? రోషనారాకు నేనంటే ఎంతో ఇష్టం. అందుకే నీకు ఆమె దర్శనం దొరుకుతున్నది. నువ్విక కోటీశ్వరుడి వయావన్నమాటే. ఆ

శీతబరాయ్ పురుగులుపడిపోతాడు. బెంగాలు, బీహారు, ఒరిస్సాలకు సుబేదారువై పోతావు. ముందు సారా దండిగా తెప్పించు,'' అన్నాడు.

రోషనారా తనను పిలిపించిందంటే నమ్మలేని స్థితిలో ఉన్న శాలీషుడికి హింగన్ అన్న దేదీ తలకెక్కలేదు. ''ఇవాళ నా మనసు మనసులో లేదు. నాకు విశ్రాంతి కావాలి. మీరు పదండి,'' అన్నా డతను తన మిత్రులిద్దరితో.

పాండే ఆగ్రహావేశుడై, "రోషనారా పిలిచిందనేసరికి మాతో పని తీరిందను కుంటున్నావా? ఈ పాండేజీ సంగతి తెలీదులాగుంది. జాగ్రత్త!" అని హుంక రించాడు.

తన మిత్రుల యథార్థ స్వరూపం శాలీషుడి కిప్పు డర్థమయింది. కాని స్థాన బలిమి లేనికారణంచేత అతను వాళ్ళిద్దరినీ బయటికి గెంటలేకపోయాడు. హింగన్ తాగుడుకోసం తహతహలాడుతున్నాడు. గంగారాం ఎక్కడినుంచో ఒక బుడ్డీ తెచ్చాడు. హింగన్ దాన్ని లాగేసుకుని, సారాయి గడగడా తాగేసి, ఖాళీబుడ్డితో గంగారాం నెత్తిన ఒకటి పెట్టబోయాడు. గంగారాం దెబ్బ తప్పించుకుని హింగన్‌ను ఒక్కతన్ను తన్నాడు. హింగన్ దభాలున పడిపోయాడు.

ఆ చప్పుడు విని పాండేజీ చివాలున లేచాడు. శాలీషు డతనితో తాపీగా, "పోట్లాట వృథా. నువు వెంటనే వెళ్ళిపో.. దర్పం చూపించబోయావంటే దేహ శుద్ధి చెయ్యగలను," అన్నాడు. వెంటనే పాండేజీ తగ్గాడు. హింగన్ లేచి పారి పోయాడు. పాండేజీకూడా, మర్నాడు కలుసుకుందా మని చెప్పి వెళ్ళిపోయాడు.

గంగారాం పెట్టిన చపాతీలూ, నాలుగురకాల కూరలూ తిని శాలీషుడు పడు కున్నాడు. కాని అతనికి నిద్ర పట్టలేదు. ఒకరాత్రివేళ గంగారాం వచ్చి, తన యజమాని మేలుకునిఉండటం చూశాడు.

"ఈ వెధవలను వదిలించుకోటానికి తెల్లవారగానే ఇల్లు మారదాం,'' అన్నాడు శాలీషుడు. గంగారాం సామాను సర్ద నారంభించాడు.

అంతలో తలుపుపైన ఎవరో దబదబా బాదారు. తలుపు తెరిచేసరికి ఒక దయ్యంలాటి మనిషి కనిపించి, "కుమార్‌సాహెబ్, షాజాదీ జహానారా రేపు సాయంకాలం అమీనాబాగ్‌లో ఆమె దర్శనానికి రమ్మని చెప్పమన్నారు, సలామ్!" అని చెప్పి వెళ్ళిపోయాడు, అలా చెప్పి వెళ్ళినవాడు గనీ.

పాదుషా కూతుళ్ళిద్దరూ శాలీషుణ్ణి ఆహ్వానించారు. కాని అతనికి ఆగ్రా వదిలి పోవాలనే ఉన్నది. అతను ప్రతిభ తంత్రిపైన పగసాధించే ప్రయత్నం మాను కున్నాడు. ఇంక ఆగ్రాలో అతని కేం పని?

"పని లేకేం? పాదుషా కూతుళ్ళ ప్రాపు సంపాదించి, పోయిన జమీందారీని తిరిగి సంపాదించవచ్చు." అన్నాడు గంగారాం.

ఆ ఆలోచన బాగానే ఉన్నదిగాని, అందులోకూడా చిక్కు లున్నాయి. తనను ఆహ్వానించిన జహానారా, రోషనారాలు బద్ధశత్రువులు. వారిలో ఎవరు తనకు ఉపకారం చేసినా, రెండోవారు తీరని అపకారం చేస్తారు. అదీగాక ఇద్దరూ ఒకే సమయంలో తనను రమ్మన్నారు. అది సాధ్యంకాదు.

"రేపు సాయంకాలం కొజ్జా లిద్దరూ వచ్చేసమయానికి ఇంట్లో లేకుండా ముఖం తప్పించండి. తరవాతమాట చూడవచ్చు. ఇక్కడికి అయిదారు మైళ్ళ దూరాన అరణ్యంలో ఒక పాడుబడిన దేవాలయం ఉంది. ఒకరాత్రి మనం అందులో గడిపాంకూడా. తమ రక్కడికి వెళ్ళి దాక్కోండి. రేపు రాత్రి నే నక్కడికి వచ్చి, సంగతిసందర్భాలు చెబుతాను,'' అన్నాడు గంగారాం.

శాలీషుడు ఆ చీకటిలోనే బయలుదేరి వెళ్ళిపోయాడు.

మర్నాడు అపరాహ్ణం మూడుగంటలకు రోషనారాయొక్క ప్రధాన కొజ్జా గామా, పాతికమంది అశ్వికులనూ, పదహారుమంది బోయీలతోసహా పల్లకీనీ తెచ్చి తలుపు తట్టాడు.

గంగారాం గామాతో, ''హుజూర్, ఏం చెప్పేది? ఇంతకుముందే జహానారా వద్దనుంచి గనీ వచ్చి, నా యజమానిని బంధించి అమీనాబాగ్‌కు తీసుకుపోయాడు. రోషనారాగారివద్దనుంచి గామాగారు వస్తున్నా రని మే మెంత చెప్పినా లక్ష్యపెట్టక, తమరినికూడా నానామాటలూ అన్నాడు," అని చెప్పాడు.

గామాకు పట్టరాని ఆగ్రహం వచ్చింది. గనీని చితకపొడిచి బుద్ధిచెప్పాలని అత ననుకుంటూండగానే గనీకూడా వచ్చాడు. గామా గనీపైకి పులిలాగా దూకాడు. ఇద్దరి వెంటఉన్న సైనికులూ కొట్లకుక్కల్లాగా కలియబడ్డారు. ప్రశాంతంగా ఉన్న ఆ ప్రదేశంకాస్తా యుద్ధరంగంగా మారింది. ఆ సందులో గంగారాం ఎటో జారుకున్నాడు.

గామా, గనీలు సపరివారంగా యుద్ధం చేసుకుంటున్న సంగతి విని దారా కొడుకైన లాల్జీ వెయ్యిమంది సైనికులతోసహా వచ్చాడు. అతను కోటకు పాలకుడు. అతన్ని చూడగానే ఉభయపక్షాలవాళ్లూ సద్దుమణిగారు. లాల్జీ వెంటవచ్చిన సైనికులు అతని ఆజ్ఞపై గామానూ, గనీనీ బంధించి తీసుకుపోయారు.

ఈలోపల ఖుస్రూబాగ్‌లో రోషనారా, అమీనాబాగ్‌లో జహానారా, శాలీషుడు కోసం ఎదురు చూస్తుండగా, వారి నౌకర్లు వచ్చి గామాకూ, గనీకీ పెద్దయుద్ధం

జరిగినట్టు చెప్పారు. అసలే హెచ్చుగాఉన్న అక్క-చెల్లెళ్ళ స్పర్థలు మరింత పెరిగాయి. ఇదరూ పాదుషాదగ్గిరికి వెళ్ళి, తమ కొజ్జాలను వెనకవేసుకొచ్చి ఫిర్యాదు చేశారు

హీనులైన నౌకర్లకోసం చెల్లెళ్ళు కలహించటం అనుచితమని హితవు చెప్పి, పాదుషా గామా గనీలను నిర్బంధంనుంచి రప్పించి, విచారణ జరిపాడు. ఆ విచారణలో రోషనారా జహానారాలు, ఎవరో బెంగాలీ యువకుడికొరకు కొజ్జాలను పంపినట్టు తెలిసింది ఆ యువకుణ్ణి వాళ్ళిద్దరూ ఎరగరు. అతను తన కుమార్తెను కోరినట్టు జహానారా చెప్పింది. అతని కేదో ఉద్యోగం ఇప్పించగోరినట్టు రోషనారా చెప్పింది. ఆ బెంగాలీయువకుణ్ణి తీసుకురమ్మన్నాడు పాదుషా.

"అతను నిన్నరాత్రి ఆగ్రా విడిచి వెళ్ళిపోయినాడు," అన్నాడు లాల్జీ.

# 6

తెల్లవారగట్ల మూడుగంటలకు ఇంటినుంచి బయలుదేరిన శాలీషరాయ్ గ్వాలియరు రోడ్డుపట్టుకుని నడవసాగాడు. తన నెవరో వెంబడిస్తున్న సంగతి అతనికి తెలీదు. తాను ఎంతదూరం నడిచినదీ అతనికి తెలీదు. తెల్లవారింది. పొద్దుకూడా బాగా ఎక్కింది. ఇంకా పాడుబడిన దేవాలయం రానేలేదు. అతను దారితప్పాడు.

ఏం చెయ్యటానికీ పాలుపోక అతను అటూ ఇటూ చూశాడు. ఒక చెట్టువెనక ఒక స్త్రీ కనిపించి, "దారితప్పినట్టున్నావే, నాయనా ? నువ్వెక్కడికి వెళ్ళాలి ?" అని అడిగింది.

"ఈ అరణ్యంలో ఒక పాడుపడిన దేవాలయం ఉంది. అక్కడికి దారి ఏది ?" అన్నాడు శాలీషుడు.

"త్రిపంధేశ్వరాలయమా ? అక్కడ దొంగలూ, దోపిడిగాళ్లూ చేరుతారే ! అయితేమిటుకు నా కేం ? ఆ పొదలమధ్యగా ఇరుకుదారి కనిపిస్తున్నదే, దాన్నిబట్టి వెళ్ళు," అన్న దామె.

శాలీషు డామెకు తన కృతజ్ఞత తెలుపుకుని, ఆమెచెప్పిన దారినే వెళ్ళాడు. అతన్ని కొంతదూరం పోనిచ్చి, ఆ స్త్రీకూడా అటే బయలుదేరింది. అతను చాలా దూరం వెళ్ళినమీదట అడవి అఖరై అంతకన్న కూడా దట్టమైన అరణ్యం మరొకటి వచ్చింది. ఆ స్త్రీ తనను మోసగించిందేమో నని అత ననుకున్నాడు. కాని కొంత సేపటికి అతను ఆ పాడుబడిన ఆలయం చేరుకున్నాడు. అతని ఆనందానికి మితిలేదు.

అయితే అత నింకా ఆలయానికి అంతదూరంలో ఉండగానే, ఎవరో ఆలయం లోకి వెళ్ళటం కనిపించింది. ఆ మనిషి స్త్రీలాగున్నది. అతను ఆలయాన్ని సమీపించే సమయంలో అడుగులచప్పుడు వినిపించింది. గంగారాం రాత్రికిగాని రాడు; ఒకవేళ ముందే వచ్చాడేమో నని అటూ ఇటూ చూస్తే ఎవరూ కనిపించలేదు. "గంగారాం !" అని కేక పెడితే ప్రతిధ్వనితప్ప మరొక జవాబులేదు. ఎవరో నవ్వినట్టుగా అతనికి తోచింది.

అతను ఆలయం ప్రవేశించాడు. లోపల లింగం ఉన్నది. దానికి రెండుపక్కలా రెండు పాడుబడిన గదులున్నాయి పక్కనే పూజారి ఇల్లున్నది. ఏ వాకిలికీ తలుపులు లేవు. దొంగ లెత్తుకుపోయారు.

అపరాహ్ణం దాటుతున్నది; ఆకలి మండిపోతున్నది. దాన్ని ఎలాగైనా తృప్తి పరచాలి. అక్కడికి ఫర్లాంగు దూరంలో బెంగాలునుంచి పెషావరుకు పోయే రహదారి ఉన్నది. ఒకప్పుడు శాలీషుడూ, గంగారామూ ఆ రహదారినే వచ్చి ఈ ఆలయంలో రాత్రి గడిపారు. కాని బాటన నడిచి నడిచి అత నా రహదారి చేరి ఆశ్చర్యపోయాడు. ఇప్పు డా ప్రదేశంలో ఒక పెద్దశిబిరం ఉన్నది. కొంచెం దూరంగా రెండుమూడు గుడిసెలూ, ఒక అంగడీ, ఒక మంచినీటిబావీ ఉన్నాయి. ఈ శిబిరం వెనక లేదు. ఈ శిబిరంవెంట నూరుగుర్రాలూ, రెండువందలమంది పరిచారకులూ, ఒక పల్లకీ, అక్కడక్కడా గుడారాలూ ఉన్నాయి. వంట సన్నాహంతో శిబిరం సందడిగా ఉన్నది. ఎవరో గొప్పవాళ్ళు యాత్రచేస్తూ మజిలీచేసినట్టున్నది.

అతను అంగడికి వెళ్ళేసరికి అక్కడ చాలమంది బెంగాలీలు కనిపించారు అతనికి చాలా సంతోషమయింది. కాని అతను ఆ శిబిరం గురించి అడిగితే వాళ్ళేమీ చెప్పలేదు. గంగారాం వచ్చి అన్ని రహస్యాలూ అరాతీస్తాడు లెమ్మనుకున్నా డతను. అతను అంగడిలో తినుబండారాలు కొని బావిదగ్గిరికి వెళ్ళి, వాటిని తిని, ఇంత నీరు తాగాడు. అతను ఆలయంవద్దకు తిరిగి వెళ్ళుతూ ఒక చెట్టుకింద పచ్చికపైన నడుంవాల్చి, చాలా బడలిఉండటాన వెంటనే నిద్రపోయాడు.

అత నలా నిద్రపోయే సమయంలో ఒక భయంకరాకారం గల ముసలిది అతన్ని సమీపించి, అతని ముఖంలో ముఖం పెట్టి చూసి, అతని తలకింద మెత్తని ఆకులను ఎత్తుగా అమర్చి. అంతలో ఏదో అలికిడి వినిపించేసరికి చప్పున ఆలయం లోకి వెళ్ళిపోయింది.

ఆ క్షణంలోనే మరొక స్త్రీ అటుగా వచ్చి శాలీషుణ్ణి చూసి, ఆలయాన్ని సమీపించి, లోపల కూర్చునిఉన్న సన్యాసినిని చూసింది. ఆ సన్యాసిని జడలు ధరించి, భయంకరమైన త్రిశూలం ధరించి ఉన్నది. ఆ సన్యాసిని రెండవ స్త్రీని లోపలికి పిలిచి, చిరునవ్వు నవ్వుతూ, ''ఎందుకమ్మా, ఈ వేషం ధరించావు ? మహమ్మదీయ స్త్రీలై ఉండి హిందువుల వేషం దేనికి ? నీ పదహారేళ్ళ వయసు దాచడానికా ముఖం నిండా రంగు మెత్తావు. రంగమహలులో ఉండవలసిన నీవు ఈ బెంగాలీ కుర్రవాణ్ణి వెంటాడుతూ ఇలా అడవుల్లో తిరగట మేమిటి ? నీ రంగ మహలుకు వెళ్ళిపో,'' అన్నది.

రెండో స్త్రీ నవ్వి, 'నేను మోతియానని నువు గుర్తించినట్టే ను వ్వెవరో కూడా నేను గుర్తించాను. వెర్రిదాని వేషం మానేసి సన్యాసిని వయావు, ' అన్నది.

# 7

పాదుషా తన కొడుకులలో ఔరంగజేబ్‌ను దక్కనుకూ, షూజాను బెంగాలుకూ, మురాదును గుజరాతుకూ పంపాడు.

షూజా బయలుదేరేటప్పుడు లాల్జీ తన పినతండ్రితో, "బెంగాలు పరిపాలనలో నీకు సహాయంగా ఉండటానికి నే నొక దివానును శిఫార్సు చేస్తాను. అతన్ని తప్పక పెట్టుకో,'' అన్నాడు. షుజా సరే నన్నాడు.

అందరికన్నా ఔరంగజేబు ముందుగానే సపరివారంగా బయలుదేరాడు; కాని నలభై మైళ్ళ దూరం వెళ్ళి, అక్కడ శిబిరం ఏర్పాటు చేసుకుని ఆగిపోయాడు.

అందరికన్న అయిష్టంగా బయలుదేరినవాడు మురాద్. అతనికి తాగుడూ, స్త్రీలూ ఉంటే ఇంకేమీ అవసరం లేదు. అతనికి గుజరాతు పరిపాలన గాని, సామ్రాజ్యాభిషేకం గాని, ఏ మాత్రమూ రుచించదు. ఔరంగజేబు శిబిరం కనిపించ గానే మురాద్ కూడా ఆగిపోయాడు.

ఔరంగజేబు అతనికి చాలారకాల బోధలు చేశాడు. దారా పాదుషా అయితే సామ్రాజ్యం ధ్వంసమవుతుంది. అతను సరిఅయిన ముసల్మానుకూడా కాడు. శానా అన్నీ విడిచిన ఫకీరు. అందుచేత మురాద్ మొగలు సింహాసనం ఎక్కడం అన్నివిధాలా క్షేమం. ముందుగా అతను జహానారా పెంపుడు కూతురు పియారా జాన్‌ను పెళ్ళాడటం అవసరం.

''అది ఎలా సాధ్యం ? ఆమె లాల్జీని పెళ్ళాడాలని పాదుషా ఉత్తరు విచ్చాడే?'' అన్నాడు మురాద్.

''అందు కేదో ఉపాయం చెయ్యాలి,'' అన్నాడు ఔరంగజేబ్...

రంగమహలులో ఉన్న పియారాజాన్ (ప్రతిభ, గుల్బహార్) తాను భావి సార్వభౌముడైన లాజ్జీని పెళ్ళాడబోతున్నానన్న ఆనందంతో ఓలలాడటానికి మారుగా, విచారసాగరంలో మునిగిపోయింది. ఆ బెంగాలీయువకుడు శాలీషరాయ్ తన తండ్రిపై ఎందుకు కత్తి కట్టాలి? అతన్ని మార్చే ఉపాయ మేమిటి?

ఆమెకు రంగమహల్‌లో ఉన్న ఒక్క ఆప్తురాలూ మోతియా అనే బానిస పిల్ల. ఆమె పియారజాన్ కన్న కొంచెం పెద్దది, మంచి ధైర్యసాహసాలు కలది. పియారాజాన్ విషాద కారణం తెలుసుకున్నాక, ఆమె ఆ బెంగాలీ యువకుణ్ణి ప్రేమిస్తున్నదని మోతియా గ్రహించింది. ఆమె పియారాజాన్‌కు ధైర్యం చెప్పి, శాలీషరాయ్ అపరాత్రివేళ బయలుదేరేటప్పుడు అతన్ని వెన్నంటి వెళ్ళి, చిట్ట చివరకు దేవాలయంలో సన్యాసినిని కలుసుకున్నది.

ఒకరి మారువేషం ఒకరు పసిగట్టారు గనక ఆ స్త్రీ లిద్దరూ ఒకరిసంగతి ఒకరికి తెలుపుకో నారంభించారు. మోతియా తన సంగతి చెప్పింది.

"షాజాదీజహానారా పెంచుకుంటున్న బెంగాలీపిల్లకు నేను స్నేహితురాలిని. ఇక్కడికి వచ్చిన బెంగాలీయువకు డామె తండ్రిపైన అకారణంగా పగబట్టాడు. ఆ పిల్ల దైవికంగా ఈ యువకుణ్ణి కలుసుకుని అతన్ని ప్రేమించి. అతని వైఖరి గురించి తీరని బాధ పడుతున్నది. నిన్న రాత్రి ఇతని ఇంటిబయట అరుగుమీద పడుకుని ఒక్కసంగతి తెలుసుకున్నాను. ఇతను తన ప్రియురాలి తండ్రిపైన పగ విడిచిపెట్టేశాడు. అయినా వారి ప్రణయానికి మార్గం ఏర్పడలేదు. ప్రబల శత్రువులైన రోషనారా జహానారా లిద్దరూ ఒకే సమయంలో ఇతన్ని పిలవ నంపారు. వారిని చూడటం ఇష్టం లేకనేమో ఇత ఇలా పారిపోయి వచ్చాడు. వా రెందుకు పిలిచినదీ నాకు తెలియదు."

సన్యాసిని చెప్పింది.

"నేను తీర్థయాత్ర చేస్తూ బెంగాలునుంచి వస్తున్నాను. సమీపంలో ఉన్న శిబిరం నాదే. నా భర్త చాలా గొప్పవాడు. నీ కాయన తెలీదు. ఈ బెంగాలీ యువకుడు నాకు దగ్గిర బంధువు. ఇప్పుడే నా కితని జాడ తెలిసింది. ను వ్వితన్ని వెంటాడటం చూశాను. అతన్ని కాపాడాలని ఈ మారువేషం వేశాను. ను వ్వితనికి ద్రోహం తలపెట్టటం లేదని తెలిసి నాకు చాలా సంతోషమయింది."

వా ళ్ళిలా మాట్లాడుకుంటూండగానే దూరాన గుర్రాల నడకధ్వని వినిపించింది. మోతియా అవలీలగా పక్కనున్న చెట్టెక్కి చూసి, మొగలాయీ సైనికులు వస్తున్నారని తెలిసింది. వాళ్ళు శాలీషుడికోసం వచ్చే రోషనారా సైనికులో,



జహానారా సైనికులే కావచ్చు. శాలీషుణ్ణి నిద్రలేపి, గుడిలోకి తీసుకురావటానికి మోతియా పరిగెత్తింది.

## 8

మోతియా వెళ్ళిపోయినది మొదలు గుల్‌బహార్ ముళ్ళమీద ఉన్నది. తన ప్రియుడు తన తండ్రిపైన పగబట్టాడన్న బాధకు మరిరెండు బాధలు తోడయాయి. విన్ననగా వెళ్ళిన మోతియా ఇంకా తిరిగిరాలేదు. తన ప్రియుణ్ణి వెతికి పట్టుకో మని పాదుషా వుత్తరువు జారీచేశాడు. అతని కే అపాయం వాటిల్లుతుందో నన్న భయం ఆమెను పూర్తిగా వివశురాలిని చేసింది.

ఈ స్థితిలో ఉండగా, "గుల్ !" అని పిలుస్తూ లాల్జీ ఆమె వద్దకు వచ్చి ఆమె మనస్థితి గ్రహించి విచారకారణ మడిగాడు. ఆమె వాస్తవం పూర్తిగా బయటపెట్ట సంకోచించింది. కాని అతని కంతా అదివరకే తెలుసును.

"విచారించకు. నీ ప్రియుడు శాలీషుడూ, మోతియా ఫతేపూర్ అరణ్యం లోని ఒక శిథిల దేవాలయంలో ఉన్నారు. అతన్ని తీసుకురావటానికి సైనికులను పంపాను. పాదుషా ఆజ్ఞ. అతను చేసిన తప్పేమీలేదు. కాని అతని కారణంగా గనీ, గామాలు యుద్ధానికి తలపడ్డారు. పాదుషా విచారణ జరుపుతారు. నీ ప్రియుణ్ణి బెంగాలుకు దివానుగా నియమించబోతున్నాను," అన్నాడు లాల్జీ.

రోషనారా, జహానారాలు అతనికోసం ఎందుకు కబురుచేశారోకూడా అత నామెకు తెలిపాడు. హింగన్ ఖాన్ అనేవాడికోరికపై రోషనారా అతనికి దర్శన మియ్యదలచింది. తన పెంపుడు కూతురికి అతను బంధువు అని తెలిసి జహానారా పిలిపించింది.

"కాని నే నా యువకుణ్ణి గురించి షాజాదీతో ఎన్నడూ చెప్పలేదు." అన్నది గుల్బహార్.

ఇంతలో లాల్జీకి కబురువచ్చింది. అతను తన కచేరికి వెళ్ళాడు. అతని సైనికులకు శాలీషుడూ, మోతియా దొరకలేదుగాని, ఆలయానికి పోతూ గంగారాం దొరికాడు. లాల్జీకి ఏమీ అంతుబట్టలేదు — గుడిలోకి వెళ్ళిన శాలీషుడూ, అతని వెంటఉన్న మోతియా ఎలా మాయమయారు? అతను తన సైనికులపైన మండిపడి, గంగారాంను ప్రశ్నించసాగాడు. కాని గంగారాం మొండిఘటం. వాడు ఏవేవో అసందర్భాలు మాట్లాడాడుగాని తనయజమానిని గురించిమాత్రం ఏమీ చెప్పలేదు. నీ యజమాని ఏమయాడంటే, తెల్లారి చూసేసరికి లేడన్నాడు. నువు పాడుబడిన గుడికేసి ఎందుకు వెళ్ళావంటే పరధ్యానంగా వెళ్ళానన్నాడు. లాల్జీ బెదిరించినమీదట వాడు కిందటిరోజు జరిగినది జరిగినట్టుగా తెలిపాడు. శాలీషుడి జాడ వాడికికూడా తెలీదు.

లాల్జీ గుల్బహారువద్దకు వెళ్ళి తన సైనికులు తిరిగివచ్చారనీ, మోతియా జాడగాని, శాలీషుడి జాడగాని తెలియరాలేదనీ, తానే స్వయంగా వెతకబోతున్నాననీ చెప్పాడు. గుల్బహారుకూడా అతనివెంట వస్తానన్నది. గాని అది సాధ్యం గాదని చెప్పి, లాల్జీ వెళ్ళిపోయాడు.

చీకటిపడేవేళ అతను వందమంది అశ్వికులనూ, వందమంది దివిటీలవాళ్ళనూ వెంటబెట్టుకుని, గ్వాలియరు ద్వారంనుంచి కోట దాటి బయలుదేరాడు. అత నలా నాలుగుమైళ్ళు వెళ్ళాక అటుగా అంతకుముందే గుర్రాలమీద, ఒక పల్లకీతోసహా వెళ్ళిన జాడ లతనికి కనిపించాయి. అతను వారిని వెన్నాడ సంకల్పించాడు.

లాల్జీ కోటనుంచి బయలుదేరేసమయంలోనే, రోషనారా చెలికత్తె అయిన ఫతేమా అనేది, అంతఃపురంలోని చీకటిసందులో ఎవరితోనో రహస్యంగా మాట్లాడి తిన్నగా జహానారా మందిరానికి వెళ్ళింది. సాధారణంగా అక్కాచెల్లెళ్ళ దాసీలు ఒకరిమందిరాల కొకరు వెళ్ళరు. కాని జహానారా మందిర రహస్యాలు తెలుసుకునేటందుకు రోషనారా తన అక్కదాసీలలో కొందరిని డబ్బుతో కొని ఉంచింది. అలాటి దాసీ ఒకటి ఫతేమాకు ఎదురువచ్చింది. ఇద్దరూ కాస్సేపు గుసగుస లాడుకున్నమీదట జహానారా దాసీ వెళ్ళి, గుల్బహారును వెంటబెట్టుకుని వచ్చి తాను మెల్లిగా తప్పుకున్నది.

ఫతేమా గుల్బహారుకు శాలీషరాయ్ నుంచి ఒక ఉత్తరం తెచ్చానని చెప్పి, ఆమె నొక దీపంఉన్న గదికి తీసుకుపోయింది. గుల్బహార్ ఆ ఉత్తరాన్ని ఇలా చదువుకున్నది :

"శ్రీమతి ప్రతిభాదేవికి, నేను నీ ప్రాణం కాపాడిననాడు నాకు ప్రత్యుపకారం చేస్తానని మాట ఇచ్చావు. నే నిప్పుడు పడరానిపాట్లు పడుతున్నాను. నా పైన ఏమాత్రం ప్రేమ ఉన్నా ఈ రాత్రి ఒంటిగంటకు తాజ్‌మహల్ ఉద్యానవనానికి రా. నువు రాకపోతే నాగతి ఏమవుతుందో చెప్పలేను. ఇట్లు, శాలీషరాయ్."

తన అసలుపేరు శాలీషుడికి మాత్రమే తెలిసిఉండటంచేత గుల్బహారా ఉత్తరాన్ని నమ్మింది. ఆమెకు వెళ్ళాలనే ఉన్నది. కాని అది సాధ్యంకాదేమోనని ఆమె భయపడింది.

"నీ చేతిన ఉంగరం ఉండగా నిన్నెవ రడ్డగలరు?'' అన్నది ఫతేమా. గుల్బహారు వేగంగా బయలుదేరింది. తన కుతంత్రం ఫలించినందుకు ఫతేమా చాలా సంతోషించింది. ఆమె తన ఇంటికి వెళ్ళి, బట్టలు మార్చుకుని నడిరాత్రి నగారా మోగేదాకా అటూఇటూ పచార్లుచేసింది. తాను బయటికి పోతున్నానని చెప్ప దగిన లాల్జీ, మోతియా లిద్దరూ లేరు. ఎవరికీ చెప్పకుండా వెళ్ళటంవల్ల తనకు అపాయం కలుగవచ్చు. కాని తన ప్రియుణ్ణి కలుసుకునేటందు కామె సాహసం చేయ సంకల్పించింది.

అర్ధరాత్రి నగారా మోగింది. గుల్బహారు రహస్యమార్గంగుండా బేగం మహలునుంచి బయటికి వచ్చింది. ముంతాజ్‌మహలు చనిపోయినప్పుడు పాదుషా ఆ మార్గానే తాజ్‌మహల్ చేరాడు. ఆ మార్గం చివర ఒక ద్వారమూ, దాని కొక తాళమూ ఉన్నాయి. తాళపుచెవి ఆమెవద్ద ఉన్నది. కాని ఆ తలుపుకు బయటినుంచి తాళం వెయ్యటానికి లేదు. ఆ ద్వారం తెరచిఉంచటం గొప్ప నేరం. అయినా ఆమె దేవుడిపైన భారంవేసి, ఆ ద్వారానికి తాళం వెయ్యకుండానే ఉంచి ముందుకు సాగింది. తనవెంట ఇంకొక మనిషి ఉండినసంగతి ఆమె ఎరగదు.

ఆమె చీకట్లో పడి తాజమహలు చేరుకుని, అక్కడ తన ప్రియుడికోసం ఎదురుచూడసాగింది. అకస్మాత్తుగా ఇద్దరు బలవంతు లామెమీదపడి, నోరూ, కాళ్లూ, చేతులూ కట్టేసి, ఆమెను వేగంగా మోసుకుని పోసాగారు. వాళ్ళలా కొంతదూరం వెళ్ళేసరికి మరో ఇద్దరు బలాఢ్యులు వాళ్ళపైన బడ్డారు. మొదటి ఇద్దరూ ఆమెను జారవిడిచి రెండవ జట్టుతో పోరాడసాగారు. వాళ్ళలా పోరాటంలో నిమగ్నులై ఆమెకు కొంచెం దూరంకాగానే, ఎవరో ముగ్గురువచ్చి గుల్బహారు నెత్తుకుని పారిపోయారు.

ఒక పావుగంట గడిచాక మొదటి ఇద్దరూ రెండోజంటను చంపేసి గుల్బహారుకోసం వెతికారు. ఆమె కనిపించలేదు. దూరాన ఎవరో పరుగెత్తుతున్న ధ్వని వినిపించి వా రటుగా పరిగెత్తి ఒక స్త్రీని పట్టుకున్నారు.

"నన్ను విడవండి. నేను మీకు కావలసినదాన్ని కాను." అని ఆమె కేక పెట్టింది.

"ఈ రాత్రివేళ ఇక్కడ ఇంకొకతె ఎందుకుంటుంది? నువే." అన్నారు వాళ్ళు. ఆమె చెప్పేది వినిపించుకోకుండా వాళ్ళామెను బంధించి మోసుకుపోయారు. కొంతదూరం పోగా రెండు గుర్రాలు నిలబడిఉన్నాయి. వాళ్ళిద్దరూ చెరొకదాని పైనా ఎక్కి, ఒకదానిమీద ఆమెనుకూడా ఎక్కించి, అతివేగంగా ప్రయాణం సాగించారు. రెండుమైళ్ళు ప్రయాణించి వాళ్ళు అరణ్యంలో ఇంకా అనేకమంది అశ్వికు లున్నచోటికి చేరారు.

వారిలో ఒకడు, ''పని జరిగిందా? సరే, ఆమెను పల్లకిలో కూర్చోబెట్టండి,'' అన్నాడు.

లాల్జీ కనిపెట్టినది ఈ మనుషుల జాడే. అతను త్వరలోనే వారిని కలుసుకుని, "ఆగండి! ఎవరు మీరు? నా అనుమతి లేకుండా ఎలా ప్రయాణిస్తున్నారు? సరయిన సంజాయిషీ ఇవ్వకపోతే దారుణంగా శిక్షిస్తాను,'' అని కేకపెట్టాడు. అతని పరివారం "షాదాకు జై!'' అని గట్టిగా అరిచారు.

వెంటనే దొంగలు చెల్లాచెదరుగా పారిపోయారు. బోయీలు పల్లకీని జార విడిచి మరీ పారిపోయారు. ఆ చీకట్లో వాళ్ళు సైనికులకు చిక్కలేదు.

లాల్జీ దివిటీలు వెలిగించమని ఆజ్ఞాపించి, పల్లకీలో బంధించబడి ఉన్న స్త్రీని కట్లు విప్పించి, ఆమెకు స్పృహ తప్పిందని తన మనుషులు చెప్పేసరికి, కోటకు చేర్చమని ఉత్తరు విచ్చాడు. రసూల్ ఖాన్ అనేవాడు మరి పన్నెండుమందితో సహా పల్లకి వెంట ఆగ్రాకు తిరిగి వెళ్ళాడు. లాల్జీ తిరిగి పాడుబడిన గుడికేసి బయలు దేరాడు.

రసూలుఖాన్ వెంట వెళ్ళినవారు మధ్యదారిలో కాస్సేపు విశ్రమించటానికి అనుమతి వేడారు. ఒక పావుగంట విశ్రాంతి తీసుకోవటానికి రసూల్ ఖాన్ అనుమతి ఇచ్చాడు. పల్లకీని ఒక చెట్టుకింద దించి వాళ్ళు బయలు ప్రదేశంలో అక్కడక్కడా చతికిలబడి సుఖం పొందారు. పావుగంట తరవాత వాళ్ళు పల్లకీ ఎత్తితే అది తేలికగా ఉన్నట్టు వారి కనిపించింది. వాళ్ళు దాన్ని మరింత ఉత్సాహంతో మోస్తూ ఆగ్రాకోటకు పోయారు.

లాల్జీ పాడుబడిన దేవాలయాన్ని చేరుకునేసరి కింకా తెల్లవారలేదు. ఆ ప్రాంతంలో ఎవరు కనిపించినా పట్టుకోమని అతను తన సైనికులతో చెప్పాడు.

క్రమంగా తెల్లవారింది. లాల్జీ తన సేనాపతిని వెంటబెట్టుకుని దుకాణంకేసి

వెళ్ళి, దుకాణదారును నిద్ర లేవగొట్టి, అతనివద్ద బొక్కెన తీసుకుని, బావివద్దకు వెళ్ళి, అక్కడ నమాజు చేసి, దుకాణదారుకు డబ్బిచ్చి, తన పరివారానికి భోజనం తయారు చేయించ మన్నాడు.

ఆ సమీపంలోనే శిబిరం వేసిన జాడలు కనిపించాయి. దాన్నిగురించి దుకాణ దారు నడిగితే, "ఎవరో బెంగాలు దేశపు రాణీగారట, ఇక్కడ కొన్నాళ్ళు మకాం వేసి, నిన్ననే వెళ్ళిపోయారు. ఆమెను రాణి చేసినది ముంతాజ్‌మహల్ బేగమ్ గారేనట," అన్నాడు.

"దులాలీ! దులాలీ ఇటుగా వచ్చిందా?'' అనుకున్నాడు లాల్జీ ఆశ్చర్యంతో.

దులాలీకి పెళ్ళిచేసింది లూలియాయే. (షాజాదా కరీమ్ పాదుషా కాగానే లూలియా ముంతాజ్‌మహల్ అయింది.) ఈ పెళ్ళికి దులాలీ ఒకంతట ఒప్పుకో లేదు. కారణ మేమంటే ఆమెకూడా కరీమునే ప్రేమించింది. అది తెలిసి లూలియా ఆమెనుకూడా కరీమునే పెళ్ళాడమన్నది. కాని దులాలీ గాభరాపడి నిరాకరించింది. పాదుషాకు ఈ మాట తెలిస్తే ఆత్మహత్య చేసుకుంటా నన్నది. తరవాత దుల్లాలీకి ఒక బెంగాలీ యువకుడు వరుడుగాదొరికాడు. అతనికి షాజహాన్‌పాదుషా రాజా బిరు దిచ్చి, తూర్పు బెంగాలుకు సుబేదారుగా నియమించాడు.

ఇదంతా లాల్జీ పుట్టకపూర్వం జరిగిన కథే; కాని అతడు దులాలీ కథ ఎన్ని సార్లో విన్నాడు. ఆమెను గురించి అతనికి అంతా తెలుసును. ఇప్పు డదంతా అతనికి జ్ఞాపకం వచ్చింది.

''నువు ఈ బెంగాలు రాణీని చూశావా?'' అని లాల్జీ దుకాణదారు నడిగాడు.

"ఆమె ఎవరో తెలియరాలేదు, మహారాజా! ఆమె మనుషులు చెప్పటం ఆమె ఒకతే వచ్చినట్టు చెప్పారు; కాని నేను ముగ్గురు స్త్రీలను చూశాను,'' అన్నాడు దుకాణదారు జయమల్లు.

"ముగ్గురా? వారిని చూశావా?"

"చిత్తం. అందులో ఒకతె వెర్రిది.''

వెర్రి దనగానే లాల్జీకి, ముంతాజ్‌మహల్‌ను సమాధి చేసిననాటి వెర్రిది జ్ఞాపకం వచ్చింది. ఆ వెర్రిది ఇంకా ఈ ప్రాంతాలనే ఉన్నదా?

వెర్రిదాన్నేగాక, పల్లకీలో వెళ్ళే మహారాణినీ, ఒక భైరవినీకూడా తాను చూసి నట్టు దుకాణదారు చెప్పాడు. అతని మాటలు లాల్జీకి అసందర్భంగా తోచాయి. వెర్రిది రాణి గుడారంలోకి పోవటమూ, మరొకసారి గుడిలోకి పోవటమూ తాను చూసినట్టు దుకాణదారు చెప్పాడు. భైరవివెంట మరి ఇద్దరు భైరవు లున్నా

రనీ, వారు ముగ్గురూ రాణిగారి గుడారంకేసి పోవటం తాను చూశాననీ, గుడారా లెత్తటంకూడా ఆకస్మికంగా జరిగిందనీ అతడు చెప్పాడు.

దులారీ వెర్రిదాని వేషమూ, భైరవి వేషమూ అవలీలగా వేయగలదు. కాని ఆమె వెంట ఉండిన భైరవు లెవరు?

లాల్జీ దుకాణదారుతో మాట్లాడుతుండగానే అతని సైనికులు తిరిగి వచ్చి ఎక్కడా ఎవరూ కనిపించలేదని చెప్పారు.

"ఇక మన కిక్కడ పని లేదు. ఆగ్రాకు తిరిగి వెళ్ళవచ్చు," అన్నాడు లాల్జీ తనవాళ్ళతో.

ఇంతలో ఇనాయత్‌ఖాన్ అనే వాడు నురుగులు కక్కుతున్న గుర్రం మీద వచ్చి లాల్జీతో, "రాజభవనం గగ్గోలుగా ఉన్నది. గుల్బహార్ ఎక్కడా కనిపించటం లేదు," అని చెప్పాడు.

లాల్జీ కంగారు పడలేదు. తాను కాపాడి, పల్లకీలో రాజభవనానికి పంపినది గుల్బహారునే అయిఉంటుం దనుకున్నాడు. ఫతేమా, మోతియాలు కూడా కనిపించటం లేదని ఇనాయత్‌ఖాన్ చెప్పాడు. గుల్బహారు బయలుదేరటం గనీ గమనించి ఆమె వెనకగా ఇద్దరిని పంపాడు. ఎవరో గుల్బహారును ఎత్తుకుపోతూ ఉండటం కనిపెట్టి గనీ మనుష్యులు వాళ్ళతో యుద్ధం చేసి చచ్చారు. ఈ కుట్రతో ఫతేమాకు సంబంధం ఉంది. ఇదంతా పాదుషాకు తెలిసింది. ఆయన లాల్జీ రాక కోసం ఎదురు చూస్తున్నాడు.

"భయపడకు. నేను గుల్బహారును రక్షించి, సురక్షితంగా దుర్గానికి పంపాను," అన్నాడు లాల్జీ.

"తమరు పంపిన పల్లకీలో గుల్బహారు చేరలేదు. అందుకే ఈ ఆందోళన. ఆమె జాడ తెలియటం లేదు," అన్నాడు ఇనాయత్‌ఖాన్.

లాల్జీ అక్కడ ఒక్క క్షణమైనా నిలవలేక గుర్రంమీదికి లంఘించి ఆగ్రాకు ప్రయాణమయాడు. అతను కోటను చేరేసరికి కోటచుట్టూ ఫిరంగు లమర్చి యుద్ధం జరగబోతున్నట్టుగా ఉన్నది.

గుజరాతుకు పాలకుడుగా బయలుదేరిన మురాద్ తన సైన్యంతోసహా ఆగ్రా పైకి దండెత్తి వస్తున్నట్టు తెలిసి లాల్జీ ఆశ్చర్యపడ్డాడు. అందుకే ఈ సమరసన్నాహం.

రసూల్‌ఖాన్ కనిపించి, దారిలో బోయీలు కాస్సేపు పల్లకీ దించారనీ, పల్లకీ ఆగ్రా చేరేసరికి అందులో ఎవరూ లేరనీ చెప్పాడు. లాల్జీ చిరాకుపడి, తన కోసం ఎదురుచూస్తున్న పాదుషాను చూడబోయాడు.

# 9

యోధుడి వేషం ధరించి లాల్జీ తన తాతగారి మందిరానికి వెళ్ళేసరికి అక్కడ జహానారా మాత్రమే గాక, రోషనారాకూడా ఉన్నది. బాలీసులకు ఆనుకుని పడుకుని ఉన్న ముసలిపాదుషా చేతిలో రెండు ఉత్తరా లున్నాయి. లాల్జీ రాగానే ఆయన వాటిని అతని కిచ్చి, చదవమన్నాడు. అందులో ఒకటి మురాదు పాదుషాకు రాసిన ఉత్తరం; రెండోది ఔరంగజేబు మురాదుకు రాసినది.

మురాదు తన తండ్రి కిలా రాశాడు:

"కొన్ని రాజకీయ కారణాలవల్ల గుల్బహారును నేను పెళ్ళాడ నిశ్చయించాను. నా ప్రార్థన మన్నించి మీ రిందుకు సమ్మతించండి. లేనిపక్షంలో నాకు ఆగ్రాపైన దండెత్తటం తప్ప గత్యంతరం ఉండదు. రాజకీయంగా ఈ వివాహం జరిగి తీరాలని నా అన్న ఔరంగజేబ్ కూడా ఒప్పుకున్నాడు. అతని ఉత్తరం కూడా పంపుతున్నాను. — మీ కుమారుడు మురాద్."

మురాద్‌కు ఔరంగజేబ్ రాసిన ఉత్తరంలో ఇలా ఉన్నది:

"పాదుషా అనంతరం సింహాసనం మీద కూర్చొనటానికి నీవే తగినవాడవు. మన పెద్దఅన్న దారా యుద్ధకుశలుడు కాడు. అతను మహమ్మదీయుడు కాడు. హిందూ తత్వవేత్త. రెండోఅన్న వట్టి పనికిమాలినవాడు. మూడోవాణ్ణయిన నేను సర్వసంగ పరిత్యాగం చేసిన సన్యాసిని. పాదుషాకు తగిన లక్షణాలన్నీ నీలో ఉన్నాయి. నీకు నా చేతనైన సహాయం చెయ్యటానికి సిద్ధంగా ఉన్నాను. నీకు జహానారా సహాయం కూడా అవసరం అవుతుంది. ప్రస్తుతం అధికారమంతా ఆమె చేతిలోనే ఉన్నది. అందుచేత నీ వామె కుమార్తెను వివాహ మాడగోరటం ఉచితమే. కనక ఎలాగైనా ఆ పిల్లను త్వరగా పెళ్ళి చేసుకో. నేను త్వరగా దక్కను వెళ్ళాలని పాదుషావారి ఆజ్ఞ. అయినప్పటికీ నీకు అవసరమయ్యే పక్షంలో నీకు సహాయం వస్తాను. — ఫకీరు ఔరంగజేబ్."

ఉత్తరాలు రెండూ విని రోషనారా, "ఔరంగజేబును మించిన మతాభిమాని ఉండడు," అన్నది.

"వాడే మురాదు కీ దుర్బుద్ధి కలిగించాడు," అన్నాడు పాదుషా.

"నా మూలంగా కుటుంబకలహం వస్తుందన్నావు; గాని, కుటుంబ కలహానికి అసలు కారణం దిక్కుమాలిన ఈపిల్ల. వెంటనే దాన్ని మురాదు కిచ్చి పెళ్ళి చెయ్యటం మంచిది. లాల్జీ పసివాడు; వాడిపెళ్ళి కేం తొందర," అన్నది రోషనారా; ఎవరో ఊరుపేరులేని పిల్లకోసం కన్నకొడుకులమధ్య కలహాలు రానివ్వ

టము మంచిది కాదనీ, మురాదు దండెత్తి వచ్చేపక్షంలో ఔరంగజేబు తన సైన్యాలతో తప్పక అతనివెంట వస్తాడనీ, కోటను రక్షించుకోవడం కష్టమవుతుందనీ కూడా ఆమె అన్నది.

"పాదుషా నిండుసభలో చేసిన నిర్ణయానికి తిరుగు ఉండదమా ? మురాదు లాటి దౌర్భాగ్యుడికి నా కూతురును ఇవ్వను. ఈ భాగ్యానికి మురాద్ ఔరంగజేబులు యుద్ధానికి దిగేపక్షంలో దాని ఫలితం వాళ్ళు అనుభవించి తీరుతారు. గుల్బహారు కనబడటంలేదు ఫతేమాద్వారా నా కూతురిని కాజేసి రోషనారా మురాదు కిప్పించి ఉంటుందని నా అనుమానం," అన్నది జహానారా.

ఈ మాటకు రోషనారా తోకతొక్కిన తాచులాగా మండిపడింది. ఆమె పేలాపనలను లక్ష్యపెట్టక పాదుషా, "గుల్బహారు మురాదుకు దొరికిఉంటే ఇలారాయడు. ఆమెను ఇంకెవరో ఎత్తుకుపోయారు. నీ కేమైనా ఆ సంగతి తెలిస్తే చెప్పు," అని రోషనారా నడిగాడు.

తన కేమీ తెలియదని ప్రమాణం చేస్తూ రోషనారా, "ఒక బెంగాలీయువకుడు వచ్చాడే – వాడికీ, గుల్బహార్ మాయం కావటానికీ ఏదో సంబంధం ఉంటుంది," అన్నది.

"గుల్బహార్ దొరికేదాకా మురాదుపెళ్ళి గురించి ఆలోచించ నవసరంలేదు. మురాదూ, ఔరంగజేబూ ఏకం కాకముందే ఆ మురాదు వెధవను దేశభ్రష్టుణ్ణి చెయ్యాలి. గుల్బహార్‌ను సాకుగా పెట్టి వాళ్ళు ఢిల్లీ సింహాసనం కాజెయ్యాలని చూస్తున్నారు,'' అన్నాడు పాదుషా.

మేవారు, మార్వారు, అంబరు రాజులైన రాజపుత్రుల సహాయంతో మురాదుకు బుద్ధి చెప్పేపనిని ఆయన లాల్జీపైన పెట్టాడు ...

చుట్టూ ఆడవాళ్ళను పెట్టుకుని, తాగుతూ, నృత్యగాన వినోదాలలో మునిగితేలుతున్న మురాదుకు, అన్నివైపులనుంచీ పాదుషా సేనలు చుట్టుముట్టుతున్నాయని తెలిసి, నిషా అంతా దిగిపోయింది. ఒకపక్కనుంచి లాల్జీ పెద్దసైన్యంతో వస్తున్నాడు. ఇతర దిక్కుల రాజపుత్ర సేన లున్నాయి. అతను ఔరంగజేబు శిబిరాన్ని చేరుకునే అవకాశంకూడా లేదు.

ఆ స్థితిలో మురాదుకు పారిపోవటం తప్ప గత్యంతరంలేదు. ఔరంగజేబు బోధలు విని అతను తండ్రికి ఉత్తరం రాశాడేకాని అతనికి ఢిల్లీసింహాసనంమీద ఏమీ కోరికలేదు; అది న్యాయంగా దారాకు చెందవలసిందే నని అతనినమ్మకం. కాక పోతే సహజ స్త్రీ లౌల్యంవల్ల, అందగత్తె అయిన గుల్బహారును పెళ్లాడాలన్న

కోరిక మాత్రమే అతన్ని ఆ ఉత్తరం రాయటానికి ప్రేరేపించింది. అది ఇలా పీకమీదికి వస్తుందని అత ననుకోలేదు. పాదుషా తనను బందీగా పట్టితెమ్మని ఉత్తరు విచ్చినట్టుకూడా గూఢచారులు చెప్పడంతో, మురాదు శిబిరం ఎత్తించి పారిపో సాగాడు.

అంబరురాజైన జయసింహుడు అతన్ని అడ్డగించగలిగిఉండికూడా దయదలచి పారిపోనిచ్చాడు. అతను మాళవదేశంకేసి వెళ్ళి, పాదుషా సైన్యాలు తనను తరమడం లేవని తెలుసుకుని, మళ్ళీ శిబిరం వేయించి, ఔరంగజేబుకు ఒకఉత్తరం రాస్తూ, తన ఈ స్థితికి తెచ్చిన దారా జహాంగారాపై విషం కక్కాడు. ఔరంగజేబు అతని ఆగ్రహాన్ని సమర్థించుతూ జవాబుపంపాడు. "... వా ళ్ళిద్దరిపైనా పగతీర్చుకుని నీవు సింహాసనం ఎక్కు. నా కీ రాజకీయాలతో పనిలేదు. కాని సామ్రాజ్యానికి పట్ట నున్న దుస్థితి చూసి వీటిలో కలిగించు కలిసి వచ్చింది. మాల్వాలో వీలయినంత సేన సేకరించు. నాకు రోషనారా ఎప్పటి సమాచారా లప్పుడు తెలియ జేస్తున్నది. సమయం వచ్చినప్పుడు నీకు కబురుచేస్తాను," అని ఔరంగజేబ్ మురాదుకు రాశాడు.

ఎప్పుడు యుద్ధం వస్తుందో ఎవరికీ తెలీదు ఔరంగజేబు ఒకచోటా, మురాదు మరొకచోటా శిబిరాలు వేసిఉన్నారు. ఈ సంగతి తెలిసి, బెంగాలుకు బయలుదేరిన షుజాకూడా దారిలో ఆగి శిబిరంవేసి, తన సోదరులు ఏం చెయ్యబోతారో గమనిస్తూ ఉండిపోయాడు. రాజపుత్రరాజులు సభ జరిపి, యుద్ధంవస్తే తాము ఏ పక్షాన ఉండ వలసిందీ ఆలోచించారు. వారిలో అధికసంఖ్యాకులు పాదుషా పక్షమే.

లాల్జీమనసు చాలా వికలంగా ఉన్నది. ప్రతిభ (గుల్బహార్) కనిపించక పోవటం ఒక్కటే తనకలవరపాటుకు కారణంకాదనీ, తాను రహస్యంగా మోతియాను ప్రేమిస్తున్నా ననీ అతను తెలుసుకున్నాడు. రానున్న యుద్ధంకూడా అతన్ని కలత పెడుతూనే ఉన్నది. రోషనారా పెద్దఎత్తున కుట్రలు చేస్తున్నప్పుడు ప్రమాదా లుండ డంలో ఆశ్చర్యంలేదు.

అత నొకనాడు తాజమహల్ భవనానికి వెళ్ళి, అక్కడ ఒక చలవరాతి పలక పైన, ఒక చెట్టునీడలో కూర్చున్నాడు. ఆ చెట్టుచాటున ఆపాదమస్తకం నల్లని ముసుగు ధరించి పొంచిఉండిన హంతకు డొకడు, చేత బాకు పట్టుకుని, పిల్లిలాగ అడుగులు వేసుకుంటూ లాల్జీని సమీపించి, అతన్ని పొడవటానికి కత్తి పైకెత్తాడు.

ఆ క్షణం ఎవరో దేగలాగా రివ్వున వచ్చి వాణ్ణి తాకి, వాడి ప్రయత్నం భగ్నం చేశారు. ఇద్దరూ కిందపడ్డారు. హంతకుడు తనపైన పడిన మనిషిని చూసే

యత్నంలో ఉండగా లాల్జీ జరిగినది గ్రహించి హంతకుడికి అడ్డంపడ్డాడు. హంతకుడు వాయువేగంతో నదికేసి పారిపోయాడు. లాల్జీ వాడివెంట పరిగెత్తాడుగాని, లాభం లేకపోయింది. హంతకుడు నీటిలోకి దూకి తిరిగి చాలాదూరాన తేలాడు.

లాల్జీ వాణ్ణి వదిలేసి తాను కూర్చుండిన అరుగుదగ్గిరికి తిరిగివచ్చి, అక్కడ ఉన్న మోతియాను గుర్తించి ఆశ్చర్యపడ్డాడు. ఆమె భుజంమీది బట్ట నెత్తురుతో తడిసిఉన్నది.

"అరెరె, గాయం తగిలిందే. వైద్యుడిచేత చికిత్స చేయిద్దాం పద," అన్నాడతనామెతో.

"ఇదేమంత పెద్దగాయంకాదు. చెప్పకుండా అంతఃపురం దాటి వెళ్ళినందుకు నా తల ఎలాగో పోతుంది," అన్నది మోతియా.

"నా ప్రాణం కాపాడిన నీకు మరణశిక్ష! అసంభవం. పాదుషా నీకు గొప్ప బహుమానం ఇస్తాడు."

అతను ఆమెను కూర్చోమని, ప్రతిభకోసమూ, మోతియా కోసమూ తాను ఎంత ఆదుర్దా పడ్డాడో, ఎంతగా వెతికాడో చెప్పాడు. అతను తన చెయ్యి పట్టుకోగానే మోతియా శరీరం పులకించింది.

"మీవంటి రాజకుమారుడి పక్కన నా వంటి అభాగ్యురాలు ఇలా కూర్చోరాదు. ఎవరయినా చూస్తే చంపేస్తారు," అన్న దామె.

"నేను నీ పక్కన ఉండగానే?"

"నిన్ను నీవే రక్షించుకోలేవే, నన్ను రక్షిస్తావా? ఎవడో నీ ప్రాణం తీయ సాహసించాడంటే వాడి కెవరో పెద్దవాళ్ళ అండ ఉండిఉండాలి," అన్నది మోతియా. ఆ మాట నిజమని అతనికికూడా అనిపించింది.

లాల్జీ ఆమెకు తన ప్రేమ నివేదించి, ఆమె నొక రహస్య స్థలానికి తీసుకుపోయి, మోహావేశంతో ఆమెను ఆలింగనం చేసుకున్నాడు. అంతదాకా అతి హీనంగా జీవించిన మోతియాకు ఒక్కసారిగా నరకంనుంచి స్వర్గానికి చేరుకున్నట్టనిపించింది.

మోతియా అతనికి తన అనుభవాలు చెప్పింది — తాను కాలీషుడివెంట వెళ్ళటమూ, పాడుపడిన దేవాలయం దగ్గిర ఒక బెంగాలీ స్త్రీ తటస్థ పడటమూ, అక్కడికి మొగలాయీ సైనికులు వస్తూండటం చూసి ఆ బెంగాలీ స్త్రీ తాను యోగిని వేషం వేసి, తనచేతా, కాలీషుడిచేతా అలాటి వేషాలే ధరింపజేసి తీసుకుపోవటమూ మొదలయిన విషయాలు.



అక్కడే కూర్చొని మాట్లాడుకోవటం ప్రమాదమని గ్రహించి మోతియా. అతన్ని ఒక చిన్న పడవలోకి ఎక్కించి, దాన్ని నడపసాగింది. కొంతదూరం వాళ్ళు రంగమహలులో జరిగే కుట్రనుగురించి మాట్లాడుకుంటూ వెళ్ళాక లాజ్జీ.

"ఇదేం చోటు? మనం ఎక్కడికి పోతున్నాం?" అని అడిగాడు. అప్పటికి తాజ్‌మహలూ, ఆగ్రాకోటా కనుచూపు మేర దాటిపోయాయి.

"నీ కేమీ భయంలేదు. నిన్ను కోటకు సురక్షితంగా సైనికుల వెంట చేర్చ తాను. అటు చూడు," అన్నది మోతియా. అతనికి నదిఒడ్డున చలవరాతి మెట్లూ, బెంగాలులో ఉండే శివాలయాలవంటి ఆలయాలూ ఒక ఆలయం వెనుక గా చక్కని భవనమూ, తోటా కనిపించాయి మెట్లకు ఎగువన ఒక సన్యాసిని నిలబడి ఉన్నది. లాల్జీకి అంతా అయోమయంగా ఉన్నది.

పడవ తీరాన్ని చేరేటప్పుడు సన్యాసిని మెట్లు దిగివచ్చి, "నీకోసమే చూస్తున్నాను మోతియా," అన్నది.

"ఇతను పాదుషావారి మనుమడు. లాల్జీసాహెబ్." అని మోతియా పరిచయం చేసింది

"నీకు నా స్వాగతం." అన్నది సన్యాసిని.

"ప్రసిద్ధురాలయిన దులాలీ నీవే అయివుండాలి," అన్నాడు లాల్జీ

"అవును, నేనే దులాలీని నా సంగతి కొంత నీకు తెలుసులాగుంది. ఒకప్పుడు చాలా హీనస్థితిలో వుండికూడా, కరుణామయుడయిన మీ తాతగారి దయవల్లా, మా అక్క ముంతాజ్‌మహల్..."అని ప్రారంభించి దులాలీ ఆ పైన మాటరాక ఏడవసాగింది.

"అమ్మా, నువు చేసిన సహాయాన్నికూడా మా తాత మరవలేదు. నీ మూలానే తాను అంతులేని కష్టాలనుంచి బయటపడి, పాదుషా కాగలిగానని ఆయన ఎప్పుడూ చెబుతూంటాడు."

"రా, నాయనా, కాస్సేపు విశ్రాంతి తీసుకో," అంటూ దులారీ కదిలింది. ఆమెవెంట మిగిలిన ఇద్దరుకూడా కదిలారు. దులాలీ అతనికి భవనం చూపి," తాజ్‌మహల్ కట్టిన శిల్పి ఈ మందిరాన్ని ముంతాజ్‌మహల్ మహారాణీ దాది నిమిత్తము కట్టాడు. ఆ దాది పేరు దయామణి అ ముసలిది తన లాలియా ఇంకా బతికి ఉన్నదనే అనుకుంటున్నది నిజం తెలిస్తే గుండె ఆగి చచ్చిపోతుంది," అన్నది.

ఆమె అతనికి స్వవిషయం చెబుతూ, పాదుషా తనకు రాణీ అనే బిరుదూ, తన భర్తకు సుబేదారు పదవీ ఇచ్చాడనీ, తన భర్త పదిహేడేళ్ళక్రితం పోయాడనీ, ఆ తరవాత తన ఏకపుత్రుడికి ఆ పదవి లభించిందనీ, తాను ప్రస్తుతం తీర్థయాత్రలు

చేస్తున్నా ననీ, ముంతాజ్ మహలును చూడాలని తాను మధురనుంచి వచ్చి, ఆగ్రాలో అడుగుపెడుతూనే ఆమె మరణవార్త విన్నా ననీ, ఆమె చెప్పింది.

అంతకుముందే మోతియా అతన్ని దుర్మరణంనుంచి కాపాడిన సంగతి విని దులాలీ కంగారుపడింది.

"పాదుషా కొడుకులు యుద్ధానికి సిద్ధమవుతున్నా రని నీకు తెలిసే ఉంటుంది." అన్నాడు లాల్జీ.

"తెలిసింది. ఆ ప్రమాదం తొలగిపోయేదాకా పాదుషాను కనిపెట్టుకుని ఉండటానికే నే నిక్కడ ఆగాను.'' అన్నది దులాలీ. ఆమె ఉండగా తన తాతకు ఎలాటి అపాయమూ రాదని లాల్జీకి గట్టి నమ్మక ముండటచేత అతను చాలా సంతోషించాడు.

వాళ్ళు ఇల్లు చేరుకున్నారు. అక్కడ లాల్జీకి, దయారాణి కళ్ళు మూసుకుని తావళం తిప్పుతూ కనిపించింది. లాల్జీ ఫలానా అని తెలియగానే ఆమె కరీమ్‌ను జ్ఞాపకం తెచ్చుకుని, లూలియా క్షేమంగా ఉందా అని అడిగింది. కాని ఆమె జవాబు కోసం ఎదురుచూడక మళ్ళీ కళ్ళు మూసుకున్నది.

అక్కడినుంచి మరొక గదికి వెళ్ళారు. అక్కడ ఒక యువకుడు మంచంమీద పడుకుని ఏదో చదువుకుంటూ, అలికిడి విని లేచాడు. దులాలీ లాల్జీని అతనికి పరిచయం చేసి, ఆ యువకుణ్ణి శాలీషరాయ్‌గా లాల్జీకి తెలియచేసింది. దులాలీ లాల్జీతో ఇలా చెప్పింది:

"నా భర్త ఒకప్పుడు ఇతని తండ్రివద్ద పెరిగాడు. నా తండ్రికూడా ఆయన వద్దనే పెరిగాడు. అందుచేత, నా తండ్రి కోరిక మన్నించి ఆయన నన్ను పెళ్ళాడాడు. నా పెళ్ళి అయి మేము తూర్పుబెంగాలుకు చేరేనాటికి ఇతను పసివాడు. ఇతని తండ్రి జమీందారు, కాని డబ్బు తగలేసి ఆస్తిఅంతా పోగొట్టుకున్నాడు. ఆయన తన వినాశనానికి కారణం గుల్బహారు తండ్రేనన్న భ్రమలో పడ్డాడు."

"గుల్బహారు ఇప్పు డెక్కడ ఉన్నది?" అని లాల్జీ శాలీషుడికేసి అనుమానంగా చూశాడు.

"ఆమె క్షేమం గురించి నీకన్న నాకు ఎక్కువ ఆదుర్దాయే," అన్నాడు శాలీషుడు.

"నాకు తెలుసు. గుల్బహారు నాకంతా చెప్పింది. నే నామెను పెళ్ళాడ నని ప్రమాణంకూడా చేశాను," అన్నాడు లాల్జీ.

అతనికి గుల్బహారు గురించి తెలుసుకోవా లనిపించింది. ఆ సందర్భంలో దులారీ తన కథ ఇలా చెప్పింది:

"పాడుపడిన ఆలయంనుంచి నేను మోతియాను, శాలీషుణ్ణీ వెంటబెట్టుకుని ఆగ్రా చేరాను. శాలీషుడి ఇంట రహస్యంగా ప్రవేశించి, అవసరమైన కాగితాలు తీసుకుని, చీకటిలో యమునాతీరం వెంబడి పోతూండగా మాకు కత్తుల చప్పుడు వినిపించింది. కొంచెం దగ్గిరగా వెళ్ళి చూస్తే నలుగురు మనుషులు హోరాహోరీ యుద్ధం చేస్తున్నారు. వారికి అంతదూరంలో నేలపైన ఎవరో పడిఉన్నారు. సమీపించి చూస్తే బంధితురాలైన ఒక స్త్రీ. ఆమెను తీసుకుని వేగంగా బయలుదేరాం. చాలాదూరం తీసుకుపోయి ఆ చీకటిలోనే ఆమె కట్లు విప్పాం. కట్లు విడుతూనే ఆమె పక్షిలాగా రివ్వున పారిపోయింది. ఆమెకోసం ఎంత వెతికీ ప్రయోజనం లేకపోయింది."

ఈ కథ విని, "ఆమె తప్పక గుల్బహారే. ఎంతఘోరం జరిగింది! ఆమెను మురాద్ పెళ్ళాడాలని చూస్తున్నాడు. అతనే ఆమెను ఎత్తుకుపోయిఉంటాడు," అన్నాడు.

మోతియా లాల్జీకి ఫలహారం తెస్తూ, "గుల్బహారును వెతికేపని నేను చూస్తాను, నీకా విచారం వద్దు. ముందీ ఫలహారం తీసుకో. ఎవరికంటా పడకుండా నువు కోట చేరుకోవటానికి పడవ సిద్ధం చేయించాను,'' అన్నది.

అతను ఫలహారం చేశాక, దులారీ అతని చేతి కొక జాబు ఇస్తూ, "కొంత కాలం నన్ను రంగమహలులో ఉండనియ్య మని పాదుషావారిని ఇందులో కోరాను. ఈ శాలీషరాయ్‌ని సైన్యాధిపతిగా చేయమనికూడా ఇందులో కోరాను," అన్నది.

"ఇతన్ని వెయ్యిమంది సైనికులపైన సరదారుగా నియమించే అధికారం నాకే ఉన్నది. ఇప్పుడే అతని కా అధికారం ఇస్తున్నాను," అన్నాడు లాల్జీ. శాలీషుడు తన కృతజ్ఞత చెప్పుకున్నాడు.

మోతియా లాల్జీతో, "నా దొక్క మనవి. నేను మారువేషంలో నీ వెంట తిరుగుతాను," అన్నది.

''అదేం?'' అన్నాడు లాల్జీ.

"ఈ రూపంలో రంగమహలులో అడుగు పెట్టను. నేను మారువేషం వేస్తే నా తల్లీ, తండ్రీకూడా పోల్చలేరు."

లాల్జీ తటపటాయించటం చూసి దులారీ, ''ఒప్పుకో, నాయనా," అన్నది.



''ఇక నుంచీ నేను పొట్ట చేతపట్టుకుని వచ్చిన పర్షియా యువకుణ్ణి. నా ఉద్యోగం నీకు అంగరక్షకుడుగా ఉండటం,'' అన్నది మోతియా.

''నీ యిష్టం,'' అన్నాడు లాల్జీ.

రేపే కోటకు వస్తాను "

లాల్జీ బయలుదేరాడు. వీరోచితమైన దుస్తులతో శాలీషు దతనికి తోడుగా బయలుదేరాడు. ముప్పై తెడ్లతో పడవ సిద్ధంగా ఉన్నది. దులాలీ, మోతియాలతో మళ్ళీ కలుసుకుందామని చెప్పి లాల్జీ పడవలో కోటకు బయలుదేరాడు.

# 10

లాల్జీ కోటలో అడుగు పెడుతూనే తన కోసం ఎవరూ అడగలేదని విని చాలా సంతోషించాడు అతను పాదుషావద్దకు వెళ్ళి దులాలీ కోరిక తెలిపాడు. వెంటనే పాదుషా దులాలీకి స్వాగతం ఇవ్వటానికి సన్నాహాలు చేయ నాజ్ఞాపించాడు. తరవాత లాల్జీ శాలీషరాయుడికి బస ఏర్పాటు చేసి, గంగారామును అతనికి అప్పగించాడు.

దులాలీ పల్లకి రంగమహాలు దగ్గిర దిగగానే జహానారా దాసీ లామెకు స్వాగతం తెలిపారు. బేగంమహాలంతా ఆమెకు కొట్టిన పిండే. ముప్పై ఏళ్ళ కాలంలో అది అంతగా మారలేదు. ఆమెను దాసీలు తిన్నగా పాదుషా ఉన్న చోటికి తీసుకుపోయారు. ఇంతకాలానికి తిరిగి తాను పాదుషా కరీమ్ ఎదట పడుతుంటే ఆమె గుండె దడదడలాడి ది.

నవమోహనకారుడుగా ఉండిన కరీమ్ ముసలివా డయాడు.

"మహారాజా, నే నాగ్రా చేరినట్టు తమకు తెలిసిందా ?'' అన్న దామె.

''తెలిసింది గాని, నన్ను చూడరాక పోయేసరికి నేను విన్నది అబద్ధమేమో అనుకున్నాను.''

''నేను అక్కను చూద్దామని వచ్చి, ఆశాభంగం చెంది, వెర్రిదాని వేషంలో ఆమె శవం వెంట వెళ్ళాను. మీ దర్శనం కోసం రహస్యంగా నావలోకి ఎక్కాను. కాని మీరు నన్ను చూసి భయపడ్డారు.''

పాదుషా మాట్లాడలేదు.

"మహారాజా, ఇక్కడ కొంత కాలం ఉందామనుకుంటున్నాను."

''సంతోషం; నేను జీవించి ఉన్నంతకాలమూ ఇక్కడే ఉండవచ్చు. జరిగినదంతా కల కాదనుకోవటానికి ఆధారం ఇప్పుడు నువ్వొక్కతెవే మిగిలావు.''

వాళ్ళిదరూ, చనిపోయిన ఆమె భర్తగురించీ, సుబేదారుగా పనిచేస్తున్న ఆమె కుమారుణ్ణి గురించీ మాట్లాడుకున్నారు.

"ఇక్కడ ఎంత కాలం వుంటావు ?'' అని పాదుషా అడిగాడు.

''మీకు అపాయం తప్పేవరకు.'' అన్న దామె.

"అపాయమా? నా భార్య మరణించటం కంటె ఇంకా నాకు వచ్చే అపాయ మేమిటి?"

"మీ కుమారుళ్ళు యుద్ధానికి సిద్ధంగా ఉన్నారని విన్నాను."

"ఇది మొగలు రాజవంశానికి ఉంటున్నదేగా ?''

కొంచెంసేపు మాట్లాడి దులారీ తన చోటికి వెళ్ళిపోయింది.

పాదుషా అంతఃపురంలోకి ఒక హిందూ సన్యాసిని వచ్చేసరికి, అక్కడ ఉండే అయిదువేలమంది దాసీలూ గగ్గోలుపడిపోయారు. అలాటిది ఎన్నడూ జరగలేదు వారిలో దాదాపు ఎవరికీ దులారీ పూర్వచరిత్ర తెలీదుకూడా. ఆమె ఎందుకు వచ్చినదీ మొదలే తెలీదు. దులారీ రాకతో పాదుషాకు కాస్త ఉత్సాహం రావటం చూసి జహానారా సంతోషించింది. రోషనారా మండిపడింది

ఆ రాత్రే రోషనారా కుడిభుజమనదగిన ఫతేమా తిరిగి వచ్చింది. ఆమె ఎక్కడికి వెళ్ళినదీ, ఏం చేసి వచ్చినదీ ఎవరికీ తెలీదు. ఫతేమా వస్తూనే, నిద్రలో ఉన్న రోషనారావద్దకు వెళ్ళి, ఆమెను లేపి చాలా సేపు మాట్లాడింది.

తన పెంపుడు కూతురు గుల్బహారు మాయం కావడానికీ, ఫతేమాకూ ఏదో సంబంధం ఉందని ఊహించి, జహానారా దారావద్దకు వెళ్ళి, ఫతేమాను శిక్షించమని కోరింది. ఫతేమాను శిక్షించినట్టయితే, అదే నేరం చేసినందుకు మోతియానూ, గుల్బహారునూకూడా శిక్షించవలసివస్తుం దన్నాడు దారా.

"రోషనారా ఔరంగజేబుతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతూ, బహిరంగంగా కుట్రలు చేస్తున్నది. ఎంతకాలం సహించేటట్టు?" అని జహానారా అడిగింది.

"ఇది చాలా మెలకువతో ఆలోచించవలసిన విషయం," అన్నాడు దారా. అతను మంత్రులతో ఆలోచించగా, ఫతేమాని విచారణ జరపమని వారు సలహా ఇచ్చారు. ఆమెను బంధించి తీసుకురమ్మని అతను ఉత్తరు విచ్చాడు.

రంగమహలంతా అట్టుడికిపోయింది. ఫతేమాను బంధించటం మాటలుకాదు. రోషనారా అంతఅసమర్థురాలు కాదు. ఆమెకు అమ్ముడుపోయినవాళ్ళు కోటలో చాలా మంది ఉన్నారు. ఔరంగజేబును పాదుషా చెయ్యటాని కామె చాలా పెద్దఎత్తున ప్రయత్నాలు చేస్తున్నది.

కాని రోషనారా దారా ఆజ్ఞను తిరస్కరించక, తన పరిచారికను దారా విచారించటానికి అనుమతించింది. గామా వచ్చి ఫతేమాను పట్టుకుపోయాడు.

దారాకు రోషనారా ప్రవర్తన నిరుష్టంగా కనబడి ఆశ్చర్యం కలిగించింది. అతను సలహాకోసం జహానారావద్దకు వెళ్లాడు. దులారీ అక్కడే ఉన్నది. జహానారా దారాకు దులారీని పరిచయం చేసింది.

దారా జరిగినదంతా చెప్పి, "నే నిప్పు డేంచెయ్యాలి?" అని అడిగాడు.

"ఏమైనా, నువు రోషనారావద్దకు మాత్రం వెళ్ళకు," అని జహానారా అతనికి సలహా ఇచ్చింది.

"ఫతేమాను ఇప్పుడు విచారణ చెయ్యనవసరంలేదు. ఇప్పటికి వదిలెయ్యండి. అవసరం వచ్చినప్పుడు విచారణ చెయ్యవచ్చు" అన్నది దులారీ.

"ఈ సలహా సరిగా ఉన్నట్టు తోస్తున్నది," అన్నాడు దారా

"నాకుకూడా అలాగే తోస్తున్నది," అన్నది జహానారా.

(ముగింపు పై సంచికలో)





అజీజ్

ఒకేసారి మూడుత్తరాలు!

ఒకటి మావయ్య దగ్గిరనుంచి.

అక్కయ్య వ్రాసి ది రెండు –

మరోటి అన్నయ్యది!

మావయ్య మొదటికూతురు సావిత్రి కంట్లో పువ్వు పడిందన్న వార్త; బావ ఈమధ్య తాగుడు మాని మామూలు మని షయ్యాడని అక్కయ్య వ్రాసిన ఉత్తరం; క్రికేట్ మాచ్‌లో మోచేయి బ్రద్దలయిం




దని అన్నయ్య వ్రాతలూ – అన్నీ నాన్నగారిని ఉక్కిరిబిక్కిరి చేశాయి.

మావయ్య ఉత్తరం అమ్మ కండ్లలో అర్థంకాని కన్నీరుగా మెరిసింది.

నాన్న పెదవులమీద ముసలినవ్వుగా– బామ్మ కంఠంలో ఓరగా వ్యాకులతగా– యింకెన్నో రకాలుగా!

కాని పార్వతి నాకు వ్రాసిన ఉత్తరం వాళ్ళ నెటువంటి ఆవేశాలకు గురిచేయలేదు.

పార్వతి ఉత్తరం వ్రాసింది.

నేను ఊహించని ఉత్తరం వచ్చింది– నేను సదా ఊహించుకునే పార్వతి దగ్గరి నుంచి–

"ఇది అన్యాయం...కాని ఎదిరించలేని అసహాయత... ఆడదాన్నికదూ! విషం తాగి ఆత్మహత్య చేసుకునేంత ధైర్యం లేదు. అది పాపం! అంతకు తప్పితే ఏమీ తెలియదు నాకు. నిన్ను నిరాశ కలిగిస్తున్నందుకు క్షమించు. నా పెండ్లి... అంతే! మళ్ళీ ఎప్పుడైనా కనిపిస్తాను – బ్రతికుంటే!"

ఎన్నిసార్లు చదువుకున్నానో ఆ ఉత్తరం? మళ్ళీ మళ్ళీ చదవాలనిపిస్తున్నా అందులోని నిజం నన్ను దహిస్తూంది.

పార్వతి పాత్రా, నా పాత్రా 'జీవితం' అనే నవలలోని పాత్రలయితే, పార్వతిని కలుసుకుంది నాలుగు అధ్యాయాల్లో మాత్రమేనని చెప్పాలి.

మొదటి మెట్టు బాల్యం!

కలిసి ఆడుకున్నాం, కలిసి చదువుకున్నాం. ఆ సంవత్సరాలన్నీ కలిపి కూడితే పధ్నాలుగేండ్లలోనే– పార్వతిని

'పారూ' అని పిలవడం నేర్చుకున్నాను. అదొక పగటి కల. నవలలోని మొదటి ముఖ్యమయిన అధ్యాయం ఆ విధంగా ప్రారంభమై ఫలితం లేకుండానే ముగిసింది.

ఏనాటికైనా మళ్ళీ కనిపిస్తుందనే ఆశ— ఒకసారి నిజమయింది. కండ్లను నులుపుకోకపోయినా ఆశ్చర్యంగా చూశాను. ఎదురుగ్గా పార్వతి—

నవ్వే కండ్లతో...

అవ్యక్తభావాలతో సతమతమైపోతూ ఏదో చెప్పాలని తారట్లాడే పెదాలతో... పార్వతి బస్సులో కనిపించింది.

బయట వర్షం!

బస్సులోపల చిరునవ్వుల వాన.

ఆత్మీయతను ఒలకరించే చూపులు— నాకూ పార్వతికీ మధ్యవున్న దూరాన్ని పరుగెత్తేబస్సు దగ్గిరికి చేరుస్తుందేమోనని ఆశపడ్డాను. కాని అలా జరగలేదు. ప్రతీది అనుకోవడమే సరిపోతుంది.

మరింత పరికించి చూశాయి నా కండ్లు.

సిగ్గు ఆమె తలను వంచేసింది.

వాలినకండ్లు సిగ్గుతో క్రుంగుతున్నాయో, బాధతో కురుస్తున్నాయో తెలియదు. మెడలో మెరిసే మాంగల్యం, గుండ్రటి నయాపైసంత తిలకపు బొట్టూ, చేతులునిండా గాజులు, ఏదో పరిపూర్ణత కనిపించింది ఆమె అంగసౌష్టవంలో.

పార్వతి పెండ్లి చేసుకుంది.

ఎవరినో కాని, తనకన్నా గొప్పవాడే కావచ్చు. తను సాధించలేనిది అతనెవరో సాధించాడు.

నాలోని బలహీనత తప్ప పార్వతి దూరం కావడానికి మరో ముఖ్య కారణము కనిపించలేదు.

ఆమె నా వైపు చూస్తోంది.

కండ్లడిగాయి — నా పెదవులు వణికాయి.

ఆమె అడిగింది — నేను సమాధానమివ్వలేని విధంగా.

"ఏం చేస్తున్నావు—?" అన్నట్లుగా చూసింది.

"నేనో బడిపంతుల్ని... చేతకానివాడిని. ఇతరులకు భుక్తిమార్గం చూపుతున్నా ననే తృప్తితో నా జీవితాన్ని యీదుతున్న ధీశాలిని..." యివన్నీ పార్వతికి ఎలా చెప్పాలి?"

ఆమె కండ్లు నా ప్రక్కన ఖాళీగా వున్న సీటువైపు చూశాయి 'నీ భార్యా బిడ్డలు—' అన్నట్లు.

"అంత అదృష్టంకూడానా పార్వతీ! నా గుండెల్లో యింకా మాయనిగాయాలు సదా నన్ను రక్కుతుంటే, ఆ బాధను వేరేవాళ్ళ కెలా పంచిఇవ్వగలుగుతాను? యింకో జీవితాన్ని నాశనం చేయలేను."

ఆమెకు అర్థంకాదు. నా సమాధానాలు ఆమె కర్ణపుటాలను చేరుకోవు. మధ్యలో ఒక అగాధముంది— చూస్తూ బ్రతికుండటానికి.

"తొందర పడ్డావు పార్వతీ—?"



నేనలా వూరెళ్లడం భయం- వున్నదికాస్తా మీరిలా పేకాట ఆడేస్తే ఎలాగండి మరి—

"తొందరకాదు గోపీ. ఆలస్యంగానైనా నిన్ను మరింత దగ్గరికి చేసుకోలేక పోయానని తపిస్తున్నాను. హృదయాన్ని తెలియజేయలేనివాడివి – నిన్ను వేరేవాళ్ళకు అప్పగించాను. నీ ముందు నేనెట్లా బయటపడి వుండాల్సింది?"

"అవును పార్వతీ! పొరపాటు నాదే. కాని దాన్ని యిప్పుడెలా సరిదిద్దుకోను–?"

బయట కురిసే వర్షం!

పార్వతి కండ్లల్లో ఇతరులకు కనిపించని మేఘాలు...

నా హృదయంలో ఎవరికీ అర్థంకాని బాధ...

నన్నొకచోట బస్సు విసిరేసింది – విధికన్నా కొంత నాజూకుగా!

చినుకుల్లో తడుస్తూ యింటికెళ్ళాను.

ఎప్పుడూ అదేపనిగా ఆలోచిస్తూంటే కలలోకూడా అదే వస్తుందంటారు. మరి నా కలల్లో పార్వతి కనిపించదేం? ఇలా మరో అధ్యాయం ముగిసింది. నవలలో దీనికంత ప్రాధాన్యత యివ్వబడదు. చిన్నచిన్న సంఘటనలలో యిదోరకం. కాని నేనెలా మరచిపోగలుగుతాను–?

మూడోసారి రైల్లో–!

మొదటికంటే కొంచెం లావుగా వుంది. బాగా రంగొచ్చింది. ముఖంలో కాంతి, కాటుకకంటే మెరిసే కండ్లు. గుంటూర్ వెడుతున్నప్పుడు – మా ఆవిడకు మూడో కాన్పు.

నన్ను చూసి ఆనందంతో కండ్లు మూసుకుంది పార్వతి.

జాలితో, అభిమానంతో ఆమెను చూసి ప్రసన్నుడనయ్యాను. ఆ ఆనందములో సంతృప్తి చిహ్నాలు స్పష్టంగా కనిపించాయి. ప్రక్కనే నిద్రపోతున్న చిన్నారి పాప ... పాపలాగే స్వచ్ఛమైన హృదయంతో పార్వతి. ఆమె

భర్తకాబోలు బెర్తుమీద అటూఇటూ కదులుతూ నిద్రపోవడానికి ప్రయత్నిస్తున్నాడు.

ఈసారి పార్వతిని సులభంగానే గుర్తుపట్టాను.

ఆమె నావైపు విచిత్రంగా చూసింది. కండ్లజోడొకటి తగిలి యేడ్చిందాయె యీమధ్య నాకు.

ఆమె కండ్లక్రింది ముడుతలు హుందాతనాన్ని తెలుపుతున్నాయి. అమాయకంగా నిద్రపోతున్న పాపవైపు ఒకసారి చూసి నవ్వింది.

"ఎన్నాళ్ళకు కనిపించావు గోపీ?"

కండ్లజోడు వెనకాల కండ్లు తడిశాయి.

"నీకు పిల్లలా? ఎంతమంది? నా సంసార యాత్ర ఎంతో సుఖప్రదంగా వుంది."

నా భావాలు ఆమెకు ఎలా చెప్పుకోవాలి? ప్రశ్నలు కురిపిస్తున్నాయి ఆమె నయనాలు.

"పైన పడుకున్నవారు మా వారు — చాలా మంచివారు — లేచింతరువాత పరిచయం చేసుకో."

అలాగే నన్నట్లు చూశాను.

"అన్నట్లు — ఎక్కడికి వెళ్తున్నావు గోపీ? మాట్లాడవేం? ఇంకా మొదటి లానే వున్నావా—?"

తల వంచుకున్నాను.

ఆమె ప్రశ్న లన్నింటికీ అగ్నిశిఖల్లా పైకి లేచే సమాధానా లున్నాయి. చెప్పుకోలేని బలహీనత నన్ను వెంటాడుతూంది — అప్పటికీ ఇప్పటికీ!

"మాట్లాడలేక నే నొంటరివాడి నయ్యాను. మళ్ళీ మాట్లాడి ఏమైపోతానో పార్వతీ! నాకు పిల్లలున్నారు; పెద్దవాడికి నా పోలిక. రెండవ వాడు వాడమ్మలా వుంటాడు. భగవంతుడు వాడిని అలా వుండనివ్వలేదు. ఒక కాలు విరగ్గొట్టి ఊరుకున్నాడు. నాకు చత్వారమొచ్చింది. మతిమరుపు కొంచెం జాస్తి అయిందంటున్నారు. మాట్లాడవేమని అడుగుతావు? మాట్లాడితే ఏం మాటలొస్తాయో-నని భయం —"

"అసలు చేతకాదు. నోట్లో నాలుక లేనివాళ్ళే బడిపంతు ళ్ళౌతారు."

రైలు కదుపు లిస్తూంది. పైన ఆయ నెవరో సుఖంగా నిద్రపోతున్నాడు.

నా మనసులో మెదులుతున్న సమాధానాలు ఆమె కెలా తెలియజేయాలి?

ఆమెను 'పారూ' అని పిలవాలి.

"పారూ!"

ఇప్పుడు పార్వతీదేవి — ఉత్తమ ఇల్లాలు. ఆమెనుగురించి మరోలా ఆలోచించకూడదు. ఆమెపాపను దీవించాలి. చేతనైతే వంగి ముద్దాడాలి.

రైలు దిగాల్సివచ్చింది.

"ఎప్పుడూ మధ్యలో ఆగిపోవడం నా జీవితంలోనే ఉందేమో!"

పార్వతికండ్లు నావైపు చూస్తున్నాయి.

'ఉంటాను — గోపీ" అన్నట్టున్నై.



కండ్ల జోడు సవరించుకున్నాను ; నేనేమీ అనలేదు ; ఏమైనా పార్వతి అనాల్సిందే.

రైలు కదిలింది. కాని నా పెదిమలు కదలలేదు. నా కాళ్ళు ముందుకు నడిచాయి. పార్వతి నా దృష్టిపథంలోంచి యింకా కదల్లేదు.

నాల్గో మైలురాయి దాటేటప్పటికి పూర్తిగా అలసిపోయాను. అప్పటికే ఓ నాలుగు పదులు దాటింది వయస్సు.

ఈ నాలుగు మైలురాళ్ళు నా నిత్య జీవితంతోపాటు కలసిపోయాయి. ఇంకా నాకు స్పష్టంకాని విషయాలు ఎన్నో వున్నా, వయసు నన్ను వాటికి దూరంగా తీసుకుపోతూంది. ఇలాంటి పరిస్థితులకు అర్థంచేసుకోవాలనే ప్రయత్నంతో ఒక నాడు వరండాలో కూర్చొనున్నాను.

జారిపోతున్న లాగూను పైకి లాక్కుంటూ పరుగెత్తుకొచ్చాడు రాజు. వీడు మూడోవాడు.

"ఎక్కడి కెళ్ళావురా?" అనడిగా.

లోపలికి పోతున్నవాడల్లా గడపమీద కాలుపెట్టి వెనక్కితిరిగి భయపడ్తూ జవాబిచ్చాడు.

"ఆడుకోవడానికి."

"ఎవరితో?"

వాడి కిలాంటి ప్రశ్నొకటి వస్తుందని ముందే తెలుసు. తెలిసినా మొదట దీనికి సమాధాన మివ్వడు. ఒక్కొకటే అడగాలి.

గేటుదగ్గర నిల్చొన్న అమ్మాయి వైపు చూశాడు.

"ఎవరమ్మాయిరా?"

"చక్రపాణిగా రమ్మాయి."

"ఏ చక్రపాణి... కర్ణంగారుకాదా?"

వాడి కిది తెలియదు.

అమ్మాయివైపు చూశాను – అవు నన్నట్లు తలూపింది.

"ఇలా రా–" దగ్గరికి పిలిచాను. మా వాడు సంతోషంగా చూస్తున్నాడు. 'చూడు మా నాన్న ఎంత మంచివాడో!' అన్నట్లు.

ఆ అమ్మాయి దగ్గరి కొచ్చింది.

"నీ పేరేమిటమ్మా?"

"పావణి."

అమ్మాయి ముఖంలో నాకు తెలిసిన ఛాయలు ఏమైనా కనిపిస్తాయేమోనని పరీక్షగా చూశాను.

చక్రపాణిగారంటే పార్వతి భర్త.

'పావణి' పార్వతి కూతురు – యీ ఊళ్ళోనే వుంటున్నారు.

రాజు మంచినీ ళ్ళిచ్చాడు పావణికి.

"మళ్ళీ ఆడుకుంటాం నాన్నా!" అని వీధిలోకి పరుగెత్తాడు పావణితో.

"ఒరేయ్" పిలిచినా వినకుండా వెళ్ళి పోయాడు రాజు.

"వినపడలేదేమో!"

చిన్నప్పుడు తనకూ వినిపించేదికాదు– నాన్నగారు పిలుస్తుంటే. ఒకవేళ విని పిస్తే కండ్లు చెరువులయ్యేయి. పార్వతిని వదలిపెట్టడం అంత యిష్టంగా వుండేది కాదు. యిప్పుడు వీడికీ యింతేనేమొ.

ఎంతయినా రక్తసంబంధం. తన లాగే జీవికను నడుపుతాడేమోనన్న వెర్రిశంక ఒకటి ఆవహిస్తోంది.

కొడుకును కన్నాంగాని కర్మను కన్నామా? కర్మను ఒక మార్గాన నడి పిస్తే? కొడుకు శ్రేయస్సును అభిల షించే తనకూ యీ భావా లుండటం అభినందనీయమే. మరిప్పుడు తనేం చేయాలి?

రాజును వెనక్కి పిలిచి పావణితో ఆడుకోవడం మానెయ్యమని చెప్పాలి.

అలా అనుకున్నాను. కాని మరో అనుమానం.. ఆ విధంగా చేస్తే 'నాన్న అలా ఎందుకంటున్నాడో' అనుకుని వాడిస్నేహం మరీ వృద్ధికావచ్చు. వాడి కీ భావన రాకుండానే మార్చాలి.

మార్పు అవసరం.

మళ్ళీ అనిపిస్తోంది. అవసరంలేని మార్పు కాదుగదా యిది?

రాజు 'ఫలితాన్ని' నేను కండ్లచూస్తా నని అనుకోను. ఎందుకంటే పరిస్థితులు చివరికి యిలా మనకోసం రావు.

ఏమీ అర్థంకాలేదు.

నా దృష్టిలో పావణి పెరిగి పెద్ద దయింది.

రాజు ఇంకా ఎప్పటిలాగానే వున్నాడు. వాడు పెరిగినట్లుగా ఊహించ లేకపోయాను.

"రాజు..."

"రాజుకోసం నేనేం చేయగల తండ్రిని?"



మూడు రోజులూ, మూడు క్షణాలుగా గడిచిపోయాయి తిరుపతిలో. దంపతు లిద్దరూ, నాలుగో రోజు, స్వస్థలం చేరుకున్నారు. వాకిట్లో అడుగెట్టగానే, సుభద్రమ్మ, కొడుకూ, కోడలికీ దృష్టి తీసి, కొబ్బరికాయ కొట్టిపారేసింది.

హైమ భయం భయంగా చూస్తోంది కొత్త 'అమ్మ' వేపు. మీనాక్షి హృదయం కలుక్కుమంది. ఆ చిన్నారి హృదయంలో తనను గురించిన ఎన్ని భయాలూ, సందేహాలూ దాగివున్నాయో!

"రా పాపా! హైమా! ఇదుగో నీకోసం బొమ్మలూ, బుడ్లూ తెచ్చాను చూడు!"

హైమ బెరుకు బెరుగ్గా వచ్చింది దగ్గరకు. బొమ్మలు తీసికొని వెళ్ళిపోయింది.

"అలవాటుపడితే ఇక వివ్చిపలదు పాప!" శ్రీనివాసరావు నవ్వుతూ అన్నాడు.

క్రొత్త వాతావరణం. క్రొత్త బాధ్యతలు. క్రొత్త జీవితం! మానవజీవిత మెంత విచిత్రమైనది? ఈ నిముషంలో వ్యధ, మరునిముషంలో సుధ. ఈ నిముషంలో దుఃఖం, మరునిముషంలో ఆనందం. విలాసపురుషుల మధ్య, పిన్ని అక్రమాల తెరచాటున, నాన్న ఆవేదనాభరిత చరిత్రమాటున, శంకరం నీచపు దృష్టిని

పవని నిర్మల ప్రభావతి

## జరిగిన కథ

[శ్రీనివాసరావు తన దుర్గుణాలు కారణంగా భార్య శారద చావుకు కారకుడయ్యాడు. చివరిక్షణాల్లో ఆమెచూపిన భర్తృప్రేమ అతనిలో పశ్చాత్తాపాన్ని కల్గించి, అతని జీవితాన్ని పూర్తిగా మార్చేసింది. శారదవల్ల కల్గిన సంతానంలో పుత్రుడు గతించాడు; పుత్రిక హైమ పెరుగుతోంది. చెల్లెలు శారద చావుబ్రతుకులలో వుందని చూడబోతే, ఆమె తన గాథ సామూలాగ్రంగా చెప్పి చనిపోయింది. అనుమాన పిశాచం ఆవరించి ఇందిరను భర్త పెట్టిన బాధలు విని క్షోభచెందాడు. ఆ పరిస్థితులలో తల్లితండ్రుల కోరికపై, విధిలేక రెండవ వివాహానికి అంగీకరించి మీనాక్షిని చేసుకున్నాడు. మీనాక్షి శ్రీనివాసరావులు, తమతమ యాతనామయ జీవితాలు వదలిపోయినందుకు ఆ తిరుపతి వెంకటేశ్వరునికి అంజలి ఘటించి మొక్కారు ఇద్దరూ.]

— ఇక చదవండి

వెనుక, భవిష్యత్తు శూన్యంగా గోచరించిన తనకు, అది పూలబాటగా మారింది! అత్తగారు, మామగారు, మరది, ఆడబిడ్డ, మంచిభర్త, మాతృప్రేమకోసం పరితపిస్తున్న పాప! ఎన్ని అపురూపమైన బహుమతులు లభ్యమయ్యాయి? ఈ జన్మ కింక కోరవలసిన దేముందీ? తరచూ ఇలాటి భావనే కలుగుతోంది మీనాక్షికి!

బెరుకు తీరి పాప బాగా దగ్గరకు వస్తోంది. "పిన్నీ!" అంది హైమ. "కాదమ్మా అమ్మ. అమ్మ అనే పిలు!" అంది మీనాక్షి.

హైమ విచిత్రంగా చూచింది. "ఎలా నమ్మటం?" అని ప్రశ్నిస్తున్నాయి కళ్లు.

"మీ అమ్మ శారద కదూ? ఆవిడ నన్ను నీకు అమ్మగా వుండమని పంపించింది పాపా!"

"అల్లాగా? అయితే 'అమ్మ' అనే పిలుస్తాను."

"పాపను నాదగ్గర పడుకోబెట్టుకుంటాను..." అంది సుభద్రమ్మ. మీనాక్షి కావి డెందు కలా అంటోందో అర్థంగాకపోలేదు.

"వద్దత్తయ్యా! పాప మాదగ్గరే పడుకుంటుంది. 'అమ్మా' అని పిలుస్తున్న పాపహృదయంలో మళ్ళీ ఈ చిన్నప్రవర్తన ఎన్నో సందేహాలతోబాటు చిన్ని అరకూడా తయారుచేస్తుంది. అలా ఆ పాపమనసులో ఏలాటి కుశంకలూ తలెత్తనీయడం నా కిష్టంలేదు..."

మీనాక్షి సమాధానానికి, ఆశ్చర్యంకంటే కృతజ్ఞతతోనే సుభద్రమ్మకళ్లు ఆర్ద్రాలయ్యాయి.

ఎన్నోకథలు చెబుతుంది మీనాక్షి ... ఏవేవో సందేహాలు ప్రశ్నలుగా వేస్తుంది



హైమ. ఓపిగ్గా సమాధానాలు చెబుతుంది మీనాక్షి. తన బడిలో సంగతు లేవేవో కబుర్లు చెబుతుంది పాప; శ్రద్ధగా వింటుంది మీనాక్షి. తనను చుట్టుకుపోయి నిద్రిస్తున్న హైమను చూస్తుంటే, చిన్నప్పుడు రవి ఇల్లాగే పడుకొనటం గుర్తుకొచ్చేది. ప్రశాంతంగా, నిద్రిస్తున్న హైమను చూస్తుంటే, ఏదో తెలియని వాత్సల్యంతో మనసు నిండిపోతుంది. పసిబిడ్డలు అమాయకలు. మోసాలూ, ద్రోహాలూ, కపటమూ, వంచనా ఎరుగని నిర్మలహృదయులు వాళ్లు. అనురాగం చూపిస్తే ఆనందంతో ఉరకలువేస్తారు. కాఠిన్యం చూపిస్తే, కలవరపడి, బెదరిపోతారు. స్వచ్ఛమైన దర్పణాలు వారి హృదయాలు. మంచయినా, చెడయినా, ప్రేమనయినా, ద్వేషాన్నయినా, ప్రతిబింబింపజేస్తారు. వారి తప్పేమీలేదు. అది ఇచ్చేవారిదీ, ఇచ్చేగుణాన్నిబట్టి వుంటుంది.

హైమ నిద్రపోగానే, భర్త మంచంవేపు నడిచివెళ్తుంది మీనాక్షి.

"నిద్రపోతున్నారా? నిద్ర నటిస్తున్నారా?"

"రెండోపనే చేస్తున్నాను ... పాప నిద్రపోయిందా?" శ్రీనివాసరావు చల్లగా చందమామలా నవ్వుతాడు.

"ఆఁ!"

"మీనా! నే నెంత అదృష్టవంతుణ్ణి..."

"...చాలు. చాలు. పొగడ్తలుకూడా శృతిమించితే, దూషణను మించిన

బాధ కల్గిస్తాయి. జీవితాంతం మనిద్దరిమధ్యా ఈ అదృష్టాన్ని నిలుపుకుని, చివరి క్షణాల్లో అనుకుందాం, 'అదృష్టవంతులం' అవి, సరా ?"

"మీనా ! ఏదేనా పాట పాడరాదూ వింటాను."

"ఈ నిశాసమయంలో నేను గొంతు విప్పితే, ఊరంతా పరుగెత్తుకువస్తారు. ఏదో ప్రమాదం జరిగిందని..." మీనాక్షి స్వచ్ఛంగా నవ్వింది.

"పోనీ కబుర్లు చెప్పు..."

"అల, వల, ఇసుక, ఈగ, ఉడుత, ఊయల......"

శ్రీనివాసరావు గబుక్కున దగ్గరకు తీసుకుంటాడు –

"ఎక్కడ నేర్చుకున్నావ్ ఈ గడుసుదనం ?" అంటూ.

"మీ దగ్గరే...అంతక్రితం, మాటలు కూడా రాని, మూగి మొద్దును నేను. జీవచ్ఛవాన్ని..."

ఆ ఏకాంత నిశాసమయంలో, ఆనందం, సౌఖ్యం, సంతృప్తి, జీవన మాధుర్యం రాజ్యం చేస్తాయి ! శ్రీనివాసరావు సన్నిధిలో స్వర్గమే కన్పిస్తోంది మీనాక్షికి.

ప్రశాంతంగా నిద్రిస్తున్న భర్త ముఖాన్ని చూస్తూ, అల్లాగే కూర్చుండిపోతుంది మీనాక్షి !

తన పాపను బాధిస్తుందేమో ననే దిగులు లేదు ఆ వదనంలో. తనను మోస గిస్తుందేమోననే శంక లేదా వదనంలో.

తనకూ తన పాపకూ, తన కుటుంబానికీ అన్యాయం జరుగుతుందేమోననే వ్యాకులత లేదతనికి సుందరవదనంలో. అందుకనే ఇంత నిశ్చింతంగా, తల్లి ఒడిలో బిడ్డలా, నిద్రిస్తున్నాడు. మరి తను ? కొందరు స్త్రీ పురుషులకు, వయసుకు మించిన మనసూ, ఊహాశక్తీ వుంటాయి. బాధ్యతలు కూడా అల్లాగే వర్తిస్తాయి. అందు వల్లే వారు, వయసుకంటే, అనుభవాల్లో, ఆలోచనలలో పెద్దవారుగా మారిపోతారు. మీనాక్షి ఆ కోవకు చెందినదే ! చిన్నతనంనుంచీ, తల్లితండ్రుల విరసదాంపత్యం లోనూ, మాతృవిహీనలైన తనూ, తమ్ముడూ అమ్మమ్మగారింట్లో వుండగానూ, రవికి తల్లిగా తను ఊరట కల్గించింది. ఇప్పుడు, జీవితంలో చెడు మార్గంలో కళ్ళుమూసుకు పరుగెత్తి, మానవత్వం కోల్పోయి, తన పైశాచిక కృత్యంతో, హఠాత్తుగా కళ్ళు తెరిచి, పాశ్చాత్తాపాగ్నితో దగ్ధమయి, భవిష్యత్తు ఎలా వుంటుందో ననే బాధతో, భయంతో వున్న భర్త; తల్లిప్రేమకు దూరమై, తండ్రిని




సరిగా నమ్మలేక, భయభ్రాంతయై చూస్తూన్న చిన్నారి పసిపాప హైమా ఇద్దరూ తన గుండెల దగ్గర వున్నారీ నాడు.

వాళ్ళిద్దరి హృదయాలనూ, తన అనురాగపూరిత ప్రవర్తనతో, లాలనతో, సాంత్వన కలిగించాలి. అంతేకాదు, ఈ సంసారంలో ఇంకా కొందరు వ్యక్తులున్నారు. కళ్యాణి, ప్రభాకర్, అత్తయ్య, మామయ్య. వీరి హృదయాల్లోనూ తనను గురించి ఎన్నెన్నో సందేహాలు వుండొచ్చు. వీరిద్దరికీ కూడా తను, తన వ్యక్తిత్వాన్ని నిరూపించాల్సిన బాధ్యత ఎంతేనా వుంది. తను కేంద్రంగా వున్న ఈ కుటుంబ అభ్యున్నతికీ, శాంతికీ తను శాయశక్తులా పాటుపడాలి. చుట్టూవున్న ఈ వ్యక్తులతో అమృతవలయాన్నయినా, విషపరిధినయినా సృష్టించగల శక్తి ఒక్క స్త్రీలోనే వుంది. అమృతమయంగా ఇతరుల జీవితాల్ని మార్చి, ఆ అమృతంతోనే, తనూ ప్రశాంతత పొందగల నేర్పు ఏ కొద్దిమందికో గానీ వుండదు. అందులోనే జీవనసార్థకత కూడా నిండివుంది.

భగవాన్ ! ఏ సమయంలోనూ, ఎవరి విషయంలోనూ, నా మనస్సు అధర్మ మార్గాన పయనించకుండా, కాపాడు తండ్రీ ! ఈ నిముషంలో, ఈ భర్త, ఆ పాప, ఇతరులైన నావారిమీద, ఈ మమతానుబంధాల నిల్లాగే శాశ్వంతంగా నాలో వుంచు. స్త్రీత్వానికి సబబైన సక్రమ మార్గంలో నన్ను సదా నడిపించు...ఇంతకంటే నే నేమీ నిన్ను కోరను తండ్రీ !"

మీనాక్షి హృదయం నివేదిస్తున్న ఆ కోరికలను సర్వాంతర్యామి వింటున్నాడనేందుకు నిదర్శనంగా శుక్రతార మిలమిలలాడింది !

కొందరు వ్యక్తుల మనస్తత్వం ఊహాకందనంతటి విచిత్రంగా వుంటుంది. తాము బాగుపడరు, ఇతరులు బాగుపడుతుంటే చూడలేరు. భర్తృహరి చెప్పిన "వృధాస్వార్థ భంగము గావించెడి" జాబితాలోకి చేరుతారిలాటి వ్యక్తులు.

సుభద్రమ్మ, కళ్యాణి, హైమ ఏదో భక్తిరస ప్రధానమైన సినిమాకు వెళ్లారా రోజు. మీనాక్షి, శ్రీనివాసరావులు రెండో ఆటకు వెళ్ళాలని తీర్మానించుకున్నారు. శ్రీనివాసరావు షికారు కెళ్ళాడు. సీతాపతిగారు కూడా, తన సహవయస్కులతో, వేదాంత గోష్ఠిలో వున్నారు ఎదురింట్లో. మీనాక్షి ఒక్కత్తే వుంది. సాయంకాలపు ఇంటిపనులన్నీ ముగించుకువచ్చి, తాపీగా కూర్చుని పూలు కడుతోంది.

పక్కింటి కమలమ్మ మెల్లిగా వస్తోంది, దిక్కులన్నీ పరిశీలనగా చూస్తూ.

"ఇంట్లో అంతా కట్టకట్టుకు పోయినట్లున్నారే?"

కమలమ్మ మొదటిప్రశ్నే వింతగా తోచింది మీనాక్షికి.

"రా పిన్నీ! ఆఁ! అత్తయ్యావాళ్లు సినిమా కెళ్ళారు..." నవ్వుతూ చాప పరిచింది మీనాక్షి!

"ఇంకా ఈ వయసులో తనకు సినిమా లేమిటమ్మా? చిన్నదానివి, నిన్ను పంపించాల్సింది పోయి, కూతుర్నీ, మనవరాల్నీ వెంటేసుక తగుదునమ్మాని సినిమాకు పోవటానికి సిగ్గు లేకపోతే సరి..."

మీనాక్షికి చికాక్కలిగింది. ఈ అనవసర నిందారోపణ నాందిగా సంభాషణ ఎక్కడకు పోతుందో అర్థంగావటంలేదు మీనాక్షికి.

"వయసుకూ, అత్తయ్య సినిమా కెళ్ళటానికీ లంకేమిటి పిన్నీ?" చికాకుగా అడిగింది. "ఇంతకూ నువ్వేంపనిమీ దొచ్చావో చెప్పావుకాదు," అంది మళ్ళీ.

"ఆఁ! ఒంటరిగా కూర్చునివున్నావని తెలిసీ, తోడుగా కూర్చుందామని వచ్చాను. మీ మామగారున్నారనుకుందామంటే, ఆయ నెక్కడో ముక్కుమూసుక్కూర్చుని వుంటాడాయె! మీ వారూ వూరిమీద పడ్డారు కాబోలు..."

మీనాక్షి తల వంచుక పూలు కట్టుకుంటోంది. పండయినా, పాపమయినా పండితేగానీ, తగిన ప్రతిఫలాన్ని పొందవు.

"అమ్మాయ్ మీనాక్షీ! నిన్ను చూస్తుంటే నాకు జాలివేస్తోందమ్మా! నా బిడ్డలాగున్నావ్ కాబట్టి. ఇంతబాధ! రాగానే నరకంలో కాలెట్టావమ్మా! హాయిగా త్రుళ్ళుతూ, గెంతుతూ, వయసు భర్తతో కాపురం చెయ్యాల్సిన నీకు, రెండో పెళ్ళి భర్త నిచ్చాడా గుడ్డిదేవుడు. పైగా, సవతి కూతురూ, బాదరబందీ, ఇంటి నిండా జనం!"




మీనాక్షికి కమలమ్మను చూస్తుంటే జాలి ముంచుకొచ్చింది. తననుగురించి కేవలం ప్రేమతోనే ఈ మాట లంటోందా ఆవిడ ? కాదుకాదు, ఏదో మేలు చేద్దామనే తాపత్రయంతో, చెడు నూరిపోస్తోం దన్యాపదేశంగా ! ఈ మన స్తత్వం బహుశా ఏదో మానసిక దుర్బలత కారణంగా జన్మించేదే ? ఏదైతేనేం, ఇలాటి వారి బోధలు, చల్లగా సాగుతున్న సంసారాల్ని చిచ్చులో త్రొయ్యగలవు.

"ఇంతకూ పిన్నీ, నువ్వు చెప్పేదేమిటి ?" కుతూహలంగా అడిగింది మీనాక్షి.

"నీకు తెలుసో తెలీదో మీనాక్షీ ! మీ సవితి, శారద మహా ఇల్లాలమ్మా. కాల్చుకు తిన్నారు తల్లీ కొడుకూ. చివరకు మీ ఆయన కాల్చే చంపాడు...నే చెప్పినట్లు చేస్తావా ?" కమలమ్మ ధోరణి కిక అడ్డుకట్ట వెయ్యడం మేలనిపించింది మీనాక్షికి.

"పిన్నీ ! నీ సలహా లేమీవద్దు. ఏదో పెద్దదానివని గౌరవించాను. ఆ పెద్దరికం నిలుపుకోలేకపోయావ్. నా యింట్లోవాళ్ళ స్వరూప స్వభావాలు, గుణశీలాలు నాకు తెలుసు. నా కర్తవ్యమూ, నా సుఖసంతోషాలకు మార్గాలూ నే చూచుకోగలను; నా భర్త ఎలాటివాడయినా, భరించేది నేనుగానీ, నువ్వుగాదు. మా అత్తయ్యా, తదితరుల సంగతికూడా నీకనవసరం. సవితిబిడ్డో, నా బిడ్డో, నావాళ్ళు నాకు బరువుకారు...ఇక మీదట ఇలాటిమాటలు నా దగ్గర మాట్లాడకు...వెళ్ళు ముందు..."

మీనాక్షి రౌద్రాకారానికి కమలమ్మ నిశ్చేష్టిత అయ్యింది.

"చూడమ్మా, కమలమ్మా ! నా కోడలు గుణవంతురాలు కాబట్టి సరిపోయింది. లేకుంటే, రామనాథంగారి కోడలులానే, నీ మాటలూ, సలహాలూ విని ఆచరించి,

మా సంసారాన్నికూడా ఆరుముక్కలుగా చేసేంతటి మూర్ఖురాలుకాదు మా మీనాక్షి! భర్త చచ్చి దిక్కులేని నీకూ, నీకొడుక్కూ నే చేసిన సహాయంకూడా గుర్తుకురాలేదా నీకు? వెళ్ళు ... వెళ్ళు ముందు ... మంచిగా మసులుకోడం, వయసుమీరింతర్వాతైనా నేర్చుకోకపోతే ఎలా కమలమ్మా?''

గుమ్మంలో నిల్చొని సీతాపతిగారు అంటున్నమాటలతో, కమలమ్మ బేజారెత్తిపోయింది. మీనాక్షి తలవంచుకుంది. తమ సంభాషణ ఆయన వింటున్నాడు కాబోలు అనుకుంది. కమలమ్మ వెళ్ళిపోయింది రోషిలా! మామగారు పూజామందిరంలో ప్రవేశించారు.

"మీనా! ఆవిడమాటలకు నువ్వేం సమాధానం చెబుతావోనని, ఆ గదిలోనుంచి చెవులు రిక్కించుకుంటున్నాను. భేషగ్గా గడ్డిపెట్టావ్..." శ్రీనివాసరావు నవ్వుతూ భుజంతట్టాడు.

''నీలా వివేకంతో, అలాటివారిని విదిలించి వేసేవారు చాలా తక్కువగా వుంటారు మీనా! సమాజానికి చీడపురుగుల్లా కమలమ్మలాటి వ్యక్తులచలవతో చల్లని సంసారాలు సర్వనాశనమైపోతాయి. అందాకా ఎందుకు మీనా? సవతి బిడ్డకు, సవతితల్లిపై స్వతహాగా ద్వేషం ఏర్పడదు. పసిపాప లెప్పుడూ నిష్కల్మష హృదయులే. ఒకటికి పదిమార్లు, రాబోయే లేక వచ్చిన సవతివల్లిని గురించి భయంకరంగా కథలు, గాథలుగా వర్ణించి వర్ణించి చెప్పి, ఆ నిర్మలహృదయాలలో లేనిపోనిభీతిని కలుగజేస్తారు చుట్టుపక్కలవారు. అంతటితో వూరుకోక, 'అదుగో ఆవిడ ఆ బిడ్డను కొడుతోంది, తిడుతోంది, బాధిస్తోంది,' అంటూ గోరంతలు కొండంతలు చేసేస్తారు. కన్నతల్లి, తనబిడ్డల్ని తిట్టక, కొట్టక, దండించకండానే పెంచుతోందా? సవతితల్లి కసురుకున్నా తప్పే! ఇలా ఆ ఇద్దరువ్యక్తుల మధ్యలో అగాధాల్ని సృష్టిస్తారు. చుట్టుప్రకలవారి మాటలతో, రానురాను నిజంగానే ఆ ఇద్దరిమధ్యా ద్వేషం, కోపం గోడలు కడుతాయి. అత్తాకోడళ్ళమధ్యా, చివరకు భార్యాభర్తలమధ్యాకూడా విద్వేషాలను రుగుల్కొల్పుతారు. వినేవాళ్ళు వివేకశూన్యులైనపుడే ఇలాటి విషమపరిస్థితు లేర్పడుతుంటాయి. అందుకే, చెప్పేవాళ్ళ తప్పులేదు, వినేవాళ్ళ చెవులు తెగ్గొయ్యా లంటారు మనపెద్దలు.''

"నా చెవులు తెగ్గొస్తా రేం ఖర్మ?'' మీనాక్షి చేతులు చెవుల కడ్డం పెట్టుకుంటూ నవ్వింది.

"...ఇంత అపురూపమయిన నీ చెవులు కోస్తానా?" శ్రీనివాసరావు గలగల నవ్వాడు దగ్గరగా వస్తూ.




"నిగ్రహం. నిగ్రహం; మామగారు ప్రసాదం పట్టుకొస్తున్నారు...''

"అబ్బ ఉప్పెనలా పొంగే ఉత్సాహాన్ని చెడగొడతావ్ మీనా! అందుకే నీమీద నా కోపం..."

"ఎంతవర కేమిటి?

''పీకలవరకూ!"

"ఫర్వాలేదు. ఆపైన ప్రేమ వున్నట్లేగా? అదిచాలు నాకు." ఇద్దరూ కబుర్లలో పడిపోతారు. అమావాస్య రాత్రులలునా, నిండుపున్నమినాటి చల్లదనాన్నె వెదజల్లిన ట్లనిపిస్తుంది.

*　　　*　　　*　　　*

రోజులు, ప్రశాంతంగా హాయిగా గడిచిపోతున్నాయి. కాలప్రవాహంలో చీకటి వెలుగుల లానే. మీనాక్షి ఆవేదనాభరిత జీవితానికివి పున్నమిరోజులు. ఆమె హృదయం అనుక్షణం ఆనందంతో పులకిస్తోంది. అప్పుడప్పుడూ తండ్రిని గురించిన ఆలోచన చిన్నమేఘశకలంలా తొంగిచూచి యమాయౌతూంది. ఆయనెక్కడున్నాడో? ఎలా వున్నాడో? ఈ భావన రాగానే ఆమెనేత్రాలు అశ్రుతప్తాలవుతాయి, కానీ అంతలోనే అసమానమైన భర్తృప్రేమలో మునిగిపోయి, సర్వం మరిచిపోతుంది.

స్త్రీ ఓవిధంగా చూస్తే, స్వార్థపూరితురాలేమో! యుక్తవయసొచ్చేవరకూ. అష్టకష్టాలూపడి కనిపెంచిన తల్లితండ్రులనూ, సోదరీ సోదరులనూ, బంధువు

లనూ, స్నేహితులనూ, భర్త పరిష్వంగంలోకి వచ్చిన మరుక్షణంలోనే విస్మరిస్తుంది; పూర్తిగా మరచిపోకున్నా, ఆమె హృదయంలోని రాగయురి, భర్తవేపే మొగ్గు చూపి ఉరకలు వేస్తుందనటం నిర్వివాదాంశం. కానీ ఆ స్వార్థంలోనే పరమార్థం కూడా నిండివుంది. తన భర్తకూ, బిడ్డలకూ స్త్రీ చేసే నిస్వార్థ, నిష్కల్మష సేవే మోక్షమార్గాన్ని వేలెట్టి చూపుతాయి. అందుకే అత్తవారింట్లో కష్టాలనీ, పుట్టినింటి అనురాగాన్నీ కూడా సహించి, విస్మరించి, భర్త ననుసరించగలుగుతోంది భారతనారి.

సంతృప్తితో, సంతోషంతో ఆమె హృదయం నిండిపోతోంది. మెల్లిగా రోజులు, వారాలుగా, వారాలు నెలలుగా, నెలలు సంవత్సరాలుగా తర్జుమా అవుతున్నాయి. ఆనందసాగరంలో మునిగితేలేవారికి కాలగమనం తెలియకపోవడంలో ఆశ్చర్యం లేదు.

ప్రభాకర్‌కూ, కళ్యాణికీ ఒకేసారి వివాహం చెయ్యాలని నిశ్చయించుకున్నారు సీతాపతిగారూ, సుభద్రమ్మా!

ప్రభాకర్, వధువు సుశీల బి. ఏ. పాసైయ్యింది. అందంగా వుండాగా, 'చదువుకున్న అమ్మాయి' అనిపించేందుకు సదా ప్రయత్నిస్తున్నట్లు కన్పిస్తుంది.

కళ్యాణిభర్త మోహన్ ... అతిలోకసుందరుడు కాకున్నా, అనాకారి మాత్రం కాడు. స్ఫురద్రూపి. రూపానికి మించిన మంచితనం. ఎం. ఏ. డిగ్రీ పుచ్చుకుని లెక్చరర్‌గా పనిచేస్తున్నాడు.

కళ్యాణి అత్తవారింటికి వెడుతోంది.

మీనాక్షి కళ్ళల్లో నీళ్ళు నిలిచాయి అప్రయత్నంగా.

"వదినా! వెళ్లొస్తానమ్మా!" గాద్గదికంగా అంటున్న కళ్యాణిని దగ్గరకు తీసుకు ఓదార్చింది మీనాక్షి.

కళ్యాణి, మోహన్‌లు కూర్చునివెడుతున్న బండి, కనుమరుగయ్యేవరకూ చూస్తూండిపోయారు మీనాక్షి, శ్రీనివాసరావూ, సుభద్రమ్మా, సీతాపతిగార్లు, సజల నేత్రాలతో.

ఆ రోజంతా, ఏదో పోగొట్టుకున్నట్లుంది ఇంట్లో అందరికీ.

తను వచ్చినతర్వాత, ఈ నాలుగేళ్ళలోనూ, కళ్యాణి ఎంతో చనువుగా వుంది. జడవెయ్యటం దగ్గర్నుంచి, తెలియని పాటా లేవేనా చెప్పేవరకూ, తనవెంటే తిరుగుతూండేది. అప్పుడే పెద్దదై, పెళ్ళయి, గృహిణిగా వెళ్ళిపోయింది కళ్యాణి!

హైమ ఒంటరిగా మిగిలిపోయింది. దానికీ ఏంతోచలేదు కాబోలు.

వారంతర్వాత, విశ్వనాథందగ్గర్నుంచి ఉత్తరం వచ్చింది. మీనాక్షి పెళ్ళయిం



తర్వాత, ఆయన, వసుంధరదగ్గర కెళ్ళలేదు తిరిగీ. చిన్నపుడు తనను ప్రాణ సమానంగా చూచుకుంటూండిన, తన చిన్నాన్నకొడుకు రామయ్యన్న ఇంటి కెళ్ళాడు, ప్రశాంతంగా బ్రతకాలనే ఉద్దేశ్యంతో. రామయ్య తన నెంతో ప్రేమగా చూస్తు న్నట్లూ, బ్రతుకు విశ్రాంతగా వెళ్ళిపోతోందనీ, అప్పుడప్పుడూ క్షేమసమాచారాలు తెలియజేయవలసిందిగా ఉత్తరాలు వ్రాస్తున్నాడు.

ఉత్తరం విప్పింది మీనాక్షి. చాలా పెద్దజాబు. తండ్రి ఏమేం వ్రాశాడో ననే ఆదుర్దాతో గబగబ చదవటం మొ లెట్టింది.

"మీనా! అమ్మలూ!

ప్రశాంతంగా హాయిగా. ఆరోగ్యంగా చల్లగా సంసారం సాగిస్తున్నా వని వ్రాశావు. నిజంగా ఎంత సంతోషంగా వుందో తెలుసా నాకు? శరీరంలో శరీరమూ, ప్రాణంలో ప్రాణమూ అయిన కన్నబిడ్డ, ఆయురారోగ్య ఐశ్వర్యాభి వృద్ధులతో కళకళలాడ్తున్నట్లు తెలుసుకొనడంకంటే కన్నవారు కోరే దేముంది తల్లీ? పసితం నుంచీ నీ స్వభావం సాత్వికమైనది అమ్మలూ! నువ్వు ఎవరికీ అపకారం చెయ్యవు. అందుకే నీకూ భగవంతు డన్యాయం చెయ్యడు. కాబట్టే నాలాటి దౌర్భాగ్యుడికి బిడ్డగా పుట్టి వసుంధరలాటి నీచస్త్రీ చేతిలోపడి, నీ వివాహానికి వేలు ఖర్చు పెట్టలేనిస్థితిలో నే నున్నప్పటికీ, నీకు శ్రీనివాసరావులాటి సజ్జనుడు భర్తగా లభించాడు. ఈ విషయంలో మనిద్దరమూ అదృష్టవంతులమే తల్లీ!

ఈమధ్య నా కో ఊహ కల్గింది, హఠాత్తుగా ఇలా రామయ్యన్నయ్య ఇంట్లో కూర్చుని ఊరికే తింటూ, తిరుగుతూ కాలం వెళ్ళమార్చటంలో అర్థం లేదనిపించింది) అసలలా సోమరిలా వుండటంకూడా చికాకనిపించింది. తాతగారు (మా నాన్నగారు. స్వార్జితంలో కొద్దిగా, నావాటా రామయ్యన్నయ్య అనుభవిస్తున్నాడు చాలా సంవత్సరాలుగా. వసుంధరకు ధారావత్తం చేసిన ఆస్తిలో ఇదిలేదు. అన్నయ్యే "నీ వాటా నువ్వు తీసుకు అనుభవించు విశ్వం," అన్నా డొకరోజు. నాకు నవ్వొచ్చింది. ఇప్పుడు కొత్తగా నావాటా నేను తీసుకు ఏమనుభవించేది? ఎవరికోసం ఈ అనుభవం? ఎంతకాలం? దార్ఢ్యం రోజురోజుకూ హెచ్చరిస్తోంది మృత్యువు. రోజురోజుకూ సమీపిస్తోంది.

ఒక్క సారి పుణ్యక్షేత్రాలన్నీ దర్శించాలనే వూహకల్గింది. కలిగిందే తడవుగా దృఢతరమై కూర్చుంది. అన్నిబాధ్యతలూ వదిలిపోయాయి నీ వివాహంతో! ఇక నా కే బ్బడంకీలేదు. హాయిగా తీర్థయాత్రలు చేసి, కనీసం ఈ జన్మలోని సంచిత పాపాలలో కొన్నయినా ప్రక్షాళన చేసుకుంటాను. అనిపించింది. నా వాటాకున్న భూమి అమ్మివేశాను. అనుకున్న దానికంటే ఎక్కువగానే వచ్చింది డబ్బు. తిన్నగా కాశీదగ్గర మొదలుపెట్టుకుని యాత్రలు చేస్తున్నాను.

దేవాలయాని కెళ్ళి తిరిగివస్తున్న నా భుజంమీ దెవరో చెయ్యివెయ్యటంతో ఉలికిపడి వెనుదిరిగిచూశాను. శర్మ! చిన్ననాటి నేస్తం మొదట్లో గుర్తుపట్టలేకపోయాను.

"విశ్వం! నేనురా శర్మను ... ఇంకా నమ్మకం కలుగలేదూ?" అంటున్నాడు శర్మ- నా వయస్సే అయినా, నాకంటే చాలావృద్ధుడైనట్లు కన్పిస్తున్నాడు చేతికర్ర సాయంతో నడుస్తున్నాడు ఒక్కక్షణంలో బాల్యస్మృతులన్నీ నా మనోనేత్రాలముందు దృశ్యాలుగా కన్పించాయి. కలవారిబిడ్డను నేను. కటికదరిద్రుడు శర్మ! చినిగినగుడ్డలతో, తలకు నూనెకూడా లేకుండా, పిల్లల అవహేళనలతో కుంచించుకుపోతూ బడికి వచ్చే శర్మను చూస్తుంటే నా గుండెల్లో ఎవరో చెయిపెట్టి కెలికిన ట్లయ్యేది. అదేంచిత్రమో, మా ఇద్దరికీ స్నేహంకూడా విపరీతంగా కుదిరింది.

ఎన్నోమార్లు శర్మకు పుస్తకాలు, పెన్సిళ్ళు కొనిచ్చాను. స్కూలుఫీజు కట్టాను "విశ్వం! నీ ఋణం ఎలా తీర్చుకోనురా?" అనేవాడు శర్మ కృతజ్ఞత నిండిన కళ్ళతో నావేపు చూస్తూ.

"ఎప్పుడో నీ ఇంట్లో తిష్టవేస్తాలే! ఈ వారంతా అప్పుడు గుంజేస్తాను..." అనేవాణ్ణి నవ్వుతూ.'




"అంతకంటేనా? భగవంతుడి దయవల్ల, తిన్నగా నాకూ ఓ డిగ్రీ అంటూ వచ్చి నేనూ నాలుగుడబ్బులు సంపాదించుకోగల మనిషినయితే చాలురా! విశ్వం ఆజన్మాంతం నువ్వు నాదగ్గ రున్నా, నాకు సంతోషంగానే వుంటుంది సుమా!" అనేవాడు శర్మ!

ఓడలు బండ్లు, బండ్లు ఓడలవుతాయనే సామెత వినటమేగానీ, కళ్ళతో చూళ్లే దెప్పుడూ. అదికూడా తెలిసింది బాగా త్రాగుడుతో, విలాసాలతో, చెడువ్యసనాలతో, ఉన్నా లేనివాణ్ణయ్యాను నేను ... సత్ప్రవర్తనతో, నిజాయతీతో, సిరి తన్నుకువచ్చి శ్రీమంతుడయ్యాడు శర్మ. మహలక్ష్మిలాటి శ్రీమతి రాకతో మరింత లక్ష్మీసంపన్ను డయ్యాడు.

"విశ్వం, ఏమిటి విశేషాలు?" అన్నాడు ఆప్యాయంగా. ఆనాటి శ్రీకృష్ణ కుచేలుల సమాగమ దృశ్యం కళ్ళముందు మెదిలింది.

ప్రాణమిత్రునితో నా జీవితగాధ సంక్షిప్తంగా చెప్పాను ...

"ఎంతో ఆస్తిపరుణ్ణి! ఈనాడు ఇలా దిక్కులేనివా ణ్ణయ్యాను!" అన్నాను నిట్టూరుస్తూ.

"లేదు విశ్వం ... ఆస్తీ, డబ్బూ ఎక్కువైనా బాధే! నా సంగతి చూడు!

ఈమధ్య పదిరోజులుగా, గాలి స్వేచ్ఛగా పీలుస్తున్నానంటే నమ్ము..." అన్నాడు శర్మ.

విస్మయం చెందాను. లక్ష్మీపుత్రుడయిన శర్మకుక్కూడా కష్టాలా? ఏమో! నమ్మలేను.

"అవును విశ్వం ... నువు నమ్మలేవు ... నా భార్య శ్రీలక్ష్మి సంవత్సరం క్రితం చనిపోయింది ... అందాకా, నాకున్న ఈ విపరీత సిరి బాధనిపించలేదు. కానీ శ్రీలక్ష్మి మరణంతో, 'డబ్బు ఎలాటివారినీ, ఎంతటి పనులేనా చేయిస్తుంది! ఎంతేనా కక్కుర్తి పడనిస్తుంది. అందుకోసం ఎన్నిరకాల వంచనలేనా సృష్టిస్తుంది' అనే నిర్ణయానికి తెచ్చింది..."

"ఏం?" అని కారణమూ, కథా అడగలేదు నేను. కానీ శర్మే చెప్పుకుపోవటం మొదలెట్టాడు.

"శ్రీలక్ష్మి చనిపోయింది. నాకు బిడ్డల్లేరు. కట్టుకుపోయేంత సిరి. ప్రాణప్రదంగా చూచుకుంటున్న శ్రీలక్ష్మి నన్ను వీడిపోవటంతో, నాకు లోకమే శూన్యంగా తోచింది! దహనసంస్కారాది క్రియలన్నీ యథావిధిగా జరిగిపోయాయి. పౌరోహితులు, ఎన్నెన్నో పురాణకథలూ, వేదాంతమూ చదివ్వినిపించి ఊరడించారు. ఓ విధమైన విరక్తతా, అన్నీ మిధ్య అనే భావనా బలవంతంగా తెచ్చిపెట్టుకున్నాను. వృద్ధాప్యంలో దంపతు లొకరికొకరు చుక్కానిలాటివారు. వారిలో ఒకరు కనుమరుగైతే, రెండవవారిది గ్రుడ్డిజీవితమైపోతుంది... నాదీ అల్లాగే తయారైంది.

ఈగల్లా బంధుజనం మూగారు. భార్య చావుతో మతిపోయి ఏడుస్తున్న నాకు వీళ్ళ రభస మరింత దుఃఖరమైపోయింది. నాకు సేవ చేస్తామని వచ్చారుట అంతా!

మా దూరపు బంధువు-వరసకు అన్నవుతాడు-వాడి కొడుకు మురళి, కోడలు రాధ, పిల్లలు!

మా చెల్లెలికూతురు లలితా, దానిభర్త గోపీ.

మా వేలువిడిచిన మేనమామ తోడల్లుడి మనుమరాలు రేణుక, ఆవిడ భర్త శ్రీరాం, పిల్లలు.

వీరంతా, భార్యను పోగొట్టుకుని బాధపడుతున్న నన్ను ఓదార్చి, సేవ చేస్తారుట. నిద్రలేచేసరికి, వరండాలోకి, చెంబులతో వేణ్ణీళ్ళు, పళ్ళపొడీసిద్ధంగావుంటున్నై.

"బాబాయ్! పెరట్లో బావివరకూ నువ్వీ వృద్ధాప్యంలో నడవ్వాల్సిన బాధెందుకు? రాధకు పీకంటె, ఎక్కువైనవా శ్లైవరున్నారు గనుక? మామగారు, నే నుండగా,




ఏ పనికీ ఇతరులమీద ఆధారపడకూడదు." అంటోంది..." మురళి నవ్వుతూ చెప్పాడు.

పళ్ళు తోముకునే కార్యక్రమం ముగిసేలోపలే వేడిపాలు, ఏదేనా ఫలహారం సిద్ధంగా వచ్చి కూర్చుంటోంది.

"మామయ్యా! నీ ఒంటికి కాఫీ సరిపడదు. కాస్త ఖరీదెక్కువయితే అయ్యాయి. నీ ఆరోగ్యం కంటేనా? అందుకే పాలు తెచ్చాను. ఫలహారంకూడా ఉప్మాయే చేశాను.''

గోడవారగా నిల్చుని లలిత చిలకలా పలుకుతోంది. దాని వెనుకే, దానిభర్త గోపీకూడా వుంటాడనుకోడంలో సందేహంలేదు.

భోజనందగ్గిరి కొచ్చేసరికి నిజంగానే మతిభ్రమణ కలుగుతుందనే భయం కల్గు తోంది. రేణుక, శ్రీరాం దగ్గర కూర్చుని, "మామయ్యా! ఆ వంకాయకూర కలుపు కోండి ... ఛీ, ఛీ, ఆ నగ్గుబియ్యం పాయసం మీ వంటికి నరిపడదు. ఆ లలితమ్మ తల్లి చేసింది కాబోలా అరటికాయవేపుడు! దూరంనుంచి చూస్తుంటే, నాకే కొయ్య ముక్కల్లా కన్పిస్తున్నాయి, మీ రెలా తింటారు? ఈరోజు దగ్గరుండీ, రేణుక చేత వండించాను.'' రేణుకకూడా మధ్య మధ్యలో శ్రుతికలుపుతోంది. ఒక్కోసారి ఈ పోటాపోటీలతోనే కడుపునిండిపోతోంది. అన్నం మానేసినా బాగుండనిపిస్తోంది. మరోపూట మరోదంపతులవంతు! వారిలో వారికి దేష్వాలు! ఒకరిమీద మరొ కళ్ళకు కక్షలు. ఎవరికివారే, నాదగ్గర తా మొక్కరే ఆధిక్యులుగా, ప్రేమపాత్రు లుగా నిరూపించుకోవాలనే తాపత్రయం.

స్నానానికూడా, వేణ్ణీళ్లు నేరుగా నాగదిలోకే నడిచివస్తున్నాయి!

"ఇదేమిట్రా? నే నేం బాలింతనా?" చిరాకుగా ప్రశ్నించాను.

లలిత సమాధానం చెబుతోంది. "మామయ్యా! మీకు తెలీదు ... పెరట్లో కేమిటి? ఇంట్లోకి రావటానిక్కూడా బాగులేదు. ఆ శ్రీరాంగారి పిల్లలూ, రాధమ్మ పిల్లలూ నానా ఛండాలమూ చేసేశారు ఇల్లు!"

ఈ ప్రేమ లేమిటో నాకు తెలుసు! పిచ్చిలౌక్యం:

వద్దన్నా వినిపించుకోకుండా, శ్రీరాం నన్ను పిక్చరుకు లాక్కెళ్ళాడు. సినిమా లంటే మొట్టమొదటీ నాకంతగా ఇష్టంలేదు. మరీ ఈరోజుల్లో వస్తున్న సినిమా లంటేనూ! శ్రీలక్ష్మి వుండగా, ఏదేనా భక్తిరస ప్రధానమైన సినిమాలు వస్తే, వెళ్ళొచ్చేవాళ్ళం!

ఎట్లాగో కిటకిటలాడే ఆ ఆడా మొగా జనాన్ని తోసుకుంటూ తప్పించుకు వెళ్ళి ఓ పాడుసినిమా చూచి బయటపడ్డా మిద్దరమూ.

"మామయ్యా? ఆ రిక్షాలో మీరెక్కండి... నేను కాస్త పనిచూసుకుని, మీ వెనకే మరోరిక్షాలో వస్తాను..." అన్నాడు శ్రీరాం.

రిక్షా కదిలింది. ఇల్లువచ్చింది. దిగబోయి, పంచ తట్టుకు బోర్లాపడబోయి, సర్దుకున్నాను. కాలివేలు కొద్దిగా మడతపడి, గీచుకుని చిన్నచిన్న రక్తపుబొట్లు రెండు కారాయి. కాలుపట్టుకు ఇంట్లోకి వచ్చాను.

"బాబాయ్! ఏమయింది కాలు?" మురళి ఆదుర్దాగా పరుగెత్తుకు వచ్చాడు.

"ప్చ్! కాస్త కాలు గీచుకుంది బాబూ, రిక్షా దిగుతూంటే!" అన్నాను.

"అమ్మయ్యో! ఇంకేమైనావుందా!" ఏమేవ్ రాధా! బాబాయికాలు రక్తం చిందుతోంది: త్వరగారా! అందుకే ఆ శ్రీరాంగారికి నెత్తీనోరూ బాదుకు చెప్పాను. బాబాయిని చీకట్లో ఎక్కడికీ పిల్చికెళ్ళొద్దూ అని! వింటేగా? మహా ప్రేమవున్నవాడిలా లాక్కెళ్ళాడు సినిమాకు! మళ్ళీ దిగబెట్టఖర్లేదూ?"

రాధా, వేణ్ణీళ్ళూ, లోషన్, బాండేజ్ క్లాత్, అయింటుమెంటూ, కత్తెరీ, అన్నట్లు కాలుపెట్టుకోటాని కో స్టూలూ పట్టుకురా; ఊఁ! త్వరగా! రా!"

మురళి ఇల్లు పీకి పందిరేస్తున్నాడు! బిలబిల పిల్లలూ అంతా వచ్చి చుట్టుముట్టారు. కాలిబాధెలా పోయిందో, ఆ అపరాత్రి వీళ్ళరభస దుర్భరమైపోయింది. ఆ సినిమాలో కూర్చున్నా బాగుండే దనిపిస్తోంది మళ్ళీ: శ్రీరాం వచ్చాడు; ఏడుపు లకించుకున్నాడు. క్షమాపణ వేడుకున్నాడు. తనను తాను నిందించుకున్నాడు.

(సశేషం)

# పరుగెత్తి పాలే త్రాగుదాం

"పరుగెత్తి పాలుత్రాగేకన్నా నించుని నీళ్ళు త్రాగితే మేలు"- చెప్పడానికి ఎంతో సులువు. ఇటువంటి శ్రీరంగ నీతులు; కాని, ఆచరణలోకి తేవడానికి సాహసించగలమా?

ఒక వేళ సాహసిస్తామే అనుకోండి, ఎందుకు సాహసించాలని? సాహసించి చేసే ఘనకార్యం నించుని నీళ్ళు త్రాగడమా? సాహసించి నీళ్ళు త్రాగాల్సినంత ఖర్మ మే మొచ్చింది? వొద్దు, ముమ్మాటికి వొద్దు!

దేవరా! పరుగెత్తి పాలే త్రాగుదాం. నించుని నీళ్లు త్రాగితే నీళ్లుకారిపోతాం. పెద్దలు చెప్పడాని కేంలేండి. మహానుభావులు, ఎన్నైనా చెబుతారు! వారి వొంటికిమాత్రం పదేడిసిందా, నించుని నీళ్లు త్రాగడం?...

అసలు ఈ సామెతలోనే వుంది ఎంతో మహత్తరమైన సందేశం. ఈ సందేశాన్ని మనం సరిగ్గా అర్థం చేసుకుంటే ఇది ఏ కొద్దిమంది ఆలంకారికుల నోటిలోంచో కేవలం సారస్వతంగా వెలువడవలసిందే గాని నిత్యజీవితంలో ప్రజానీకంచేత ఉచ్చరించబడటానికి గాని, అనుసరింపబడటానికి గాని ఉద్దేశింపబడినది కాదని తెలియవస్తుంది.

ఈ సామెతలో మహత్తరమైన అపార్థానికి చక్కటి రాజమార్గం గోచరిస్తుంది. మనం దాన్ని అనుసరించిచూద్దాం—

'పరుగెత్తి పాలు త్రాగేకన్నా నించుని నీళ్లు త్రాగడం మేలు.' అంటే ఈ సామెతకారుని దృష్టిలో ఈ సామెత వెలువడిననాటికి అనేకమంది పరుగెత్తి పాలుత్రాగే స్వభావంగలవారే ననీ, వారంతా అంతటినుంచీ నించుని నీళ్లు త్రాగితే మేలు అనీ అయివుంటుంది.

అంటే ఈ సామెతద్వారా అత డొక విప్లవాన్ని తీసుకురావడానికి చూశాడు- ప్రపంచంచేత పాలను త్రాగడం మానిపించి నీళ్ళను త్రాగిద్దామని చూశాడు.

ఎందుకని అడక్కండి —

అందరితోపాటూ ఆ సామెతకారుడు పరుగెత్తలేక పోయుండొచ్చు—

ఒకవేళ పరుగెత్తి పాలను పట్టుకున్నా వాటిని హరాయించుకునే శక్తి అతడిలో వుండకపోవచ్చు—

ఒక వేళ హరాయించుకొనే శక్తీ, పరుగెత్తగల శక్తీ రెండూకూడా వుండి అతడు పరుగెత్తి పాలను పట్టుకున్నప్పటికీ అవి ప్రమాదవశాత్తూ అతడి చేతిలోంచి జారిపోయి నేలపాలై వుండవచ్చు.

---

యమ్. యస్. మూర్తి

ఆపళాన అతడు నించుని అతి సాహసంగా నీళ్లు త్రాగివుండవచ్చు. గత్యంతరంలేక – ఆ నీళ్లు ఆ పరిస్థితులలో అతడి వొంటికి బాగానే పడివుండవచ్చు.

అందుచేత, విఘ్నేశ్వరుడి బొడ్డులో వ్రేలుదూర్చిన తుంటరి పిల్లకాయలాగ 'నించుని నీళ్లుత్రాగడంమేలు' అని అతడు అనివుండవచ్చు.

మిగతా ప్రపంచం అతడ్ని అనుసరించలేకపోయినా అతడు చెప్పినదానిలో నిజం లేకపోలేదని అనుకుని వుండవచ్చు.

అందువల్లనే ఈ సామెత ఈ రోజు దాకా చిరంజీవిగా వుండిపోయింది.

ఒక చెంపమీద కొడుతూంటే రెండో చెంపనుకూడా కొట్టేవాడి చేతికి అందివ్వమన్నాడు క్రైస్తు. ఇలా చేస్తే వాడు నిర్విణ్ణుడైపోయి, కొట్టడం మానేస్తాడని భావం. దీనిలోని నిజానిజాలను చాలా కాలంనుంచీ ప్రపంచం పరిశోధిస్తూనే వుంది. మిగతా విషయాలలో దీనిఫలితాలు ఎలావుంటాయో నాకు తెలీదుగాని పాల విషయంలో మాత్రం చూస్తే పరుగెత్తి పాలుత్రాగలేనివాడిని, నించుని నీళ్లు కూడా త్రాగనీయదు ప్రపంచం—

దీనిలోనిసత్యం ఈనాడు మనం అన్ని జీవితపంథాలలోనూ చూస్తూనేవున్నాం. మెత్తగా కనిపిస్తే చావకొడతారనే– Live dangerously – ఇతరులకు హడలుపుట్టించేట్టుగా బ్రతకమన్నాడొక రచయిత.

ఈ కొలమానంతో కొలిచిచూస్తే పరుగెత్తి పాలేకాదు, ఇంకా ఏమైనా కూడా త్రాగుతాను అనే ధీమా, సాహసం ప్రతి వ్యక్తిలోనూ వుండాలి; అంతేగాని, 'నేను పరుగెత్తి పాలు త్రాగలేను – నించుని నీళ్ళే త్రాగుతాను' అని గాని ఎవరైనా అన్నట్టయితే 'ఓరి చవట పెయ్యమ్మ! నీకు నీళ్లు త్రాగడానికికూడా తాహత్తు లేదురా' అని కరవ్వొస్తుంది ప్రపంచం.

•

పెద్దపులిమీద స్వారీ చేసేవాడు భూమ్మీద నడవలేనిమాట నిజమే. కాని పెద్దపులిమీదస్వారీచేసేవాడినీ, భూమ్మీద నడిచేవాడినీ ఇద్దర్నీ బాగా నిశితంగా పరీక్షించి చూడండి – భూమ్మీద నడిచేవాడు హడలడిరిపోతూ రోడ్డు ప్రక్కగా జాగ్రత్తగా అడుగులు వేసుకుంటూ వెడ్తూంటే, పెద్దపులి నెక్కినవాడు రంయిమంటూవచ్చి అతడ్ని తొక్కేసిపోతాడు. నించుని నీళ్లు త్రాగుతాననేవాడు కూడా ఇట్టి ప్రమాదానికే గురి అవుతాడు!

---

సి. ఆనందారామం

# భర్తృ రూపయుత శత్రురి

అరుణ దగ్గరనుండి ఉత్తరం వచ్చింది.

"డియర్ కోమలీ!

నా మనసుకి చాలా చిరాకుగా ఉంది. నీ దగ్గిరికి వచ్చేస్తున్నాను. ఎందుకని– ఎప్పుడని– ఎన్నాళ్ళుంటావని అడగకు. ఎందుకో నీకు చెప్పినా అర్థంకాదు. ఎప్పుడొస్తానో నాకే తెలియదు. అక్కడికి వచ్చాక కానీ, ఎన్నాళ్ళుంటానో చెప్పలేను.

నీ.

అరుణ..."

ఉత్తరం చదవటం పూర్తిచెయ్యగానే నాకు మతిపోయినట్లయింది. అరుణ ఇక్కడకు రావటమా? వద్దు! వద్దు!. అదిక్కడకి రావడానికి వీల్లేదని వ్రాసేస్తాను. 'నిన్ను నేను భరించలేను. వడగళ్ళలాంటి దానివి. చల్లగా ఉంటూనే భరింపలేని దెబ్బ తగిలిస్తావు. కాకోదర శిరోరత్నానివి. ధగద్ధగాయమానంగా, కాంతులీనుతూనే ప్రాణాపాయానికి దారితీస్తావు. నీ ఆకర్షణ ప్రమాదకరమైనది. నీ చూపులముందు ఎలాంటి నిషాద్రవ్యమైనా దిగదుడుపే! నీ మాటలలో అయస్కాంత శక్తి ఉంది. నీ శరీరం శిల్పులకు మోడల్. నీ మనసు కాలకూట విషాన్నీ, దివ్యామృతాన్నీ ఒకే క్షణంలో క్రుమ్మరించగల విచిత్రమైన వస్తువు. వద్దు! రావద్దు! అని వ్రాసెయ్యాలనుకున్నాను. కానీ, ఏమీ వ్రాయలేకపోయాను. దాని మాటను కాదనే శక్తి నాకు లేదు. ఒకప్పుడు నేనూ దాని వ్యక్తిత్వపు నీడలో ఆడుకున్నదానినే! దాని ప్రతి మాటకూ పకపకనవ్వుతూ, దాని ప్రతి చేష్టకూ తాళం వేసిన దాన్నే! మా కందరికీ దాని సాంగత్యంలో కాలం క్షణాలమీద గడిచిపోయేది. అది లేకపోతే మా కెవ్వరికీ తోచేదికాదు. మాలో అసలు జీవమే లేనట్లుండేది. ఇప్పటికి రెండేళ్ళక్రితం – అంటే, నాకు పెళ్ళి

కాకముందు ఈ ఉత్తరం వచ్చివుంటే, సంతోషంతో ఉక్కిరిబిక్కిరయేదానిని. అదెప్పు దెప్పుడు వస్తుందా, అని క్షణాలు లెక్కపెట్టే దానిని. కానీ ఇప్పుడు అది వస్తుందనే భావన నా మనసులో మంటలు రేపుతూంది. అసలే ఈయన అగ్ని. దానికి వాయువులాగ ఈ అరుణ తోడైతే, నేనెక్కడ నిలుస్తాను ?

ఆరోజు...నాకు బాగా గుర్తు. ఎంతో భయంభయంగా అతి కష్టంమీద వంచిన తల ఎత్తాను. మెరుస్తూన్న అల్లరి కళ్ళు కనిపించాయి.. నన్ను నేను మరచిపోయాను. నా మైమరపును గమనించిన ఆ పెదవులు చిలిపిగా నవ్వాయి. గుండెలు ఝల్లుమన్నాయి. ఆపాదమస్తకమూ కదలిపోయాను. నా పెదవులు నాకు తెలియకుండానే సిగ్గుగా నవ్వేశాయి. తల వంగిపోయింది. ఆ తరువాత ఏం జరిగిందో నాకే తెలియదు. నా సమస్త చైతన్యాన్నీ, ఆ చిలిపి చిఱునవ్వూ, ఆ అల్లరి కళ్ళూ ఆక్రమించేసుకున్నాయి. కట్నం తీసుకునేవాళ్ళని పెళ్ళి చేసుకోనని పట్టుబట్టిన నేను, ఆయన పక్కా వ్యాపారిలా బేరాలాడినా కూడా ఎలా సహించానో ! సమిష్టి కుటుంబంలో బాధ్యతలు భరించలేననేదాన్ని. అత్తగారూ, మావగారూ, పినమావగారూ, ఇద్ద రాడబిడ్డలూ, ఇద్దరు మఱదులూ ఉన్న కుటుంబంలోకి కోడలిగా అడుగు పెట్టడానికి ఎలా అంగీకరించానో! వీటి కన్నింటికీ సమాధానం ఒక్కటే ! — ఆ చిరునవ్వు —.

మధురమైన సన్నాయి వాయిద్యాల మధ్య, బంగారు కలలు కళ్ళలో నింపుకుని, వల్లమాలిన మమత మనసులో పండించుకుని జీవితంలోకి అడుగు పెట్టాను.

నా కళ్ళలోకి చూస్తున్న ఆ అల్లరి కళ్ళలోని అందాలు నా గుండెల్లో నింపుకున్నాను. నా మనసులో తిరిగి తిరిగి ప్రతిఫలించే ఆ చిరునవ్వులో నా ఊపిరి రంగరించుకున్నాను. చిన్న కనుబొమ కదలికతో చుట్టుప్రక్కల వారిని శాసించే ఆ ధీర వ్యక్తిత్వం ముందు, నా జీవితం సంపూర్ణంగా పఱచి, అహాన్ని పూర్తిగా మఱచిపోయాను.

ఈ అద్భుత స్వర్గం 'నాది' అని అనుకునీ అనుకోకముందే, ఆ స్వర్గంలో ఒక భాగంగా లీనమయి, ఘోరనరకం కూడా అనుభవంలోకి వచ్చేసింది.

ఈ అనుభూతికి నాంది ఉమగారింట్లో డిన్నర్‌పార్టీ లో జరిగింది.

సాధ్యమైనంత శ్రద్ధగా అలంకరించుకుని, ఈయన ప్రక్కన సగర్వంగా కూర్చున్నాను. ఇంతలో ఎక్కడి నుండి వచ్చిందో ఆవిడ — పేరుకూడా తెలియదు — సన్నారికే "హలో" అని పలకరించి, ఈయనతో కబుర్లలోకి దిగిపోయింది. గంటలకుగంటలూ, విసుగు




రాకుండా చమత్కారంగా కబుర్లు చెప్పటంలో ఈయన కీయనేసాటి. నా దురదృష్టవశాన ఆయనకు అటుప్రక్క కుర్చీ ఖాళీగా ఉంది. ఆవిడ అందులో కూర్చుంది. వాళ్ళిద్దరూ నా ఉనికి నే మరచిపోయి, కబుర్లు చెప్పుకుని, నవ్వుకుంటూంటే, నా మనసు బాధతో మెలికలు తిరిగిపోయింది. నా ముందు వడ్డించిన పదార్థాలలో రుచి తెలియలేదు. అసలా పార్టీ కెందుకొచ్చానా అని కుమిలిపోయాను. కళ్ళారా చూడకపోతే, ఇంతవ్యధ ఉండేదికాదేమో? సభ్యత కోసం అతి బలవంతాన నిగ్రహించుకున్న కన్నీరు ఇంటికి రాగానే కట్టలు తెగి ప్రవహించింది.

పాపం, ఏమీ తెలియని అమాయకుడిలాగా "ఇదేమిటీ? ఎందు కేడుస్తున్నావ్?" అని అడిగాడు పైగా. అతి సునాయాసంగా జీవితమంతా నటించెయ్యగలరు!

అవమానంతో, ఈర్ష్యతో, ఏదో ప్రతీకార వాంఛతో మనసు ఉడికిపోయింది.

"ఎందు కేడుస్తున్నానా? ఇంకా బ్రతికున్నందుకు—" కసిగా అన్నాను.

పకపక నవ్వారు.

"అందుకు ఏడ్చి ఏం ప్రయోజనం?"

ఒకప్రక్క నేను కుమ్ములో పెట్టినట్టు కుమిలిపోతుంటే ఈయనకు వెక్కరింత! ఎలా భరించగలను?

"అవును ఏడ్చి ఏంప్రయోజనంలేదు. కొంచెం విష మివ్వండి. మీకూ నాకూ కూడా తెరిపి—"

చటుక్కున నాదగ్గరకు వచ్చి నాపెదవులు గట్టిగా ముద్దు పెట్టుకున్నారు.

ఏదో మంత్రం వేసినట్లు మనసులోని

అంతటి దుర్భరవేదనా, మంచులా కరిగి పోయింది. కోపం నిలుపుకోవాలనే నా ప్రయత్నాన్ని వెక్కిరిస్తూ నా కళ్లు నవ్వేశాయి.

"విషం! ఎలా వుందీ?" అల్లరిగా నవ్వుతూ అన్నారు.

అది విషమా? ప్రణయానికి వ్యాఖ్యానము వినిపించే, యవ్వనానికి సార్థక్యం వివరించే, ఆ మాధుర్యాన్ని దేనితో పోల్చగలను?

"పిచ్చిపిల్లా! ఇంతమాత్రానికే, ఇంత, ఇంత రాద్ధాంతమా? ఏదో ఆవిడ మాటాడిస్తే మాట్లాడాను. ఇందులో ఏంకొంప మునిగిపోయిందీ?" లాలనగా జుట్టు నిమురుతూ అన్నారు.

కొంప మునగడం అంటే ఏమిటీ? ఇంతవరకూ నే ననుభవించిన చిత్రవధ కొంప మునగడంకాదా? ఇంకా ఏమిటి? కానీ, నాకు ఆలోచించే శక్తి లేదు. నాకు తెలుస్తున్నదల్లా నన్ను లాలిస్తున్న ఆయన స్పర్శమాత్రమే! ఆయన మాటలన్నీ నమ్ముతాను.

నమ్మకపోతే ఆయనను ఆరాధించలేను.

ఆరాధించకుండా బ్రతకలేను.

నా కోసం, నా మనశ్శాంతికోసం, నా సంతృప్తికోసం ఆయన ఏం చెప్పినా నమ్ముతాను. అవి నిజాలా, అబద్ధాలా అనే ఆలోచన నా కక్కరలేదు.

"మన ప్రక్కింటి రామనాథం మాత్రం అక్కడ ఎంతమందితో మాట్లాడలేదూ? వాళ్ళ ఆవిడ ఇలాగే ఏడుస్తుందా?"

"ఎంతమాత్రం ఏడవదు. తనకు ఆ కొంచెం సేపయినా ఆయన నుండి విముక్తి లభించిందిగదా అని సంతోషిస్తుంది."

ఆయన ముఖం ప్రక్కకు తిప్పుకొని నవ్వసాగారు.

"అదీగాక, ఆవిడ కేడవాల్సిన పనేముందీ?"

"అదేమిటీ?"

"ఏమిటో నాకు మాత్రం ఏం తెలుసు? ఆయనతో మాట్లాడుతున్నప్పుడు అవతలి ఆడవాళ్ళ కళ్ళు సంతోషంతో వెలగవు. వాళ్ళ కంఠాన్ని ఏదో మార్దవం ఆవేశించదు. తమని తాము మరచి ఎంత సేపైనా అలా నిలచిపోరు. వాళ్ళ కళ్ళలోకి చూస్తూ చిలిపిగా నవ్వగలిగే సాహసం ఆయన కెంతమాత్రం కలగదు. ఇక ఆయన ఎంతమందితో మాట్లాడితేమాత్రం ఆవిడ ఎందు కేడుస్తుందీ?" వింటున్న ఆయన కళ్ళు గర్వంగా మెరిశాయి. ఆ గర్వరేఖల్ని చూసిన నాకు మండింది. అలా మాట్లాడినందుకు నన్ను నేను తిట్టుకున్నాను. 'నా పిచ్చికానీ—, నే చెప్పకపోతే, ఆయనకు తెలియదా?'

నిజమే! రామనాథంగారి భార్యకు నాలా ఏడవాల్సిన అవసరం ఎన్నడూ రాదు. అందుకని ఆవిడ నాకంటె అదృష్ట



వంతురాలా? అల్లాంటి అదృష్టం నాకు కావాలా?

అమ్మబాబోయ్! వద్దు!! ఆ కళ్ళ లోకి చూడకుండా, ఆ కబుర్లు వినకుండా, ఆ చిరునవ్వుకు పరవశించకుండా, ఒక్క రోజుకూడా ఉండలేను. దీని వెనుక ఎంతటి క్షోభ ఉన్నా సరే!

వచ్చేసింది. మెత్తని పిడుగులా, చల్లని సుడిగాలిలా అరుణ. దాని ముఖం చూసిన కొన్నిక్షణాలు తాత్కాలికంగా నా భయాలు, అనుమానాలూ మరిచిపోయి, దానిని ఆప్యాయంగా కౌగలించుకున్నాను. అరుణ వాత్సల్యంగా నా కళ్లలోకి చూస్తూ "నీ స్నేహం చాలా చల్లగా ఉంటుంది కోమలీ! నా మనసులో మంటలు చల్లార్చుకుందామని వచ్చాను," అంది. నా కెలానో అనిపించింది. కొంపదీసి దాని మనసులో మంటలు నా మనసులోకి బదిలీ అవవుకదా!

పగలంతా యధాప్రకారం అది వేళా

కోళాలతో, వెకి్కరింతలతో నవ్వుతూ, త్రుళ్ళుతూ కనిపించింది. 'దీనికి మనసులో మంట లేమిటా?' అనిపించింది. ఈయన వచ్చేవే ళయింది. ఈయనను దీనికి పరిచయం చెయ్యకుండా ఉండగలిగితే బాగుండును. బోడి కల్చర్! చచ్చినట్లు పరిచయం చెయ్యాలి. పోనీ, ఇది సిగ్గుగా తల వంచుకుని లోపలకు పోతుందా? ఒక్కనాటికీ పోదు. ఏం చెయ్యాలి?

ఎంతో ప్రయత్నంమీద అరుణ కంటే, నేనే బాగుంటా నని నన్ను నేను నమ్మించుకోగలను.

అరుణ కొంచెం లావు.

నేను నాజూగ్గా ఉంటాను.

అరుణ చామనఛాయ.

నేను పచ్చని పసిమి.

అరుణ జుట్టు పల్చన.

నా జుట్టు ఒత్తుగా, వంకీలు వంకీలుగా ఉంటుంది.

ఇలా నేనే అధికురాల ననుకోవచ్చు. కాని... నాకు తెలుసు. దానిలో ఏదో ఉంది. దానిముందు నేను నిలవలేను. అందానికి అతీతమైన ఏదో ఆకర్షణ దానిది. ఒకనాడు దానిస్నేహం కోసం పడిగాపులు పడిన నా మనసే దీనికి సాక్ష్యం

సావిట్లోంచి ఘొల్లున నవ్వులు వినిపించాయి.

గబగబ వంటిట్లోంచి ఇవతలకొచ్చాను.

భగవంతుడా! ఎందుకో, ఏమిటో, ఈయనా అరుణా కలిసి పక పక నవ్వు కుంటున్నారు.

నన్ను చూస్తూనే అరుణ నా దగ్గరకు వచ్చి నవ్వుతూ, "ఎంతపని జరిగిందో చూడు! దీక్షగా పుస్తకం చదువుకుంటు న్నాను. లైటు వెయ్యటానికికూడా బద్ధకించి పుస్తకం గుండెలమీద ఉంచుకుని సోఫాలో వెన్కక్కివాలి అలానే కూర్చు న్నాను. అకస్మాత్తుగా వెనక్కి తిరిగి చూద్దునుకదా! – ఈయన!

"అయామ్ వెరీ సారీ! కోమలి అనుకున్నాను. అందుకనే స్వతంత్రంగా తలలో పూవులు పెట్టాను. మరోలా భావించకండి,' అన్నారు.

"అంతవరకూ నాకాయన తలలో పువ్వులు పెట్టినట్లుకూడా తెలియదు. అంత పరధ్యానంలో ఉన్నాను. ఇంద, నీ పువ్వులు నువ్వు తీసేసుకో,'' అంటూ తలలోంచి పువ్వులు తియ్యబోయింది.

నా తల గిఱ్ఱున తిరగసాగింది. ప్రళయం అప్పుడే ప్రారంభమయింది.

"వద్దు వద్దు! నీ తల్లోంచి తియ్యకు. అవి నా కక్కర్లేదు," అంటూనే అక్కడ నిలవలేక లోపలికి వచ్చేశాను. అరుణ కూడా నాతోపాటే లోపలకు వచ్చింది. అరుణను ఆయనకు నేను పరిచయం చెయ్యలేదు.

ఇంక ఆ అవసరంలేదు.




నన్ను నేను నిగ్రహించుకొని అరుణతో మామూలుగా మాట్లాడడానికి చాలా సేపే పట్టింది. అంతవరకూ అరుణ కూడా నన్ను పలకరించలేదు. దాని ఆలోచనలలో అది ఉంది.

అందరం భోజనాలకు కూర్చున్నాం. సాధారణంగా భోజనాలదగ్గిర అదీఇదీ మాట్లాడుకోవడం అలవాటు. నా కేమిటో ఏమీ మాట్లాడా లనిపించలేదు. అరుణను గురించి ఈయనకు చెప్పటం నాకిష్టం లేదు.

"మీ రివాళే వచ్చారనుకుంటాను;" ఈయన సంభాషణ ప్రారంభించారు.

"అవును, ప్రొద్దున్న పదిగంటలకు వచ్చాను."

"ప్రయాణం సుఖంగా జరిగిందా? దగ్గిరే కదూ?"

"దగ్గిరేమిటండీ? ఎక్కడో కాశ్మీర్ నుంచి వస్తేను!"

'కాశ్మీరా! వాట్ ఎ లవ్లీ ప్లేస్ కొండలమీదుగా వాలుగా ఉన్న రోడ్లూ, రెండు ప్రక్కలా వింతవింత చెట్లూ, రకరకాల పువ్వులూ ... నడుస్తూంటే చాలా హాయిగా ఉంటుందండీ!"

"అవును, మంచి కంపెనీ ఉంటే ఇంకా బాగుంటుంది. శీతాకాలం అందరూ చలి అంటారుకానీ, నాకా మంచు కురుస్తున్నప్పుడే ఇంకా బాగుంటుంది."

"అవును, అప్పుడే బాగుంటుంది. సరిగ్గా మంచు కురుస్తున్నప్పుడు చూడాలి– ఆ ప్రకృతి సౌందర్యానికి మెచ్చి దేవతలు పుష్పవర్షం కురిపిస్తున్నారా అన్నట్లుంటుంది. ఆ మంచులో స్కేటింగ్——మహాసరదాగా ఉంటుంది."

ఈయన ఎప్పుడూ కాశ్మీర్ వెళ్ళలేదు. వెళ్ళాలనే ఆలోచనకూడా లేదు ఈ సంభాషణ ఇంక వినే ఓపిక నాకూ లేదు. చటుక్కున నా కంచంలో చెయ్యి

కడి్ సుకుని లేచిపోయాను.

అరుణ గాభరాగా "అదేమిటి? అలా మధ్యలో లేచిపోయావ్?" అంటూ తనూ లేవబోయింది.

ఈయన అతిగంభీరంగా, "దాని కీ మధ్య ఒంట్లో బాగుండటం లేదులెండి. వెళ్ళి విశ్రాంతి తీసుకోనియ్యండి. ఏమీ పలకరించకండి," అన్నారు.

"ఏమైనా విశేషమా?" నవ్వుతూ అడిగింది అరుణ.

"అన్నీ విశేషాలే!" ఆయనా నవ్వారు.

అరుణ కూర్చుండిపోయింది.

ఎంత వినకూడదనుకున్నా నాకు వాళ్ళ నవ్వులు వినిపిస్తూనే వున్నాయి. జరిగినవి పదినిముషాలో, పదిహేను నిముషాలో అయినా, నాకు పదిహేను యుగాలు గడిచినట్లుగా అనిపించింది.

ఇంచుమించు గంట తర్వాత ఈయన పడకగదిల్లోకి వచ్చారు.

"వంట్లో ఎలాఉందీ?" చాలా గాభరాగా అడిగారు.

ఎంత ప్రేమ!

కోపంగా మంచంమీంచి లేవబోయాను.

"వద్దు! వద్దు! లేవకు. వంటిల్లంతా, పాపం, అరుణగారు సర్దేశారు. ఏవేవి ఎక్కడ పెట్టాలో నేను చెప్పాననుకో; నువ్వు విశ్రాంతి తీసుకో. నేను పైన డాబామీద పడుకుంటాను,'' అంటూనే పక్కచుట్ట తీసుకుని పైకి వెళ్ళిపోయారు.

"నాకు వంట్లోబాగుండలేదా? అవును! తల పగిలిపోతూంది, కళ్ళు మండిపోతున్నాయి! మనసు ఆలోచించే శక్తిని కోల్పోంతూంది.

కానీ నాకు కావాల్సిన విశ్రాంతి ఇదా? ఈయన అలా పైకి వెళ్ళిపోతే నాకు స్వస్థత చేకూరుతుందా?

ఎంత ప్రయత్నించినా నాకు నిద్ర రాలేదు. నిద్ర లేమితో కళ్ళు భగ్గున మండుతున్నాయి; కానీ కునుకు పట్టించుకోలేకపోతున్నాను. పన్నెండు కొట్టడం విన్నాను. ఒంటిగంట...

ఉన్నట్లుండి నా మనసు నొక భయంకరమైన అనుమానం ఆవరించుకుంది. గబగబా బయటకు వచ్చి చూశాను. హాల్లో తన బెడ్డింగు పరచుకుని పడుకొనిఉంది అరుణ. బెడ్‌లైట్ వల్చని కాంతిలో నిద్రపోతున్న అరుణ ముఖం పసిపిల్లల ముఖంలా అమాయకంగా కనుపించింది. అనవసరంగా నన్ను నేను క్షోభపెట్టుకుంటున్నానా అనిపించింది.

పైకి వెళ్ళాను. ఈయన ఒళ్ళు తెలియకుండా నిద్రపోతున్నారు. ఏ తిథో తెలియదుకానీ చంద్రుడు సగమే వున్నాడు. వెన్నెల మసకగా ఉంది. ఆ మసక వెలుతురులోకూడా అందంగా కనిపించే ఆ ముఖాన్ని చూస్తూ అలా కూర్చోవాలనిపించింది. నిద్రలోకూడా చెరగని




ఆ క్రాఫింగుని నా చేతులతో చిందర వందర చేసెయ్యా లనిపించింది.

ఆయనకు ఎక్కడ మెలకువ వస్తుందో నని భయపడుతూనే పాదాలదగ్గిర తల పెట్టుకుని పడుకున్నాను. ఆ కాస్తకే ఆయన లేచిపోయారు.

“నిద్రపోలేదా !” ఆశ్చర్యంగా అన్నారు.

తల వంచుకున్నాను—

నవ్వి చేతులు జాపారు. హృదయం మీద వాలిపోయాను. భూత భవిష్యత్తులను మరచి హాయిగా నిద్రపోయాను.

సూర్యుడి కిరణాలు నా కళ్ళని పొడుస్తూంటేకాని మెలకువ రాలేదు. అంత పొద్దుపోయేవరకూ పడుకున్నందుకు సిగ్గుపడుతూ, పనిమనిషన్నా లేపనందుకు ఆశ్చర్యపడుతూ క్రిందకు వచ్చాను. ఈయనా, అరుణా ఏవో కబుర్లు చెప్పుకుంటూ కాఫీలు త్రాగుతున్నారు. ఆ దృశ్యం చూడలేకపోయాను. నన్ను చూడగానే అరుణ లేచి నాదగ్గరకు వచ్చి ఆప్యాయంగా "వంట్లో ఎలా ఉందీ? రాత్రి నలతగా ఉన్నావని లేపలేదు. నేనే కాఫీ చేసి మీ శ్రీవారికి ఇచ్చాను. పాపం నీ చేతి కాఫీలా ఉండదనుకో! అయినా కష్టపడి తాగుతున్నారు—" అంది.

"నో. నో!! కోమలి చేసిన దానికంటేకూడా చాలా బాగుంది;" వెంటనే అన్నారాయన. అలా అనడం సభ్యత. ఈ సభ్యతను నాలుగు ముక్కలుగా చీల్చిపారెయ్యాలనుంది. దొడ్లోకి వచ్చేశాను. ఎదురుగా పనిమనిషి రంగమ్మ కనిపించింది. దానిమీద విరుచుకుపడ్డాను.

"ఏమే. నీ నోరు ఏమైంది? వచ్చిన దానివి నన్ను లేపక్కర్లేదా? రేపొద్దున ఏదైనా పోతే ఎవరి నడగను? నీ పనీ వద్దు - నువ్వూవద్దు; ఇంట్లోంచి పో!" అది బెదిరిపోయింది.

"అంట్లెయ్యడానికి మిమ్మల్ని కేకేశా నమ్మగోరూ! అయ్యగోరు మిమ్మల్ని లేపవద్దని ఆరే ఏసేశారు."

"అరుణమ్మగారు కాదా?" గొంతు తగ్గించి అడిగాను.

"బాబుగా రేస్తావుంటే అప్పు డాయమ్మొచ్చి నే నేస్తానని ఏశారు."

వంటపొయ్యిలో ఇన్ని నీళ్ళు పోసి కళ్ళు మూసుకు పడుకోవాలన్నంత విసుగ్గా ఉంది. మళ్ళా అది ఏ ఉపద్రవానికి దారితీస్తుందోనని నా ఉద్వేగాన్నంతా అణచుకుంటూ ప్రశాంతంగా ఇంటిపనులు మొదలుపెట్టాను. ఆనా డాదివారం. ఈయన ఇంట్లోనే ఉన్నారు. అరుణ నా కూడా తిరుగుతూ వంటింట్లోనేఉంది. ఇది కాస్త నా ప్రాణానికి తెరిపిగా వుంది. కానీ సాయంత్రానికల్లా మళ్ళీ ఉప్పెన వచ్చిపడింది.

"నేను సాధారణంగా తెలుగు సినిమాలు చూడడం పడదు. ఈ ఊళ్ళో దేవదాసు మళ్ళీ వచ్చిందట. నా కది చూడాలని ఉంది. వెళ్దామా?" అంది అరుణ.

ఈయన తెలుగు సినిమాలకు రారు. నాకూ దేవదాసు చూడాలనే ఉంది. "సరే," నన్నాను.

ఇద్దరమూ తయారయి వచ్చేసరికి ఈయన "ఎక్కడకీ?" అన్నారు.

"తెలుగు సినిమాకి," అన్నాను.

"నేనూ వస్తాను. నాకు వేరే పనేం




లేదు," అంటూ లేచారు. ఎన్నిసార్లు నేను బ్రతిమాలుకున్నా 'వెధవ తెలుగు సినిమాలు,' అని తిట్టిన పెద్దమనిషి! నాకు ఒళ్ళు మండిపోయింది.

"ఇంతవరకూ మీరు తయారవలేదు. టైమయిపోయింది. మీకు పెద్ద ఆసక్తి లేదుకదా!" అన్నాను.

"ఎంత! రెండు నిముషాల్లో తయారయి వచ్చేస్తాను," అంటూ లోపలికెళ్ళిపోయారు.

ఆయన ఉత్సాహంగా బైలుదేరుతున్న కొద్దీ ఈ ప్రయాణం ఎలాగయినా ఆపు చెయ్యాలని పట్టుదల హెచ్చింది నాలో. ఈయన తయారయి రాగానే సోఫాలో కూలబడి "నా కళ్ళు తిరుగుతున్నాయి. తలంతా భారంగా ఉంది. నేను రాలేను," అన్నాను.

అరుణ వెలవెలపోతూ మా ఇద్దరి వంకా చూసింది.

"నీకసలు రాత్రినుంచే బాగుండలేదు. విశ్రాంతి తీసుకోమంటే విన్నావా? ఇవాళ్ళంతా శ్రమపడ్డావు. సరే! నువ్వు పడుకో! అరుణగారిని నేను తీసికెళ్తాను;" ఎంతో మామూలుగా అన్నా రాయన.

నాకు మతిపోయినట్లయింది.

"కోమలి రాకుండా నేనెందుకూ? నేనూ ఇంట్లోనే వుంటా,"నంది అరుణ.

"ఇంతా తయారయి చివరకు మానుకోవడం దేనికి? బయలుదేరండి. దానికి కొంచెం సేపట్లో సర్దుకుంటుందిలెండి. ఇవాళ ఆఖరిరోజు కూడా!" తొందర చేశా రాయన.

"వెళ్ళమంటావా?" నన్నడిగింది అరుణ.

భగవంతుడా! ఈ ప్రశ్న అడగవలసింది నన్నా?

ఏం సమాధానం చెప్పను?

"వెళ్ళిరా," కటువుగా అన్నాను. నా స్వరంలో కాఠిన్యం దాని కర్థమవుతుందనుకున్నాను. కాని దాని హృదయ

కాఠిన్యం ముందు నా స్వర కాఠిన్యం ఓడి పోయింది.

"సరే అయితే! నువ్వు మాత్రం అనవసరంగా శ్రమపడక విశ్రాంతి తీసుకో!" అంది వికసించిన ముఖంతో.

వాళ్ళిద్దరూ వెళ్ళిపోయారు. ఎంత మాత్రం వెళ్ళడానికి వీల్లేదని గట్టిగా అరుద్దామనుకున్నాను. నేను కూడా వెళ్ళనందుకు నన్ను నేను తిట్టుకున్నాను.

విశ్రాంతి! విశ్రాంతి!! నాకు శాశ్వతమైన విశ్రాంతి ఎప్పుడో!!!

ఇంట్లో ఎవ్వరూ లేకపోవడంతో కరువు తీరా ఏడ్చేశాను. కొంత గుండె బరువు తగ్గింది. ఇంక అరుణతో ఏదో విధంగా స్పష్టంగా చెప్పెయ్యాలి! 'చిచ్చోడిం గట్టినయట్లు' — అరుణను నేను భరించలేను.

అలా ఎంత సేపుండిపోయానో నాకే తెలియదు. తలుపుతట్టిన చప్పుడుకు వెళ్ళి తలుపు తీశాను. ఈయన లోపలికి వచ్చారు. ఆశ్చర్యంగా "అరుణేదీ?" అన్నాను.

"ఆవిడ అప్పుడే ఎలా వస్తారూ? తెలుగు సినిమా పదింటికి కాని కాదని తెలియదా? ఇప్పుడు ఎనిమిదే అయింది."

"మరి మీరు—!"

"ఆవిడను దేవదాసులో దింపి నేను కొంచెంసేపు స్నేహితుడింట్లో కూర్చుని వచ్చాను. వచ్చేటప్పుడు రిక్షాలో వచ్చేస్తానన్నారు."

ఆయనవంక అలా చూస్తూ నిలబడి పోయాను.

"నీ తలనొప్పి ఇంకా ఎక్కువయి పోయినట్లుందే? కళ్ళుకూడా వాచాయి; ఎర్రబడ్డయ. డాక్టర్‌దగ్గిరకి తీసికెళ్ళనా?"

ఆ కళ్ల అల్లరిగా నవ్వుతున్నాయి. తలవంచేసుకున్నాను. మనసెంతో తేలికయింది.

"నాకు అన్నం పెట్టగలవా? పెట్టుకోనా?"

"అరుణ—?"

"ఇన్ని పనులు స్వతంత్రంగా చేసి నావిడ అన్నం పెట్టుకు తినలేదూ? నిన్ను పడుకోమని మరీమరీ చెప్పారు."

"రండి," అన్నాను.

ఒక్కసారి అద్దంలో నన్ను నేను చూసుకున్నాను. కళ్లు బాగా ఉబ్బి వున్నాయి. జుట్టంతా రేగిపోయింది. కట్టుకున్న చీర బాగా నలిగిపోయింది. త్వరగా బాత్‌రూం కెళ్ళి ముఖం కడుక్కుని, బొట్టు పెట్టుకుని, బట్టలు మార్చుకుని వచ్చాను.

అప్పటికి ఈయనే మా కిద్దరికీ కూడా వడ్డించారు. నేను నొచ్చుకుంటూ "నేను వస్తున్నానుకదా! ఎందుకా తొందర?" అన్నాను.

"ఇంతలో నీ పాతివ్రత్యాని కేమీ భంగం రాలేదు కానీ కూర్చుందూ;" నవ్వుతూ అన్నారు. ఆ నవ్వులో ఎక్కడి మనస్తాపా లక్కడ కొట్టుకుపోయాయి.



సుఖంగా నిద్రపోయాను. ఏదో గడ బిడకు మెలకువ వచ్చింది. ఈయన గొంతూ, అరుణగొంతూ వంటింట్లోంచి వినిపిస్తూంది. గబగబ వంటింట్లోకి వెళ్లాను. అరుణ అన్నం తింటూంది. ఈయన ఎదురుగా కూర్చుని ఏదో మాట్లాడుతున్నారు. నన్ను చూడగానే అరుణ "అరె! మెలకువ వచ్చేసిందే!" అంది.

"ఏం? బాధగా ఉందా?" కటువుగా అన్నాను.

ఈయన అందుకున్నారు.

"బాధకాదూ? నీకు శ్రమ ఇయ్యో కూడదని, నిన్ను లేపకుండా, పెట్టుకుంటూంటే, నువ్వు లేచిపోతే ఎలా ఉంటుందీ?''

లోలోపల పళ్ళు నూరుకున్నాను.

అరుణ నా వేపు విచిత్రంగా చూసి, మౌనంగా భోజనం ముగించింది.

ఆ మరునాడు ఈయన వెళ్ళిపోయిన తరువాత అరుణతో సంభాషణ ప్రారంభించాను.

"నువ్వు ప్రకాశాన్ని పూర్తిగా మర్చిపోయినట్లేనా?

అరుణ ముఖం గంభీరంగా మారిపోయింది.

"ఆ ప్రసక్తి దేనికిప్పుడూ?" విసుగ్గా అంది.

అరుణ ప్రకాశాన్ని ఏనాటికీ మరచిపోలేదనీ, ఆ ప్రస్తావన తెస్తేగాని మనసులోని బెరడుగట్టిన పుండును రేపినదాన్నవుతాననీ నాకు తెలుసు. కానీ—— ఎందుకో దాని మనసు నొప్పించాలనుంది.

"అతడి నంతగా ప్రేమించికూడా, నువ్వెందుకు పెళ్ళిచేసుకోలేదూ? నీకంటే ముందే అతను రేవతిని పెళ్ళిచేసుకుంటా

నని మాట ఇచ్చాడన్న సంగతి తెలిసి కదూ! ఆ కోపంకొద్దీ నువ్వు వోయి కావాలని మూడోపెళ్ళివాడిని చేసుకున్నావు. అతనేమో యీనాటికీ బ్రహ్మచారిగా మిగిలిపోయాడు. చివరకు ఇద్దరికీ ఆవేదనే మిగిలింది. ఇంతటి అనర్థానికీ కారణం నీ అసహనమే కదూ! మనం ప్రేమించేవాళ్ళకోసం ఏమైనా చెయ్యగలం. ఎంతైనా వదలుకోగలం. కానీ వాళ్ళు మరొకళ్ళను ప్రేమించడం మాత్రం సహించలేం. అవునుకదూ!'' నా మాటలకు అరుణ బాధపడుతుందనుకున్నాను.

కానీ పకపక నవ్వసాగింది!!

"ఎందుకు నవ్వుతున్నావ్?" అన్నాను కోపంగా.

"నువ్వు చిన్నపిల్లలు 'అమ్మా — నాన్నా' ఆట ఆడుకోవటం ఎప్పుడైనా చూశావా? నాన్నగా ఉండేపిల్ల, 'బజారు కెడుతున్నాను. తలుపేసుకో,' అంటుంది. అమ్మగా ఉండేపిల్ల 'త్వరగా రండి. వచ్చేటప్పుడు కూరలు తెండి. రేపటికి లేవు,' అంటుంది. ఇద్దరికీ అది ఆటని తెలుసు. అయినా ఇద్దరి కిద్దరూ అత్యంతాసక్తితో, ఎంతో గంభీరంగా ఆమాటలంటారు. ఈ ప్రేమ కూడా మన కందరకీ వచ్చి అబద్ధమని తెలిసే, మన మేమీ విలువ ఇయ్యటం లేదని అర్థమయీ, అత్యంతాసక్తితో మనమంతా ఆడుకునే ఆహ్లాదకరమైన ఆట! అంతే!!"

తెల్లబోయి దాని ముఖంవంక చూడడంకంటే మరి ఏమీ మాట్లాడలేకపోయాను.

ఆరోజే అది ప్రయాణమయింది.

ఎక్కడ ఉండిపోతుందో నని భయపడుతూనే, "ఇంకా రెండురోజు లుండరాదూ?" అనకుండా ఉండలేకపోయాను. కానీ అది నా మాట వినిపించుకోకుండా బయలుదేరింది. "మీ ఆయనకు స్వయంగా చెప్పలేకపోయాను. వెళ్ళానని చెప్పు," అంది.

తీరా అది రైలెక్కే సమయానికి నా కళ్ళలో నీళ్లు తిరిగాయి. అది నవ్వుతూ నా కళ్లు తుడిచింది కాని దాని కళ్ళలోనూ నీళ్లున్నాయి. అన్నీ ఉన్న అభాగ్యురాలు అరుణ! పాపం! అదేదో మనశ్శాంతి కోరి నా దగ్గిరికి వస్తే, నేను దానికి మరింత అశాంతి నిచ్చానేమో? నే నేం చెయ్యగలను?

అరుణ వెళ్ళి వారంరోజు లయింది. ఆ రోజు దాని దగ్గిరనుండి ఉత్తరం వచ్చింది. పనిహడావుడిలో చదవలేక దాన్ని డ్రాయరులో పడేశాను. రాత్రి వంటకూడా పూర్తయింది. ఎనిమిదయినా ఈయ నింకా రాలేదు— బహుశః కామేశ్వరావుగా రింటి కెళ్ళిఉంటారు. వాళ్ళ శైలజ ఈయన్ని త్వరగా రానిస్తుందేమిటీ? ఏంతోచక చికాకుగా ఉన్న నాకు అరుణ ఉత్తరం గుర్తు కొచ్చింది. ఆసక్తితో విప్పాను.

"డియర్, కోమలీ!

నీ ఆప్తమిత్రురాలిగా నీ వ్యక్తిగత విషయాలలో కలగజేసుకునే అధికారం నా కుంది. అందుకనే స్వతంత్రంగా కొన్ని విషయాలు వ్రాస్తున్నాను. నేనున్న నాలుగు రోజులలో నువ్వు పొందే ఆవేదనను అర్థం చేసుకున్నాను. అల్లాంటి అవేదన కలగడం సహజమని నాకూ తెలుసు. కానీ నిన్ను నువ్వలా హింసించుకోవడంలో ఏం ప్రయోజనం లేదు. ఎక్కడ గ్లామరుంటుందో అక్కడ జనం పోగవుతారు. ఇది తప్పదు. తమ భర్త గ్లామరస్‌గా ఉండాలని వాంఛించే స్త్రీలు తరువాత అతని చుట్టూ మూగే జన సమూహాన్నికూడా సహించగలిగి ఉండాలి. చంద్రుడి కాంతిలా, పిల్లతెమ్మెర చల్లదనంలా, అరుణకాంతుల అందాలలా, కొందరు వ్యక్తులను ఒక పరిధిలో బంధించడం అసాధ్యం... సాధారణంగా అలాంటి వాళ్ళల్లోనే సర్వజన సమ్మోహనకరమైన ఏదో అసాధారణాకర్షణ ఉంటుంది. నువ్వు సాధారణమైన వ్యక్తిని చేసుకుని ఉంటే నీ జీవితం అతి మామూలుగా ఉండేది. నీకీ ఆవేదనా ఉండేదికాదు. కానీ – నువ్వు ఏరికోరి ఆ అసాధారణమైన ఆకర్షణనే వరించావు. నిన్ను మైమరపించిన ఆ ఆకర్షణ, అట్లాంటి ప్రభావమే ఇతరులమీదా చూపుతుందని గ్రహించాలి. ఈ కారణంగా నీ మనస్సుని క్షోభపెట్టుకున్నావంటే ఇంకా నీకు విముక్తి ఉండదు. నీ కోసం, నీ సంతోషంకోసం, నీ సౌఖ్యంకోసం చెపుతున్నాను. దీని నొక సామాన్యమైన విషయంగా తోసిపారెయ్యి. ఇది చాలా కష్టమని నాకూ తెలుసు. కాని ఇందుకే నువ్వు ప్రయత్నించక తప్పదు. నీ భావం నా కర్థమయింది. నా కత్యంత ఆత్మీయురాలివి నువ్వు. నీ మనస్సు నొప్పించలేను. అందుకే వెళ్ళిపోయాను; బహుశః మళ్ళీరాను. కానీ అంతతో నీ ఆవేదనతీరుతుందా? మరో రకంగా అది ఎలానూ ఉంటుంది. 'భార్యా రూపవతీ శత్రుః' అన్నారు కానీ 'భర్తా రూపయుతశ్శత్రుః' అనికూడా అనాలేమో అనిపిస్తూంది. కానీ ఇలా మనం ఆరాధించే ఆ రూపాన్నే మనకు శత్రువుగా తయారుచేసుకుంటే ఎలా. అయస్కాంతం ఇనుముని ఆకర్షించడం ఎంత సహజమో, రూపం పరిసర వ్యక్తుల్ని ఆకర్షించడంకూడా అంతే సహజం. అత్యంత సహజమైన యీ విషయాన్ని అతి సామాన్యంగా తీసుకోవాలి. ఇది ఎంత కష్టమయినా నువ్వు సుఖపడాలంటే, దీనిని సాధించక తప్పదు.

నీ
అరుణ.




"వాసుకు సీరియస్‌గా ఉందిట!"

ఉలిక్కిపడింది ప్రతిమాదేవి! చదువుతూన్న పుస్తకం మూసేసి ఈజీచెయిర్‌లోంచి లేస్తూ, "ఏమిటన్నయ్యా నీవనేది?" అంది ఆదుర్దాతో.

"అవును ప్రతిమా! ఇందాక నేను ఆఫీసులో ఉండగానే ఉత్తరం వచ్చింది. ఇదిగో చదువుకో!" అంటూ నీలం రంగు కవరు ప్రతిమాదేవి చేతికిచ్చి వెళ్ళిపోయాడు కృష్ణకాంత్.

ప్రతిమాదేవి ఉత్తరాన్ని ఆద్యంతమూ చదివింది. ఉత్తరంలోని అక్షరాల్ని అస్పష్టం చేశాయి ప్రతిమాదేవి అశ్రుబిందువులు.

వెళ్ళి కిటికీదగ్గిర నించుంది. మనసులో ఏదో అవ్యక్తమైన ఆవేదన; హృదయంలో గూడుకట్టుకున్న విషాదం! — గతం పిలిచినట్టయింది! వెనక్కితిరిగి చూసింది—

* * *

"ఇదిగో ప్రతిమా! ఎవర్ని తీసుకు వచ్చానో తెలుసా?"

"నీవు చెప్పందే ఎలా తెలుస్తుంది అన్నయ్యా." ఎదురుగా అందంగా




టకప్ చేసుకుని నిలబడ్డ యువకుణ్ణి చూస్తూ అంది ప్రతిమాదేవి.

"వీడూ నా మిత్రుడు! ఆశ్చర్య పోతున్నావా యేమిటి! కాలేజీ రోజు లప్పుడులే. అసలుపేరు 'వాసు'; పోతే కలంపేరు 'బాలశ్రీ' – అంటే నీ అభిమాన రచయితన్నమాట. తెలిసిందా? ఇహ చెప్పాల్సిం దేమిటంటే, వీడు ఇక్కడికి ఉద్యోగరీత్యా ట్రాన్స్‌ఫరయి వచ్చాడు. అంతే! వీడిగురించి చెప్పాల్సింది."

తరువాత కృష్ణకాంత వాసువేపు తిరిగి "ఈవిడ మా చెల్లాయ్‌రోయ్; పి.యు.సి. చదువుతోంది. కథలూ, నవలలూ తెగ చదువుతుంది. నీ కథ లంటేకూడా భలే యింటరెస్టులే దానికి," అన్నాడు.

ప్రతిమాదేవి అతివినయంగా నమస్కారం చేసింది.

వాసుకూడా చిరునవ్వుతో ప్రతి నమస్కారం చేశాడు.

"కూర్చోరా, ఇప్పుడే వస్తా – టాయ్‌లెట్ అయి," అంటూ కృష్ణకాంత్ లోపలికి వెళ్ళిపోయాడు.

"కూర్చోండి," అంటూ లోపలికి వెళ్ళి రేడియో ట్యూన్‌చేసి, నాలుగయిదు మేగజైన్‌లు తెచ్చి వాసు బల్లకెదురుగా పెట్టింది ప్రతిమాదేవి, తనూ ఓ ప్రక్క కుర్చీలో కూర్చుంటూ.

"అయితే 'బాలశ్రీ' కలంపేరుతో

కథలు వ్రాసేవారు మీరే నన్నమాట," అంది ప్రతిమాదేవి.

పత్రిక తిరగేస్తున్న వాసు తలెత్తి ప్రతిమాదేవి వదనంలోకి చూస్తూ "అవునండీ!" అన్నాడు.

"చాలా బాగా రాస్తారు. ఈమధ్యే మొన్న ఏదో పత్రికలో మీ కథ చదివాను; బావుంది. కాని అందులో రాధ పాత్రకు అన్యాయం చేశారనిపిస్తూంది నాకు," అంది ప్రతిమాదేవి.

"ఎలా!" అన్నాడు వాసు.

"ఆ కథలో రాధ చిన్నప్పటినుండీ డాక్టర్ కావాలనే అనుకుంటుంది. తను గొప్ప డాక్టరయి తన జీవితాన్ని ప్రజాసేవకు అంకితం చేయాలని తనలో ఆశాలతను నీరుపోసి ఎంతో శ్రద్ధతో పెంచుతూ ఉంటుంది. కాని రాధ తల్లిదండ్రుల భావాలు అందుకు పూర్తిగా భిన్నంగా ఉండి, చివరకువచ్చేసరికి ఆ అమ్మాయి ఎస్సెస్సెల్సీ పూర్తవకముందే పరిస్థితులద్వారా ఆ అమ్మాయి ఆశాలతను మొదటికే కూల్చివేయడంతో నేను చాలా ఫీలయ్యాను," అంది ప్రతిమాదేవి.

"రోజురోజుకూ బ్రతకడమే కష్టమైపోతున్న ఈరోజుల్లో ప్రతి తల్లిదండ్రికీ, ముఖ్యంగా మధ్యతరగతి కుటుంబంలో ఆడపిల్ల ఒక పెద్ద సమస్యగా తయారయింది. ఆ సమస్యను ఎలా పరిష్కరించాలో ఆ అమ్మాయి పుట్టినప్పటినుండీ ఆలోచించడం ప్రారంభిస్తారు. ఆ సమస్య పరిష్కారమయేవరకూ వాళ్ళు నిద్రపోరు. చివరకు విధి అనుకూలించి వారి ప్రయత్నం సఫలీకృతమై ఎలాంటి సమయంలోనయినా ఆ అమ్మాయికి మూడుముళ్ళు పడితే అంతకన్నా ఆనందం మరొకటి ఉండదు వారికి; అమ్మాయికికూడా జీవితలక్ష్యమంటూ ఒకటి ఏర్పరిచామని ఎంతో సంతృప్తిచెందుతారు. 'అది వారి పొరపాటుకాదు, వారి విధ్యుక్తధర్మం. దాన్ని వారు నెరవేర్చారు!" అంటూ ముగించాడు వాసు.

"మీరన్నది నిజమే. కానీ ఆ అమ్మాయికికూడా జీవితంలో కొన్ని ఆశలూ, ఆశయాలూ ఉండటం సహజం! ఆమె ఆశయాల మెట్లమీదుగా పయనించే ఆ జీవితం గమ్యం చేరకమునుపే జారిపడితే ఆమె పరిస్థితి ఎంత భయంకరంగా ఉంటుందో ఆలోచించారా!"

వాసులో బెరుకుతనం పోయి మరింత ఉత్సాహం వచ్చింది. "అందుకే ప్రతి వ్యక్తీ తను ఆశయాల మెట్లు నిర్మించుకునేముందు, వాటిద్వారా తను గమ్యం చేరుకుంటానా లేదా అనేది ఆలోచించడము ఎంతయినా అవసరం. ఆశలు సఫలమయే అవకాశమే లేనపుడు వాటిని పెంచుకోవటం అవివేకం," అన్నాడు.






"ఏమిట్రోయ్ ! అప్పుడే మా చెల్లాయ్ నువ్వూ అంతగా డిస్కస్ చేస్తున్నారే. కొంపదీసి ఏ డిబేటింగ్‌లోనైనా పాల్గొనడము లేదుకదా ఇద్దరూ!" ఈజీ ఛైర్‌లో కూర్చుని బూట్లు తొడుక్కుంటూ అన్నాడు కృష్ణకాంత్.

"అబ్బే, అలాంటిదేమీ లేదురా. మీ చెల్లాయ్, మొన్నేదో పత్రికలో నా కథ చదివిందట. ఆ కథనుగూర్చి తన అభిప్రాయాన్ని తెలుపుకుంటున్నది." అన్నాడు వాసు.

"అలాగా, పద వెడదాం" అంటూ లేచాడు కృష్ణకాంత్.

ఇద్దరూ క్లబ్బుకు వెళ్ళిపోయారు.

"మీ చెల్లాయి భలే విచిత్రమైన మనస్తత్వంగలదే !" దారిలో అన్నాడు వాసు.

"ఎందుకూ ?" అన్నాడు కృష్ణకాంత్.

"లేకపోతే యేమిటోయ్ ! మొదటి రోజునే ఇంతగా చొరవ తీసుకుని మాట్లాడే అమ్మాయిలను ఇంతవరకూ చూడలేదు నేను. ఏవిధమైన సంకోచం లేకుండా నిష్కల్మషంగా మాట్లాడుతూ ఉంటే నేనే ఆశ్చర్యపోయాను మొదట." అన్నాడు వాసు.

"అవునా ! మా ప్రతిమ స్వభావమే అంత ! అది అందరితోనూ అలాగే ఉంటుంది !" అన్నాడు కృష్ణకాంత్

* * *

"ప్రతిమా ! ఓ ప్రతిమా ! ఇలారా!" పిలిచింది అన్నపూర్ణమ్మ.

"ఇదిగో వస్తున్నానమ్మా !" అంటూ ఏదో చదువుకునేదల్లా అన్నపూర్ణమ్మకెదురుగా వచ్చి నించుంది.

"గదిలోకెళ్ళి త్వరగా ముస్తాబుకా మరి! అక్కడ వాళ్ళొచ్చి కూర్చున్నారు!" ఆజ్ఞాపించింది అన్నపూర్ణమ్మ.

"ప్రతిమాదేవి మ్లాన వదనయై గదిలో కెళ్ళింది. అయిదు నిమిషాల్లో అందంగా అలంకరించుకొని వచ్చింది.

అన్నపూర్ణమ్మ ప్రతిమాదేవిని తీసుకువెళ్ళి హాల్లో పెళ్ళిచూపు వారి ముందు కూర్చుండబెట్టింది.

"మీ పేరేమిటి?" అతడు ప్రశ్నించాడు.

"ప్రతిమాదేవి!" తలవంచుకొనే నెమ్మదిగా సమాధాన మిచ్చింది.

"ఏం చదువు తున్నారు?"

"పి. యు. సి.!"

"మీకు పాటలు వచ్చా?"

[illegible] ప్రతిమాదేవి కాస్త సిగ్గు [illegible] "రావు!" ఎంతో బిడియంతో [illegible]. ఆ తరువాత ఇంకా ఏవేవో అడిగారు.

"సరే, మేము వెళ్ళి ఉత్తరం రాస్తాం లెండి!" అంటూ పిల్లవాడి తండ్రి లేచి నిలబడ్డాడు.

"అట్లా!" అన్నారు ప్రకాశరావు గారు.

ప్రతిమాదేవి వేయి దేవుళ్ళకు మొక్కుకుంది – ఎలాగైనా ఆ సంబధం కుదరకుండా ఉండాలని.

అనుకున్నట్టే అయింది. అమ్మాయి మాకు నాచ్చలేదన్న ఉత్తరం చూడగానే, ప్రతిమాదేవి హృదయం ఆనంద శిఖరాలపై మయూరనాట్యమే చేసింది.

*   *   *

"నేను వివాహం చేసికోదలచుకో లేదు!" అంది ప్రతిమాదేవి వాసు ప్రశ్నకు సమాధాన మిస్తూ.

"ఏం, ఎందుకండీ!" అన్నాడు వాసు.

"ఏమో! మీ కథలో లాగే నాకు కూడా చిన్నప్పటినుండీ డాక్టరు కావాలనే ఆశ. అందుకే ఎన్ని సంబంధా లొచ్చినా ప్రతిసారీ వేయి దేవుళ్ళకు మొక్కుకుంటున్నాను – సంబంధాలు కుదరకుండా పోవాలని."

"అలా అయితే మీ ఆశయం నెరవేరే అవకాశం ఉన్నదామరి!" అన్నాడు వాసు.

"చెప్పలేను! మా అమ్మా నాన్నలకు, ముఖ్యంగా మా నాన్నగారికి సాధ్యమయినంత త్వరలో నే నొక యింటిదాన్ని కావాలని ఉంది. కాని నాన్నగారిని ఎంతో ప్రయత్నంమీద సంబంధాలు చూడ్డం ఆపుజేయమని చెప్పాను. నాన్నగారు నవ్వి ఊరుకున్నారు. ఇక పైన ఆ దేముడి దయ!"

"నేనూ, ఒకప్పుడు మీలాగే బాగా చదివి గొప్ప ఇంజనీరు అయి, దేశానికి కొంతవరకయినా ఉపయోగపడా లని

అనుకున్నాను. కాని నే నొక ఇంజనీరు అయ్యే అవకాశం నాకు లేదని తెలిసిన రోజునే నా ఆశలను అధికం చేసుకోడం మానుకున్నాను. అందు గురించి మీరు కూడా అట్టే ఆశలు పెంచుకోకుండా, హాయిగా వివాహం చేసుకుని జీవితాన్ని మూడు పూవులు, ఆరు కాయలుగా చేసుకొండి! ఇదే నా సలహా!' అని ముగించాడు వాసు.

"వివాహం చేసుకోడం అంటే స్త్రీ తన స్వేఛ్ఛా, స్వాతంత్ర్యాలను కోల్పోయి, పురుషుడికి బందీ అయి, పిల్లలు కనే యంత్రంగా తయారవడం అన్నమాట: అదేం నాకు నచ్చదు. నా జీవితానికి స్వేచ్ఛ కావాలి! నేను పంజరంలో బంధింపబడ్డ పక్షిలా అవకూడదు. ఇదే నేను జీవితంలో ఆశించింది," అంది ప్రతిమా దేవి.

"మనుష్యుల ఆశయాలూ, లక్ష్యాలూ, ఎప్పుడూ ఒకే రీతిగా ఉండవు. కాలంతో బాటు వాటిలో కూడా పరివర్తన రావచ్చు. ఇది మీకు పూర్తిగా అన్వయిస్తుందని నా అభిప్రాయం," అన్నాడు వాసు.

"అలా గనక జరిగితే అందుకు నేను బాధ్యురాల్ని కానేమో!" అంది, ప్రతిమా దేవి.

అంతలోనే కృష్ణకాంత్ లోపలినుంచి టకప్అయి వచ్చాడు.

ఇద్దరూ కలిసి వెళ్ళిపోయారు.

"మా చెల్లాయి ఏమంటుందిరా?" అన్నాడు కృష్ణకాంత్ గార్డెనులో ఒక మూల పచ్చని గడ్డిమీద కూర్చుంటూ.

"మీ చెల్లాయివి ఉన్నత భావాలు! ఆదర్శమైన ఆలోచనలు! తనూ ఒక డాక్టర్ అయి, తన జీవితాన్ని ప్రజా సేవకు అంకితం చేయాలని ఆమె ఆశయం. కాని అది నెరవేరుతుందనే నమ్మకం మాత్రం నాకు కల్గడం లేదు," అన్నాడు వాసు.

"అవున్రా! దానికి చిన్నప్పటినుండి అదే అభిలాష. ఇంట్లో మా అమ్మ కెప్పుడేనా జబ్బు చేసి, డాక్టరు గురించి వెళ్ళవలసివస్తే, అప్పుడు మా ప్రతిమ 'అమ్మా! నేనుకూడా బాగా చదువుకొని గొప్ప డాక్టరయినప్పుడు ఇలా మరో డాక్టర్లపైన ఆధారపడవలసిన అవసరం ఉండదులే!' అనేది. కాని మా నాన్నగారికి మాత్రం దాన్ని ఎంత త్వరగా ఒక యింటిదాన్ని చేస్తే అంత బాగుంటుందని ఉంది. అది నాతో ఎప్పుడూ అంటూ వుంటుంది. 'అన్నయ్యా! నన్ను డాక్టర్ చదివించవా?' అని. అది అలా దీనంగా అడిగినప్పుడు నా మనసు ఎంతగా కలత చెందుతుందో చెప్పలేను వాసూ! నాన్నగారు ముందే ముక్కోపి! యింట్లో తన మాట తప్పితే మరొకరి మాట సాగకూడదనే తత్వం ఆయనది. నువ్వే చెప్పరా! ఇలాంటి పరిస్థితుల్లో

నేను మాత్రం ఏం చేయగలను?" అన్నాడు కృష్ణకాంత్.

"పోనీలేరా! దైవనిర్ణయం ఎలా వుంటే అలా జరుగుతుంది. అందు గురించి మనం అనవసరంగా బాధపడ్డం బావుండదు!" అనునయిస్తూ అన్నాడు వాసు.

"నేనూ అలానే భావించి ఊరు కున్నాను!" అన్నాడు కృష్ణకాంత్.

కొన్నిరోజులు యాంత్రికంగా గడిచి పోయాయి. వాసు, ప్రతిమకు మరింత సన్నిహితు డయ్యాడు. ప్రతిమ కూడా వాసుతో మనసువిప్పి మాట్లాడేది. వారిద్దరిమధ్యా అనుకోకుండా అల్లుకు పోయిన అనురాగలతను విడదీయడం వారికి అసాధ్యమైపోయింది. ఇద్దరూ కలుసుకోనీ, మాట్లాడుకోనీ రోజంటూ లేకపోయింది. 'ఇదేమిటి! తన హృద యము వాసు గురించి ఇంతగా పరిత పించిపోతున్నది!' ఒక్కరోజు వాసు కనబడకపోయేసరికి అనుకునేది ప్రతిమా దేవి. వాసుకూడా ప్రతిమ విషయంలో అలానే భావించేవాడు. ప్రతిరోజూ ప్రతిమతో గంటసేపు గడపడం అతని దైనందిన కార్యక్రమాల్లో ఒకటై పోయింది. తన సాంగత్యంవల్ల ప్రతిమలో చాలావరకు పరివర్తన కలిగిం దని గ్రహించగలిగాడు వాసు.

ఒకరోజు వాసు వచ్చేటప్పటికి కృష్ణ కాంత్ యింట్లో లేడు. ప్రతిమ, "రా, వాసూ! కూర్చో!" అంటూ సాదరంగా ఆహ్వానించి కుర్చీవేసింది.

"ప్రతిమా! ఎన్నాళ్ళనుండో ని న్నొక విషయం అడగాలని అనుకుం టున్నాను, అడగనా?" అన్నాడు వాసు.

"ఒక్కటికాదు, ఎన్నయినా అడుగు! నా సమక్షంలో సంకోచం దేనికి?" అంది ప్రతిమాదేవి.

"నిన్ను ప్రేమించాను! వివాహం చేసుకో దలచుకున్నాను!" ఒక్కసారి అనేశాడు వాసు.

అదిరిపోయింది ప్రతిమాదేవి. క్షణ కాలం ప్రతిమే అయిపోయింది. "వాసూ! నాకు జీవితంలో వివాహం చేసుకోవా లని లేదు! నీలో ఆశలు రేకెత్తించడానికి దోహదం యిస్తే అందుకు నన్ను క్షమించు. దయచేసి నువ్వు నన్ను మరచిపో! అదే నీ అభివృద్ధికీ, ఆత్మ శాంతికీ తోడ్పడుతుంది." అనేసి ఇక అక్కడ నిలబడలేక వెంటనే తన గది లోకి వెళ్ళి మంచంపైన వాలిపోయింది– తను వాసు కిచ్చిన సమాధానానికి కుమిలి పోతూ. అంతే ఆ తరువాత వాసు కని పించలేదు ప్రతిమకు.

దేన్నీ లక్ష్యంచేయని కాలం వేగంగా ముందుకు పరుగెడుతూనే ఉంది.

చివరకు ప్రతిమ గమ్యాన్ని చేరుకో లేకపోయింది. తన లక్ష్యాన్ని సాధించ లేకపోయింది. పరిస్థితులకు బానిసయి

పోయి ఒక ఏడ్వోకేటుతో వివాహం జరిగిపోడం, ఆరునెలలు తిరగకముందే ఆ అడ్వోకేటు హఠాత్తుగా గుండె ఆగి మరణించడం, ప్రతిమాదేవి జీవితంలో ఒక తుఫానులా జరిగిపోయింది.

*　　　*　　　*

వెనుకనుండి అడుగుల సవ్వడి విన పడగానే ప్రతిమాదేవి గతంలోంచి తేరు కొని, "అన్నయ్యా!" అంటూ ఒక్క పరుగున వెళ్ళి కృష్ణకాంత్ వక్షస్థలంపై వాలి వెక్కి వెక్కి ఏడ్వసాగింది.

"నీ బాధ నాకు తెలుసమ్మా! జీవితంలో నీ వొక తప్పు చేశావు. ఆనాడు అది నీకు తప్పుగా తోచలేదు. అదొక లక్ష్యంగా భావించావు. కాని అదే వాసు జీవితాన్ని తల్లక్రిందులు చేస్తుందని మాత్రం ఆలోచించలేకపోయావు! ఆ రోజు నువ్వు వాసూను వివాహమాడి ఉంటే, ఈరోజు వాడికీ విషమపరిస్థితి ఎర్పడేదికాదు. ఇప్పుడు సమయం మించి పోయింది!" అన్నాడు కృష్ణకాంత్.

"లే దన్నయ్యా! సమయం మించిపో లేదు. నన్ను ఒక్కసారి వాసు దగ్గరికి తీసుకువెళ్ళు దయచేసి." అంది ప్రతిమా దేవి పమిటతో కళ్ళు నద్దుకుంటూ.

"అలాగే తీసుకువెడతాను పదమ్మా!"

మంచంపైన స్మారకం లేకుండా పడి ఉన్నాడు వాసు.

చూస్తూనే వణికిపోయింది ప్రతిమా దేవి. ఎంతో కాలంగా అజ్ఞాతంగా అణచి పెట్టుకున్న ప్రేమ ఒక్కసారి ఉవ్వెత్తున లేచి పైకి వచ్చింది. ఆ క్షణంలో పరిసర ప్రాంతమంతా అదృశ్యంగా గోచరించింది. ఒక వాసు తప్ప మరేమీ కని పించడంలే దామెకు. "వాసూ!" ఒక్క సారి వ్యధాభరిత కంఠంతో పిలిచింది.



"... ... ... ..."

"వాసూ! వాసూ!" పిచ్చిగా ఏడుస్తూ అంది.

"వాసు కాస్త కదిలాడు. భారంగా కళ్ళు విప్పాడు. కాని ఎదురుగా మంగళ చిహ్నమైన కుంకుమలేని నుదుటికేసీ, అంచులులేని తెల్లని వస్త్రాలలో ఉన్న ప్రతిమ రూపంకేసీ అట్టేసేపు చూడలేక పోయాడు. క్షణకాలం మూగబాధనే అనుభవించాడు. ఎండిపోయి, గడ్డం పెరిగిన అతని చెక్కిళ్ళ మీదుగా కన్నీళ్ళు కారసాగాయి.

"వాసూ! ఇటు చూడు. నీ ప్రతిమను! సర్వం త్యజించి నీ వద్దకు వచ్చాను. నన్ను ఇలా నీకు సమర్పించుకోనీ వాసూ!" అంది ప్రతిమ ఆవేదన్తో.

"అదృష్టవంతుణ్ణి ప్రతిమా! కాని చాలా ఆలస్యంచేశావు. ఈ ఆఖరిక్షణాల్లో నిన్నొకమారు చూసే భాగ్యం నాకు కలిగించమని భగవంతుడిని ప్రార్థించాను. నా మొరాలకించి, నిన్ను ప్రత్యక్షం చేశాడు. అంతేచాలు. నేను తృప్తిగా చనిపోతున్నా!" అంటూ భారంగా నిట్టూర్చాడు. ఆ నిట్టూర్పుతోనే అతని జీవన జ్యోతి ఆరిపోయింది.

"వాసూ! ఇది నాకు శిక్షా?" పెద్దగా అరుస్తూ వాసు మృతదేహంపై కుప్పగా కూలిపోయింది ప్రతిమాదేవి

ఆమె చివరి ఆశ కూడా ప్రకృతిలో కలిసి మాయమైపోయింది। ★



# వసంతరాజీయము

"వసంత ! ఏమిటో వాసనొస్తోంది – కూర మాడుతున్నట్లుంది, చూడు చూడు." స్నానంచేసి బాత్‌రూమ్‌లో నుంచి బయటికి వస్తూ అన్నాడు రాజు.

తల యెత్తకుండా వ్రాసుకుపోతోంది వసంత.

"వసంతా, నిన్నేనోయ్. వంటింట్లోకి వెళ్ళిచూడు;" మాడువాసన తారస్థాయి నందుకోగా వుండబట్టలేక మళ్ళీ హెచ్చరించాడు రాజు.

తలయెత్తి భర్తవంకోసారి చూసి "రథ పూర్తిగావస్తోంది. కాస్త మీ రెళ్ళి ఆ కూర దింపేద్దురూ," అనేసి మళ్ళీ వ్రాసుకోవటంలో మునిగిపోయింది వసంత.

రాజుకు ఏమనాలో తోచలేదు. గప్ చిప్‌గా వెళ్ళి స్టౌ మీంచి కూరగిన్నె దింపేశాడు, ఏదో సామెత గుర్తు తెచ్చుకుంటూ.

ఆఫీసు టైమవుతోంది. కానీ వసంత అన్నంపెట్టే ప్రయత్నమేమీ చేసేట్లు లేదు. "కాస్త రెస్టు తీసుకుంటూండు వసంతా – మధ్య మధ్య లో," అంటూ వసంత ముందునుంచి వంటింటి గడప దాకా రెండుమూడుసార్లు పచార్లు చేసి వచ్చాడు రాజు. అమ్మాయి ఈ మాట వినిపించుకున్న లక్షణం గానీ అతని అవస్థను గమనించినట్లుగా గానీ కనిపించటంలేదు.

ఇక ఉపేక్ష చేస్తే లాభం లేదనుకుని "వసంతాదేవీ, ఈపూట కీ దీనుడికి భోజనప్రాప్తి లేదా?" అన్నాడు భార్య ఎదురుగా కుర్చీలో కూర్చుంటూ. ఏకళ నుందోగాని తొందరగానే పలికింది దేవి: "ఆఫీసు వేళయినట్లుందిగదూ? కొంచెం మీరే పెట్టుకుని తినేద్దురూ. ఇదిగో ఇది ఫెయిర్ చేస్తున్నాను," అన్నది వ్రాత ఆపకుండానే.

నిర్ఘాంతపోయాడు రాజు.

'ఏమండీ, అన్నం తిందురుగాని రండీ. ఆఫీసుకి టైమయిపోతోంది,' అంటూ రోజూ బ్రతిమలాడే వసంతేనా ఇట్లా మాట్లాడేది? తనను బుజ్జగించి కొసరికొసరి తినిపించే వసంతేనా ఈ అమ్మాయి? ఔరా కాలమహిమ. ఐనా ఒకర్నని ఏం లాభం. స్వయంకృతం – కిక్కురు మనలేదు పాపం రాజు. బరువుగా అడుగు లేసుకుంటూ వెళుతున్న భర్తవంక చూసి దీర్ఘంగా నిట్టూర్చింది వసంత. బాధతో ఆమెహృదయం గిలగిల కొట్టుకుంది. అసలేం జరిగిందంటే...

* * *

వసంత బియ్యే చదువుతూ మానేసింది– మెత్తని హృదయం, మధురమైన రూపం ఇచ్చాడు దేవుడు. రాజు బీకాం ప్యాసై ఏదో ప్రైవేట్ కంపెనీలో

ఓగేటి ఇందిరాదేవి

ఉద్యోగం చేస్తున్నాడు. ఉంగరాల జుత్తు వాడు! వూరించే కన్నులవాడు!

వసంతా రాజులది అన్యోన్యమైన దాంపత్యం_కానీ అట్లా వుంటే ఈ కథ వ్రాయాల్సిన అవసరమే లేకపోను_ ఎప్పట్నుంచో రాజు కో కోరికుంది_ తన భార్య రచయిత్రి కావాలని. పెళ్ళి చూపులప్పుడు వసంతను అడగనే అడిగాడు: "మీకు కథలు వ్రాయటమంటే ఇష్టమా?'' అని. అసలే సిగ్గుపడుతున్న వసంత తల ఊపేసింది. 'ఫర్వాలేదు' అనుకున్నాడు రాజు.

పెళ్ళైపోయింది. నవ దంపతులు కొత్తకాపరం పెట్టారు. అప్పట్నించీ వసంతని కథలు వ్రాయమని వత్తిడి చేయటం ప్రారంభించాడు రాజు. "నేనా? కథలు వ్రాయటమా?" అని ఆశ్చర్యపోయింది వసంత మొదట్లో_ "నువ్వే వసంతా! ప్రయత్నిస్తే వ్రాయలేకపోవు. లిటరేచర్ బియ్యే చదువుతూ మానేశావు _నువ్వే వ్రాయలేకపోతే ఎట్లా?



నువ్వు వ్రాయగలవు నాకు తెలుసు-" అంటూ రోజు కో ప్రోత్సాహపూర్వక మైన ఉపన్యాసం ఇచ్చేవాడు రాజు.

భర్తను ఆ ఉద్దేశంనుంచి మార్చాలని శాయశక్తులా పాటుపడింది వసంత- నిద్రమంచం మీదినించే "వసంతా! ఇవ్వాళ తప్పకుండా కథ..." అంటూ మొదలెట్టేవాడు రాజు.

వసంత హడావిడిగా వచ్చేసి "ఏమండోయ్! ఆ మధ్య నేను గులాబీ మొక్క నాటాను గుర్తుందీ? ఇవ్వాళ అది ఇంచక్కటి పువ్వు పూసింది. చూపిస్తాను రండి," అంటూ లాక్కెళ్ళేది. ఇంకేముంది! రాజు కథ మాట మర్చిపోయి గులాబీ పువ్వుకూ ప్రాణేశ్వరి (అంటే వసంత) చెక్కిళ్ళకూ గల సామ్యం గురించి ఉపన్యసించేవాడు కాస్సేపు.

ముసిముసినవ్వులు నవ్వుతూ కాఫీ అందించేది వసంత. భోజనం చేస్తూ, "వసంతా! మరేఁ కథ..." అంటూండగానే వినిపించుకోకుండా, ఇంకొంచెం కూర వెయ్యనా? ఈ కూర మీ కిష్టమని ఎంతో బాగా చేశాను. బావుందా? మరైతే అంత కూరేనా ఎవిఁటమ్మా వేయించుకుంటారూ? ఇంకొంచెం వేస్తాను." అంటూ మొదలెడుతుంది వసంత. ఇక రాజుకు కథమాట గుర్తుంటుందీ? అమ్మాయి పమిటచెంగు సందుకునే వ్యాపకం తప్ప మరేదీ తట్టదు అతగాడికి అప్పుడు.

"ఛా! ఏమిటదీ? పసిపిల్లల్లాగా. మీ కింత అల్లరి తగదసలు," అంటూ అందంగా కోప్పడేది వసంత.

"ఎబ్బెబ్బె! నా దేం తప్పు లేదు. నీ కొంగుదే తప్పంతా. విసురుగ్గా వచ్చి నా చేతిలో యిరుక్కుంది. నువ్వేమో నిర్దోషినైన నామీద దోషారోపణ చేస్తున్నావు." అంటూ ఊఁ ఇదై పోయేవాడు రాజు.

సాయంత్రం పువ్వులూ, స్వీట్సూ తీసుకుని హుషారుగా యింటి కొచ్చేవాడు రాజు.

అందంగా తయారై వేయికళ్ళతో ఎదురు చూస్తూండేది వసంత. భర్తకు ఎదురువెళ్ళి చిరునవ్వులు కానుక లిస్తూ, "ఏమండీ! ఇవ్వాళ మీకోసం ఏంచేశానో చెప్పుకోండీ?" అంటూ అతనీ బూట్లు విప్పేది - "నేను నీకోసం ఏం తెచ్చానో చెప్పుకో మరి చూద్దాం." అంటూ వూరించేవాడు రాజు - తెచ్చిన పువ్వుల మాల తలలో అలంకరిస్తూ, "వసంతా! వసూ! డియర్! నువ్వు మంచిదానివిట. అపరంజి బొమ్మవిట; కథ వ్రాస్తావుట," అనేవాడు లాలనగా రాజు. "అదా సంగతి: ఇవ్వన్నీ కథ వ్రాయించుకోవటానికి దోహదక్రియలాండీ? నా మీద నిజంగానే అపేక్ష వుండి పట్టుకొచ్చారేమో నమకున్నాను," అని ముద్దుగా మూతి ముడుచుకుండేది వసంత.




అమ్మాయి అందానికి కరిగి కరిగి నీరైపోయేవాడు రాజశేఖర్. అంటే రాజు – అతని ఠీవిని చూసో ఏమోగాని అందరూ అతన్ని 'రాజు' అనే పిలుస్తారు.

"ఎంత మాటన్నావ్! ఏదీ ఒక్క కోరిక కోరుకో! తక్షణం దాన్ని తీర్చేసి నా ఆపేక్షనీ, నా పత్నీభక్తిని నిరూపించుకుంటాను." అని ఓ గంభీరమైన పోజు పెట్టేసేవాడు రాజు.

"మరైతే సినిమాకి వెళదామండీ!" గోముగా అడిగేది వసంత. కాస్సేపటి కల్లా వాళ్ళు చిలకా గోరింకలకే వంకలు పెట్టేటంత అందంగా, అనురాగంగా, వాత్సల్యంగా చెట్టాపట్టా లేసుకుని పక్కింటి, ఎదురింటి పడతుల కళ్ళు అసూయతో కుంచించుకుపోతుండగా సినిమా కెళ్ళిపోయేవాళ్ళు. మర్నాడు పార్కుకి, ఆ మార్నాడు పిక్నిక్‌కి ఆ మర్నాడు ఫ్రెండింటికి ఇట్లా తిప్పేది వసంత రాజును.

ఇట్లా బుజ్జిపాపాయిని మరిపించినట్లు తన రాజునుకూడా ఒక్క ఆరు నెలలు మరిపించింది వసంత. తన చాకచక్యమూ, తన అమోఘమైన ప్రేమా, ఇట్లా వేస్టయిపోవడం ఆ అమ్మాయి కేం నచ్చలేదు. రాజేమో కథలు వ్రాయమనే పోరు మానలేదు. ఒక రోజు తెగేసి చెప్పా డతడు: "నువ్వు కథ వ్రాస్తేనే సాయంత్రం నీ తల్లో పువ్వులు పెడతాను. లేకపోతే నువ్వే పెట్టుకోవలసి వుంటుంది." అని. "కథ వ్రాయకపోతే నీ చేత్తో కాచిన కాఫీ నే త్రాగ,"నన్నాడు. ఆనక విసురుగ్గా ఆఫీసు కెళ్ళిపోయాడు.

ఈ దెబ్బతో పూర్తిగా బెంబేలుపడి పోయింది వసంత. మరీ ఇంత పెద్ద శిక్ష ! ఎంత ఇదైతేమాత్రం ! ఆయన మటుకు ఎంత కోపం రాకపోతే ఇట్లా అంటారు. నేను కథలు వ్రాయాలని ఎంతగా ఉబలాట పడ్డారో పాపం. భారతనారీ ధర్మం ప్రకారం ఆయన కోరిక తీర్చటానికి అశక్తురాలైపోయాను నేను. భగవంతుడా ! నాకు కథలు వ్రాయటమైనా వచ్చేట్లు చెయ్యి. లేదా ఆయన కీ కథల పిచ్చైనా వదిలించు — వేంకటేశ్వరస్వామీ ! రేపు శనివారం రెండు కొబ్బరికాయలు కొడతాను. నా కాపరం పాడుచెయ్యకు," అని తెగ బాధపడిపోతూ వేడుకుంది వసంత.

ఇంతలో "వసంతా ! ఏం చేస్తున్నావ్ ? మీ శ్రీవారు ఆఫీసుకు వెంచేసినారా ?'' అంటూ ఉత్సాహంగా లోపలికి ప్రవేశించిన జానకి విస్తుపోయి నుంచుంది రెండు క్షణాలపాటు. అందుకు కారణం ఒకటి కాదు చాలా ఉన్నై. వసంత చెక్కిట చెయ్యీ, కంట నీరూ, ఎదురుగుండా కాయితాలూ కలమూ కారణాలు. జానకీ వసంత ప్రాణ స్నేహితురాలు, హైస్కూలు టీచరు.

జానకిని చూడగానే వసంత దుఃఖం కట్టలు తెంచుకుని ప్రవహించింది.

"అయ్యయ్యో ఏమైంది వసూ ! మీరాజుగారు చాలా చాలా మంచివారుగదా ! నీ సుఖం చూసి అసూయపడిపోయి ఏ దేవతలో గంధర్వులో శాపం పెట్టెయ్యలేదుగదా !" ఆపేక్షతో ఓదారుస్తూ అడిగింది జానకి.

సిగ్గుపడుతూనే జరిగిన సంగతి చెప్పింది వసంత. "ఓశ్ ! ఇంతేనా ! వసూ. నువ్వు నాటకాల్లో వేశావుగదూ," అంటూ ఉత్సాహంగా అడిగింది జానకి.

కథలు వ్రాయనిడాకీ, నాటకాల్లోవేషం వేయడానికీ ఏం సంబంధమో అస్సలు అర్థం కాలేదు వసంతకి. అయినా జానకి అనవసరంగా అడగదులే అనుకుంది. "ఔను బెస్ట్ యాక్టర్‌గా కాలేజీలో రెండుసార్లు ప్రైజు లొచ్చెనే, గుర్తులేదూ ?" కళ్ళు తుడుచుకుంటూ అన్నది వసంత.

"మరింకేం నేను చెప్పినట్లు చెయ్యి." అంటూ ఆ విధానమంతా బోధించింది జానకి.

"అమ్మయ్యో ! నే నట్లా చెయ్యలేను జానకీ ! పాపం ఆయన..." భయంగా — జాలిగా అన్నది వసంత.

"పాపం ఆయన...ఏం-ఏమైపోతాడమ్మా నీ ప్రాణేశ్వరుడు ఈ రెండ్రోజుల్లో ? నువ్వింత మంచిదానివి గనకే ఆ రాజుగారి ఆటలు సాగుతున్నై,'' అంటూ ఘాటుగా కోప్పడింది జానకి.

"మరి కథ ఏదని అడిగితే," అనుమానంగా చూసింది వసంత.

"కథా ! నువ్విట్లా చేశావంటే ఓ నాల్గురోజులు — కథమాట పైత్తడిక మీ ఆయన. ఈ లోపల 'అదుగో, ఇదుగో'

అని తప్పించుకోలేవూ - పెద్ద వసంతా విధేయుడికి అర్ధాంగివై యుండి?" వేళాకోళంగా అడిగింది జానకి.

"నువ్వేం వెక్కిరించక్కర్లేదు. నువ్వే చూద్దువుగానిగా," అని సవాల్ చేసింది వసంత.

"నీ సామర్థ్యం గూర్చి ఇక నాకేం అనుమానం లేదు. ఇంత మంచి సలహా చెప్పినందుకు నా కో కోరిక తీర్చాలే వసూ నువ్వు," అన్నది జానకి వసంత శరీరస్థితిని గమనిస్తూ, సన్నగా నవ్వుతూ.

పాపం వసంత అమాయకురాలు. "అంతకంటేనా-ఆయన కీ కథల పిచ్చి వదలాలే గాని - నీ కోరిక తీర్చలే నను కున్నావా? నీ పథకం గనక వక్రించిందో నీకు మొట్టికాయే ప్రెజెంటేషను," అంటూ కిలకిల నవ్వింది.

"ఏం లేదూ-నాకు నీ వియ్యపురాల్ని



కావాలని వుంది," అన్నది జానకి. ఎందు కనో గాని వసంత ఆగకుండా సిగ్గు పడి పోయింది. కాస్సేపు కబుర్లు చెప్పి ఇంటి కెళ్ళిపోయింది వసంత వియ్యపురాలు జానకి.

*   *   *

రాత్రి ఎనిమిది గంటలకు ఇంటికి వచ్చాడు రాజు. వాసును చూడకుండా ఇన్ని గంటలు గడపడమంటే అతనికి చాలా బాధగానే ఉంది. కాని తప్పదు మరి. "పాపం – ఎంత ఇదై పోతోందో వసు నా కోసం?" అనుకుంటూ ఇంటి కొచ్చేసరికి వసంత అపరశారదాదేవి లాగా కనిపించింది – చుట్టూ తెల్లకాయి తాలూ, పక్కన రెండు పెన్నులూ, అల్లంతదూరాన కాఫీ వుంచుకున్న ఫ్లాస్కూ; అప్పు డప్పుడూ ఆనుకోవ టానికి వీలుగా ఒక దిండూ–నుదుట అల సటను సూచిస్తూ చిరుచెమటలు–వగైరా వగైరా సరంజామాను చూసి ఎంత ఆశ్చర్యపోవాలో అంత ఆశ్చర్య పోయాడు. కథ వ్రాస్తోంది వసంత – నిజంగా కథే వ్రాస్తోంది. లేని పక్షాన పెన్ను ముట్టుకోవడమంటేనే అదో రకం చికాకు గదా ఆ అమ్మాయికి. 'కలా? నిజమా?' అని, కళ్లు నులుముకుని చూసి మరీ ఆశ్చర్యపోయాడు రాజు. "వసూ! వసంతా!" అన్నాడు దగ్గిరికి వెళ్ళి. అతని గొంతులో అనురాగమన్న మాట జీవం పోసుకుని నర్తించింది.

ఆ పిలవబడిన అమ్మాయి పలకలేదు సరిగదా తొణకలేదు బెణకలేదు – కదల నేనా కదలలేదు. ఆమె కలం గబగబా నడిచిపోతున్నది. రాజు అనురాగానికి ఈ ఆరునెలల్లోనూ ఇంత దెబ్బ ఎప్పుడూ తగల్లేదు. కొంచెం సేపటికి తెప్పరిల్లు కొని "నా మీద కోప మొచ్చినట్లుందే దేవిగారికి. అయినా కోపంగా వున్నప్పుడే నువ్వెక్కువ బాగున్నావ్ వసూ! కథేనా వ్రాస్తున్నావు? నాకు తెలుసు. నువ్వు బుద్ధిమంతురాలివని – ఇదుగో చూడు ఈ పూలమాలంతా నీకే." అంటూ ఆమె జడను సమీపించాడు. ఉలికిపడి గభాల్న జడ ముందరికేసుకుంది వసంత..తర్వాత తల్లోని పువ్వుల్ని తడుముకుంది.

"ఏమి టల్లా వులిక్కిపడ్డావ్ వసూ? ఏమైంది?" ఆదుర్దాగా అడిగాడు.

"ఓ–మీరేనా? ఎవరో తలపట్టుకున్న ట్లుంటేనూ ఉలిక్కిపడ్డాను. ఎంత సే పైంది ఇంతకీ మీరొచ్చి." అన్నది వసంత నల్లని కలాన్ని పచ్చని చెక్కి లిపై ఆనించుకుంటూ.

తెల్లని జరీచీర కట్టుకుని, బుగ్గమీద పెన్నుంచుకుని, మల్లెపూలు పెట్టుకున్న పొడుగాటి జడను ముందరికేసుకుని, కాటుకకళ్ళను సుందరంగా చిట్లించి చూస్తున్న వసంతను కన్నార్పకుండా చూశాడు రాజు. ముగ్ధుడైపోయాడు– 'రోజూ చూసే వసంత ఈ అమ్మాయి కాదా?' అన్న అనుమానమూ కలిగింది.




ముందు కెమేరాకోసం పరిగెత్తాలో లేక పోతే 'ఏదేది_ నీ బుగ్గమీద అంటినట్లుంది సిరా. అరెరె! తుడవనా ?' అంటూ అమ్మాయిని దగ్గరకు లాక్కోవాలో తెలీ లేదు అతనికి.

ఈ సాత్విక భావాల గొడవేం పట్టి నట్లు లేదు వసంతకి. గబగబా వ్రాసుకు పోవటం మొదలెట్టింది. మళ్ళీ దిగ్భ్రాంతుడై పోయాడు రాజు_కాళ్ళకున్న బూట్లు అతనివంక జాలిగా చూశాయి, మా గతేమిటన్నట్లు. తన సంగతి అట్లా వుంచి యజమాని దురవస్థ గురించి టెర్లిన్ షర్టు ఉస్సురుమన్నది. అసలే చెరిగిపోయిన క్రాఫ్ మరోసారి చెదిరి, బాధపడింది. చేతివాచీ నిశ్శబ్దంగా నిట్టూర్చింది. సదరు వస్తువులవంక నిస్సహాయంగా, జాలిగా చూశాడు రాజు. మరో మూల హృదయం గోల పెడుతున్నది. ఇంతెందుకు ప్రకృతే మూగవోయింది.

పాపం రాజు ఏంచేస్తాడు మరి. తనే బూట్లు విప్పుకున్నాడు. 'వసంత కథ వ్రాస్తోంది. నిస్సంశయంగా కథే_గొప్ప కోరికలు నెరవేరాలంటే ఇట్లాంటి చిన్న చిన్న కష్టాలు పడందే లాభంలేదు_'కష్టే ఫలే' అన్నారు పెద్దవాళ్ళు. అలా టెర్లిన్ షర్టూ వగైరాలకు కూడా చెప్పి నచ్చ జెప్పి ఓదార్చాడు. పడకకుర్చీలో జార్లబడి వసంతని చూస్తూ కూర్చున్నాడు. అంతర్వాణి 'ఆకలో' అని గోలపెడుతున్నా లెక్కచేయటంలేదు.

ఓరకంట భర్త అవస్థని గమనిస్తున్న వసంత ఇక వూరుకోలేకపోయింది. "అన్నం పెడతాను రండి. గబగబా తినేద్దురుగాని. నేను తొందరగా వచ్చి కథ

వ్రాసుకోవాలి. మంచి రసపట్టులో వది లేసి వచ్చాను," అన్నది లేచివెళ్ళి అతని ఉంగరాల జుట్టును సరిచేస్తూ.

పూలపొట్లం లాంటి ఆ చెయ్యినీ - చెయ్యనేకాదు దాని తాలూకు మనిషినీ దగ్గరకు లాక్కుని గాఢంగా ముద్దులాడా లనే కోరిక పరవళ్లు తొక్కింది రాజు మనస్సులో. బలవంతాన అణచుకుని, 'పద' అంటూ వంటింట్లోకి నడిచాడు పాపం రాజు. వసంత అతను ఎంత కావాలంటే అంతే వడ్డించింది. అందు కనే అర్ధాకలితో లేచాడు.

పదకొండు గంటలదాకా వసంత చేతిలో పెన్ను చకచక సాగిపోతూనే ఉన్నది-సత్యభామ చేతిలో బాణంలాగా.

తొమ్మిదిముప్పావునుంచీ పక్కమీద పడుకుని ఎదురుచూస్తున్నాడు రాజు. ఇందాకట్నించీ చేసిన దారుణానికి భార్య చెప్పుకోబోయే సమాధానంకోసం. అమ్మాయి పెద్దపెద్ద కళ్ళు అల్లల్లార్చి జాలిగా తనవంక చూసినప్పుడు, 'ఊఁహూఁ, లొంగిపోకూడదు,' అని మనసుకి మరోసారి హెచ్చరిక చేసు కుంటూ పడుకున్నాడు-కానీ తన గురించి వసంత ఈషణ్మాత్రమైనా ఆదుర్దా పడు తున్నట్లు కనిపించటల్లేదు.

గడియారం, పదకొండు గంటలు కొట్టింది. గభిక్కున మంచంమీంచి లేచి, "వసంతా! నువ్వు వ్రాసేది నవలా?" అని వ్యంగ్యం స్ఫురించేట్లు అన్నాడు రాజు.

"అంతా అయ్యాక మీకు చూపి స్తాగా! ఈ లోప లంతా సస్పెన్సన్న మాట. నిద్ర వస్తోందండీ-కానీ మూడ్ కుదిరినప్పుడు వ్రాయకపోతే ఎట్లా? అందుకే ఇన్నాళ్ళనుంచీ వ్రాయలేదు," అన్నది వసంత వ్రాసుకుంటూనే.

భార్యమీద ప్రేమ పొంగి పొర్లుకు వచ్చింది రాజుకు. "అమ్మ దొంగా! ఇన్నాళ్ళబట్టీ నన్ను మభ్యపెట్టావుగదూ వ్రాయటం రాదని? ఎంత నాటకం ఆడావు! వసూ! త్వరగా పడుకోమరి. నీ ఆరోగ్యం ముఖ్యం," అంటూ నిద్ర పోయాడు రాజు. మృదువుగా తట్టి, తనని లేపి, మొహం కడుక్కోటానికి నీళ్ళిచ్చి-తర్వాత వేడివేడి కాఫీకప్పుతో ప్రత్యక్షమౌతుంది వసంత రేపొద్దున్న కూడా - రోజూలాగే అనుకుంటూ. కానీ అన్నీ మనం అనుకున్నట్లు జరిగితే ఇహ లేని దేముందీ!

దాదాపు ఏడుగంటలకి లోపలికి చొచ్చుకుని వచ్చిన సూర్యకిరణాలు నిద్ర లేపాయి రాజుని - "అరె చాలా ప్రొద్దెం క్కిందే, వసంతా! నన్ను లేపలేదేం!" అని ప్రశ్నిస్తూ ఇవతలికి వచ్చాడు రాజు. ఆ గదిలో వసంత కూర్చుని వ్రాసు కుంటున్నది. నిన్నటి విషయ మంతా గుర్తొచ్చిం దిప్పుడు. 'అమ్మయ్యో! వసంత కాఫీ కాచినట్లు లేదే - ఇక




హోటలు కాఫీయే శరణ్యమా?' అని కొంచెం భయంవేసిం దతనికి.

తలెత్తి, "నిద్ర లేచారా? ముఖం కడుక్కుని, అదుగో, ఫ్లాస్కులో కాఫీ ఉంచాను తాగండి—నే తాగేశా లెండి," అన్నది వసంత.

ఇంత అక్రమం ఎక్కడన్నా వుంటుందీ? ఎట్లాంటి వసంత ఎట్లా మారిపోయిందీ? అయినా ఒహర్నని ఏం లాభం? గప్‌చిప్‌గా వెళ్ళి కాఫీ తాగేశాడు రాజు.

ఉడికీఉడకకముందే అన్నం దించేసి, గబగబా కూరముక్కలు తరిగిపడేసి మళ్ళీ వ్రాసుకుంటున్నది వసంత. "కూర మాడుతోంది వసంతా!" అంటే ఏదో సామెత చెప్పినట్లు, "కాస్త మీరే దింపెయ్యండి," అన్నది. "అన్నం మీరే పెట్టుకు తినండి," అన్నది.

ఇదీ జరిగిన సంగతి.

* * *

రెండురోజు లిట్లా జరి సరికి రాజు డీలాపడిపోయాడు. అతగాడి రూపురేఖా విలాసాలు మారిపోయాయి. 'ఈ కథలు వ్రాస్తూ వసంత నాకు దూరమైపోతోంది, ఏం చెయ్యటం? ఆరునెలలనించీ వ్రాయమని వేపుకు తిని, ఇప్పుడు మానెయ్యమంటే ఎట్లా—మీ రింత భార్యాలోలురేం మరీనూ!— అని నవ్వదూ వసంత. నవ్వితే నవ్విందిగాని మానేస్తుం దని హామీ ఏమిటి?' ఇట్లా ఆలోచించుకుంటూ చిక్కిపోతున్నాడు రాజు — చెక్కిళ్ళలో మరీను.

రెండున్నర రోజులు జానకి చెప్పినట్లే చేసింది. కానీ ఇక అట్లా చేయటానికి అసాధ్యమైపోయింది వసంతకి – 'బాబోయ్! ఇక నా వల్లకాదు. ఇప్పుడు చేసినదానికే నిష్కృతి యేమిటో? ఆయన్నే అడిగితే, అమ్మో!' అని నానాహైరానా పడిపోతోంది వసంత ఇంటిదగ్గిర.

* * *

రాజు స్నేహితులందరూ "ఇదేమిటోయ్ ఇట్లా అయిపోయావ్? ఏమిటి సంగతి? మొన్నటివరకూ దేవేంద్రుడిలా వుండేవాడివిగదా?" అని ప్రశ్నించారు.

"మీ ధర్మపత్ని సతీ అనసూయావాళ్ళ కోవకి చెందుతుందని విన్నానే." అని పరామర్శించాడు ఎదురింటి ఆచార్లు. రాజూ వసంతల అన్యోన్య దాంపత్యానికి ఈర్ష్యపడేవాళ్ళల్లో ఒకడేమో మరి. ఏదో సమాధానం చెప్పి తప్పించుకున్నాడు రాజు.

ఆర్. పి. హామ్, సీ. హెచ్. ఎల్. అనే ఇద్దరు ఆప్తమిత్రులకు మాత్రం తన సంగతి నివేదించక తప్పలేదు రాజుకి.

సీ. హెచ్. ఎల్. అంటే చింతలపాటి సీతారామాంజనేయులుకి అనుమానం వచ్చింది. "రాజా! మీ ఆవిడ వ్రాసిన కథని నువ్వు చూశావా? కనీసం ఒక్క కథనైనా?" అన్నాడు సిగరెట్ వెలిగించి పొగలు ఆకాశంలోకి వదుల్తూ, పెద్ద డిటెక్టివ్ పోజులో.

"ఊఁహూఁ – వ్రాసిన కాయితాలన్నీ పెట్లో పెట్టి తాళంవేసుకుని ఆతాళంచెవిని మంగళసూత్రాలకు కట్టుకుంటోందోయ్;" బాధగా అన్నాడు రాజు.

"అదీ అట్లాచెప్పు–కథలువ్రాయమని మీ ఆవిణ్ణి బెదిరించిన రోజు మీ యింటికెవరైనా వచ్చారా – అంటే ఆవిడ అన్నలుగాని వదినలుగాని." ఆలోచనాపూర్వకంగా ప్రశ్నించాడు సీ. హెచ్. ఎల్.

"ఇది హత్యానేరమో, దొంగతనమో కాదోయ్ చిట్టితండ్రీ!" అని కోప్పడ్డాడు ఆర్. పి. హామ్. "రాజా! నే చెప్పినమాట విను. ఇంటికెళ్ళి తొందర తొందరగా బట్టలు సర్దేసుకుని సూట్‌కేసులో పెట్టేసుకుని రెండునెల్లదాకా రానని చెప్పి చరచరా వీధిలోకి వచ్చేయవోయ్," అన్నాడు ఆర్. పి. హామ్. అనగా రెంటాల వరంధామ్.

"ఏడిసినట్లుంది నీసలహా. ఆవిడింకా పెన్ను టకటకలాడించుకుంటూ నే 'మంచిది, వెళ్ళిరండి. మరో నాలుగు నెలలుండి మరీరండి,' అంటే ఏం చేస్తావ్? వీణ్ణి నీ యింట్లో వుంచుకుంటావా?" అన్నాడు సీ. హెచ్. ఎల్. రాజుని ఉద్ధరిస్తున్న ధోరణిలో. ఎట్లాగైతేనేం ఒక నిశ్చయానికి వచ్చినతరువాత ఆ ముగ్గురు మిత్రుల సమావేశం ముగిసింది.

* * *

ఆ సాయంకాలం—

మబ్బురంగు వుల్ వాయిల్ చీర అక్కడక్కడా మామిడిపిందెల డిజైన్ ఉన్నది కట్టుకుని, మామిడి పిందె ఆకారంలో బొట్టు పెట్టుకుని తదియ చంద్రుడి లాంటి పెదవులతో సన్నగా నవ్వుతూ తన రాజుకోసం ఎదురుచూస్తూ వుంచుంది వసంత.

చాలా సీరియస్ పోజులో ఇంటి కెళ్ళిన రాజుకు మళ్ళీ ఇలాంటి స్థితిలో వసంతను చూడగానే షాక్ తగిలినట్లై పోయింది. కాదూ మరి. ఇంకో ఇంకో సందర్భంలో అయితే 'కలయో వైష్ణవ మాయయో' అని కావ్య పరిభాషలో కాస్సేపు భార్యామణిని ఏడిపించేవాడే. కానీ నేడు కార్యాంతర వ్యగ్రుడై వుండె— అందుకని వసంత నోసారి ఓరకంట చూసేసి లోపలికి వెళ్ళి గబగబా బట్టలు సర్దేసుకోవడం మొదలెట్టాడు. వసంత గాఢంగా ఆశ్చర్యపోయింది. ఎట్టకేలకు పాపమా తరుణి తమాయించుకుని లోపలికి వెళ్ళి "నేను సర్దుతాలెండి. మీరు సర్దుకుంటే అయినట్లే ఇక. మీ బట్టలకు బదులు నా చీరలే పట్టుకుపో గలరు. ఇంతకీ వూరికేమైనా వెళ్తున్నారా?" అన్నది ధైర్యం చేసి.

అమ్మాయి మాటలు వినుపించుకోకుండా ఇంకా ఏమిటో వెతుకుతున్నాడు రాజు, భావోద్వేగానికి ఆనకట్టలు కట్టుకుంటూ. "ఏమిటండీ మాట్లాడరూ?" కొంచెం దుఃఖం మిళితమైన గొంతుతో అన్నది వసంత, తనను తానే సంబాళించుకుంటూ.



మరో నాలుగు నిముషాలకు తలకాయి యెత్తి "వసంతా! నేను ఆఫీసుపనిమీద వూరికెళ్తున్నాను. రెండు నెలలదాకా రాను బహుశా," అన్నాడు సూట్ కేస్‌కు తాళం వేస్తూ.

ఇది తన నిర్లక్ష్యానికి శిక్షే అనుకుంది వసంత. వసంతకు భోర్న ఏడుపొచ్చింది. రాజులోని అనురాగస్రవంతి ఉబికిపోయింది. "వసూ! వసంతా! ఏమిటి పిచ్చిపిల్లవాయేం? ఏడ్చేస్తున్నావేమిటి? ఛా ఛా ఛా- నీకు తాయిలం పెట్టనా? ఊరుకోమరీ" ఇన్నాళ్ళ ఆపేక్ష పొంగి పొరలగా భార్యను దగ్గరకు తీసుకుని ఆమె కన్నీళ్ళు తుడిచాడు- తుడిచినకొద్దీ ఆమె కన్నీళ్ళు ఎక్కువై పోతున్నై- అరెరె! ఎట్లా ఇప్పుడు? ఓదార్చటం రాక ఖంగారుపడిపోయాడు రాజు. కలకంఠి కంట కన్నీరొలకడం సంగతి కాపురం పెట్టిన ఆరునెలల తరువాతగాని తెలిసిరాలేదు మరి!!

కాస్సేపటికి వసంతే కన్నీరు తుడుచుకుని "ఈ రెండు నెలలూ నన్నెమై పొమ్మన్నారు? కాస్త చెప్పివెళ్ళండి. నిజంగా ఆఫీసు పనేనా? ఇదివర కెప్పుడూ లేనిది ఇప్పు డేం వచ్చిందీ? మీ రేమో ఇట్లా చిక్కిపోయారు. హోటల్లో తిండేమీకు పడదు. ఇం కెలా అయిపోతారో!" అన్నది. మళ్ళీ దుఃఖం ముంచుకొచ్చింది.

"ఆఁ......నేను చిక్కిపోతే ఎవరిక్కావాల్లే- నా చేత్తో నేనే వడ్డించుకు తినటంకన్నా ఆ హోటలువాడు వడ్డిస్తే నన్నా కాస్త సయిస్తుందేమో;" నిర్లిప్తతగా-నిర్వేదంగా అన్నాడు రాజు.

అందులోని వ్యంగ్యానికి వసంత హృదయం మండిపోయింది.

"ఇంత ఉపేక్షచేస్తున్నా రేమిటండీ! నేను మీ వసంతను కదా - మిమ్మల్ని చూస్తే నాకు దిగులుగా వుంది," అన్నది భయపడిపోతూ వసంత.

"ఇంకా నయం. ఉపేక్ష చేస్తున్నది నువ్వా నేనా? నువ్వెళ్ళు రాణీ! వెళ్ళి కథలు వ్రాసుకో-అయ్యో! ఇంత టైం వేస్టు చేశావేం - ఎట్లా? అన్నట్లు ఈ రెణ్ణెల్లల్లోనూ బోలెడన్ని కథలు వ్రాసుకోవచ్చు-మధ్య మధ్య నా డిస్టర్బె న్సుండదు హాయిగా," అన్నాడు రాజు.

వసంత ప్రాణం విలవిలలాడిపోయింది - "నన్ను క్షమించరూ?" అంటూ పాదాలమీద వాలిపోతున్న భార్యను లేవదీశాడు రాజు. ఏం? ఎందుకని? నువ్వేం తప్పు చేశావు గనక-" అన్నాడు.

"ఏం తప్పు చేశానో నాకూ తెలుసు, మీకూ తెలుసు. కారణాంతరాలవల్ల అట్లా చేశాను-అబ్బ! ఏం కథలండీ బాబూ! చచ్చిపోయాను వ్రాయలేక. చెయ్యి నొప్పెడుతోంది," అంటున్న వసంతని చూస్తే అమితమైన జాలి




పుట్టుకొచ్చింది రాజుకి. కథలూ వద్దు కాకరకాయలూ వద్దుగాని పూర్వంలా వుండు వసూ! నా కదే పదివేలు. అసలిదేమిటి నువ్వు? నువ్వు కూడా ఇట్లా అయిపోయావు. నీ చెక్కిళ్ళిట్లా తెల్లబడిపోయాయేం?'' ప్రేమగా ఆమె మొహాన్ని పరామర్శిస్తూ ఆవేదన నిండిన కంఠంతో అన్నాడు రాజు.

వసంత చిరుసిగ్గును దాచుకుంటూ "అదేమిటో తెలుస్తుంది లెండి'' అంటూ పారిపోయింది. రాజు ఆశ్చర్యంగా చూస్తూ నుంచున్నాడు.

"ఇదిగో! నేను వ్రాసిన కథ- చూపిస్తానన్నాగా - సరసహృదయులూ, సహృదయులూ అయిన భర్తగారికి అంకితమిస్తూ నిజంగానే ఒక కథ వ్రాస్తాను చూస్తుండండి-ఇప్పుడు మాత్రం నన్నేం అనకండి ప్లీజ్,'' అన్నది నీళ్ళతో మెరిసే కళ్ళతో నవ్వుతూ-ఒక కాయితాలకట్ట అతని చేతిలో పెట్టింది.

ఆత్రుతగా వాటిని చూశాడు రాజు. "ఇదేమిటి! అమ్మ దొంగా; రామకోటి వ్రాశావా? రామకోటి. చిట్టీ! ఇన్నాళ్ళూ రాత్రీ పగలూ కూర్చుని బరబరా వ్రాసేసింది ఈ రామకోటినా? అబ్బ! ఎంత ఏడిపించావ్ నన్ను." వసంత చెక్కిళ్ళను ఊపిరాడనీయలేదు రాజు.

అతి ప్రయత్నం మీద విడిపించుకుని

"ఏమండీ! మీ ప్రయాణం ఇంకో మూణ్ణెల్ల తరువాత వచ్చేట్లు చూడకూడదూ? అప్పుడు నేను మా పుట్టింటి కెళ్ళాలిగా మరి," అంది వసంత యాదాలాపంగా.

"నా ప్రయాణమా? అదీ నీ రామకోటి లాంటిదే. నువ్వు పుట్టింటి కెళతావా? నిజమా? అర్ధమైపోయిందిలే వసంతా! అరె, ఇటుచూపమంటూంటే;" రాజు చేతుల్లోంచి తప్పించుకుని పారిపోయింది రామకోటి రచయిత్రి వసంత.

మళ్ళీ కాస్సేపటికి "ప్రయాణం అబద్ధం ప్రసాదం నిబద్ధం అన్నారు పెద్దలు. ఇవిగో కొబ్బరి ముక్కలు పట్టండి. ఇవ్వాళ శనివారంగా. మీ కీ కథల పిచ్చి వదిలిస్తే కొబ్బరికాయలు కొడతానని మొక్కుకున్నాను లెండి," అంటూ పళ్ళెంలో కొబ్బరి ముక్కలతో సహా ప్రత్యక్షమైంది వసంత. 

ఉషారాణి భాటియా

# నిన్ను చూశాక గాని

"మామయ్య వచ్చాడు! మామయ్య వచ్చాడు! వీధిలో పిల్లల కేకలు విని కత్తిపీట ముందునుంచి లేచింది పార్వతమ్మ.

ఇంకా ఎనిమిదయినా కాలేదు. వానా కాలమేమో, రాత్రి కురిసిన వాననీళ్ళు యింకా వీధిముందు అలాగే వున్నాయి. చల్లగాలికి వూగిపోతున్న చెట్లనుంచి సూర్యుడు బాగా పైకి వచ్చేసివున్నాడు.

ఎద్దుబండిలోంచి దిగబోయి, బూడ్సు కాళ్లు బురద చేసుకుని, ముందు పడుతున్న క్రాపుని వెనక్కి తోసుకుంటూ, తల్లిని చూస్తూనే నిండుగా నవ్వాడు సోము.

"అయ్యో! అయ్యో! జాగ్రత్త నాయనా! ఇటు ఓరగా రా. ఇలా చెప్పకుండా, చెయ్యకుండా..." పార్వతమ్మ యింకా నోరు తెరుచుకు చూస్తుంటే, సోము తల్లి కాళ్ళమీద చేయి ఆనించి, లేచి నుంచున్నాడు. అప్యాయంగా తల నిమిరింది ఆవిడ.

అంతవరకూ నిశ్శబ్దంగా వున్న యింట్లో ఒక్కుమ్మడిన వెలుగు వెలిగింది. అంతా తలొకదారీ పరుగులు తీస్తున్నారు.

"ఇదిగో కాంతమ్మా! వేణీళ్ళు కాచు. వాడు స్నానం చెయ్యాలి."

"పాలేరుని కొంచెం కేకయ్యండే!"

"ఇదిగో సరోజా! మీ నాన్నని కేక వెయ్యి."

పార్వతమ్మ పనులు పురమాయిస్తూంధి. అయిదు పది సంవత్సరాల మధ్యవయస్సు పిల్లలు గుమ్మం దగ్గిర ఆ వాన నీళ్ళల్లో నుంచుని, సోము కేసి కుతూహలంతో చూస్తున్నారు. అతను లోపలి గదిలోకి వెళుతూనే, ఈజీఛైరులోంచి లేవబోయింది రత్నం.

"కూర్చో! లేవకు. ఎలా వుంది ఒంట్లో?"

స్టూలు లాక్కుని పక్కన చేరాడు తమ్ముడు.

"చెప్పా చెయ్యాకుండా ఇలా దిగేవు! ఏం కథ?" రత్నం నవ్వుతూంది.

"ఏముందీ! మిమ్మల్నంతా చూడా లనిపించింది, వచ్చేశాను.''

"ఓస్! చాల్లేవోయ్! ఖబుర్లు! పల్లె టూరి ముఖాలం, మా మీదే గాలి తిరి గిందా?''

"ఇదిగో! నువ్వు నమ్మవు కానీ, మామయ్యకి కూడా నేను వస్తున్నట్లు తెలీదు సుమా! ఉన్నవాణ్ణి ఉన్నట్లుగా బయలుదేరి వచ్చేశాను.''

"మరేం! కథలు అల్లటంలో అంత నేర్పరి!'' నమ్మనన్నట్లుగా రత్నం అతని బుజం వెనక్కి తోసేసింది.

ఇంతలో పార్వతమ్మ కప్పు కాఫీ, ఉప్మా పట్టుకు లోపలికి వచ్చింది.

"ముందు వాణ్ణి కాస్త యింత తిననీం తరువాత ఖబుర్లు,''అంటూ అవి పెట్టేం దుకు బల్ల వెతుకుతూంది.

"ఇక్కడేమిటి? వంటింట్లోకి వస్తాను పద," అంటూ లేచాడు సోము.

"అక్కడ బల్లలు, కుర్చీలు లేవు. చెక్కపీటలే!" రత్నం ఎగతాళి చేసింది.

మాట వినిపించుకోనట్లుగా సోము వంటింట్లోకి దారితీశాడు. ఫలహారం పూర్తయి, అతను స్నానం చేసే వేళకి, పార్వతమ్మ కూతురి దగ్గిరకి హడా వుడిగా వచ్చింది.

"ఏమన్నా చెప్పాడే?''- అర్థంకా నట్లు తల్లిముఖంలోకి చూసింది రత్నం.

"అదే! పిల్ల నచ్చిందా?"

"ఇప్పుడేగా రైలు దిగుత. అయినా నీకేదొచ్చినా హడావుడే అమ్మా! కోడలు, కోడలు అంటూ సంబర పడు తున్నావు. తీరా ఆ కోడలొచ్చి..."

"హాస్యానికేం గానీ, రత్నం, చంద నపు బొమ్మట. మరి చదువా అదేదో సీసులో చదివిందట. నేనా పల్లెటూరి దాన్ని. ఆ పిల్ల వచ్చి యింట్లో దీపం వెలిగిస్తే చూడాలనివుంది".

"నూనెదీపం కాదమ్మా! కాండిలు లైట్సు."

రెండోకూతురు సరోజ అందుకుంది. అక్కచెల్లెళ్ళ నవ్వుతో గది మారు మోగింది.

* * * *

సోము విశ్రాంతికని మంచంమీద వాలాడేగానీ అన్నీ సమస్యలే ఎదు రొక్కన్నాయి. మేనల్లుడు రైలింజను బాగుచేయమని వచ్చాడు. మేనకోడలు తను ఏం గౌను తొడుక్కుంటే మామకి యిష్టమో చెప్పమని కుప్పబట్టలు తీసికు వచ్చి మంచంమీద వేసింది. సరోజ, యిక తనకి అర్థంకాని లెక్కలన్నీ అన్నయ్యే తీరుస్తాడనే నమ్మకంతో గదిలో చేరింది. ఇవన్నీ యిలా వుండగా, రత్నం పెళ్ళికూతురి ఖబుర్లు పైకిలాగ ప్రయత్నిస్తోంది.



తండ్రి రాకతో ఆ కలకలం కొంత తగ్గింది.

"ఏమేవ్! నీ సుపుత్రుడి కప్పుడే పెళ్ళితొడుకు లక్షణాలు వచ్చాయి," అంటూ హాస్యం చేశాడు తండ్రి. సోము తల వొంచుకున్నాడు.

* * * *

ఆ కుటుంబానికి సోము ఒక్కగా నొక్క కొడుకు. తల్లీ తండ్రీ చేత అతి గారాబు చేయించుకుంటూ పెద్దవాడయాడు. ఇంజనీరింగు ఫస్టుక్లాసులో ప్యాసయి రెండేళ్లు జర్మనీలో ట్రెయినింగు కూడా చేశాడు. చూడ చక్కని వాడు. రేపోమాపో పెద్ద ఉద్యోగస్థుడు కూడా కాబోతున్నాడు. తన ముద్దుల కొడుక్కి ఒక భార్యని తేవాలని చాలా రోజులుగానే పోరుతోంది పార్వతమ్మ. ఆ సాకూ ఈ సాకూ చెప్పి వాయిదా వేస్తున్నాడు సోము.

సోములాటి వరుడికి పిల్లని వెతకటం కష్టం. కట్నం కానుకలతో చక్కని అమ్మాయి లున్నా, మరి సోము అభిరుచులు ఎలా వుంటాయో అని, అన్వేషణ ప్రారంభించినవాళ్ళంతా మధ్యలోనే ఆగిపోయారు. నిజానికి ఆంధ్రదేశంలో బ్రాహ్మణ కుటుంబాలలో చక్కని

చక్కలకి కొదతేలేదు. అందులో "సోములాటి వరుడయితే కొండంత కట్నమూ వస్తుంది. కానీ సోముకి బాగా చదువున్న భార్య అవసరం. అతని అభిరుచులకీ, భావాలకీ అనుగుణంగా, చక్కదనంతో బాటు చలాకీతనం, చమత్కారం, మెఱుపు ముఖ్యం." అని విడమర్చాడు సోము మేనమామ.

అతనికి ఢిల్లీలో పెద్ద వుద్యోగం. పెద్దపెద్ద వాళ్ళతో పరిచయం, పార్టీలూ, రెస్టారెంట్లూ — ఆ సాంఘికజీవితంలో తిరుగుతూ, పై అభిప్రాయం వెలిబుచ్చటంలో అతను పొరపాటు చేయలేదు. తమకు దగ్గిర పల్లెలో, ఆవులు, ? దెలు తిరగాడుతున్న ప్రాంతంలో తన అక్క, బావ వెతికితెచ్చే పిల్ల సోముతో సమానంగా, ఉద్యోగస్థుడి భార్యగా మసలొద్దూ? అందుకు, చదువుతోబాటు ఒక అంతస్థులో తిరిగే అర్హత, మాటల పొందిక, నడవడిక, వుండొద్దూ? అని యోచించాడు మామ.

మరి ఇవన్నీ కనబడ్డాయి అతనికి మనోరమలో. జడ్జి శేషగిరిపంతులుగారి ఆఖరి కూతురు ఆ అమ్మాయి; ఎమ్. ఎస్‌సి. ప్యాసయింది. విదేశ స్కాలర్‌షిప్పుకోసం ప్రయత్నిస్తోంది. సన్నగా, పొడుగ్గా, బంగారు ఛాయతో, చూడ ముచ్చటగా, మరికాస్సేపు చూడాలనిపించే విగ్రహం. కొద్దిగా పాడుతుంది. టెన్నిస్ ఆట వచ్చు. క్రింద నేల పగులుతుందేమో అన్నట్లు మృదువుగా అడుగులు వేస్తుంది. కుడివైపు ముంగురులు సర్దుకునేందుకు, ఎడం చేయిని అతి నెమ్మదిగా తలవెనుకగా పోనిస్తుంది. ఒకోక్కప్పుడు ఏం చెబుతున్నదీ వినపడనంతగా పెదిమలు కదుపుతుంది; నవ్వినా శరీరం ఆకులా అల్లల్లాడి పోవటమేగానీ, శబ్దం వినపడదు. మనోరమ "హవ్ స్వీట్!" అన్నా, "థ్యాంక్యూ" అన్నా లేతగులాబీరంగు పెదిమల కదలిక చూసేందుకు ఉవ్విళ్ళూరిపోతుంటారు చాలామంది.

జడ్జీగారికి తన మేనల్లుణ్ణి పరిచయం చేస్తూ, మనసులో మాట బైటపెట్టాడు. సోము మామ. ఆయన అంతా కూతురి యిష్టమే అన్నాడు. అదేదో ఉదమిద్ధమని పైకి చెప్పకపోయినా, సోము అంటే కొంత కుతూహలం కనపరచింది మనోరమ. వాళ్ళిద్దరూ ఒకర్నొకరు కల్సుకోవటం, తెల్సుకోవటం జరుగుతున్న సమయంలో, అక్క పార్వతమ్మకి జాబు రాశాడు తమ్ముడు.

"అంత గొప్పసంబంధమే!" మురిసిపోయాడు సోముతండ్రి. "మా నాయనకి యిష్టమయితేసరి." అంది గారాబంగా తల్లి. ఇక యింట్లో మిగిలిన అక్కచెల్లెళ్ళు రాబోయే వదినగార్ని గురించి కలలు కనకుండా ఎలా వుండగలరు? ఉద్యోగాన్వేషణ, వధువు అన్వేషణ,




రెండూ కలిసివచ్చేట్లు ఢిల్లీ వెళ్ళిన సోము ఆదే మళ్ళీ యింటికి రావటం.

* * * *

"అన్నయ్యా! నే నివాళ నీతో షికారుకి రాను. సుబ్బలక్ష్మి యింట్లో బొమ్మలు పెట్టారు. వెళ్లాలి," అంది ఓసాయంత్రం సరోజ. సూర్యాస్తమయం కాబోతున్న సమయం. తలనిండా మల్లెపూలు. పట్టు పావడా, పూలవోణీ సింగారించుకుంటున్న చెల్లెలివంక ఆలోచిస్తూ చూశాడు సోము. తను యింటికి వచ్చినప్పటినుంచీ అప్ప చెల్లెళ్ళూ, తల్లీ తండ్రీ, తనకి ఆ పల్లెటూళ్ళో కాలక్షేపం అయేందుకు శతవిధాల ప్రయత్నిస్తున్నారు. అందులో సరోజకు సాయంత్రముల షికారుకి తీసుకెళ్ళటం ఓ ముఖ్య కార్యక్రమం.

"నేనూ రానా?'' అన్నాడు సోము పుస్తకం మూస్తూ. నిజంగా వచ్చేస్తాడేమో అని గాభరా పడింది సరోజ.

"అది ఆడవాళ్ళ పేరంటం, నువ్వు రాకూడదు," అంది ఖచ్చితంగా.

"మరేం ఫరవాలేదు; అంతా వెళుతుంటిమిగా, వాడూ వస్తాడు. బొమ్మలవీ చూసినట్లూ వుంటుంది. శేఖరం గార్ని కల్సుకున్నట్లూ వుంటుంది. ఆయన ఎన్నిమాట్లు అడిగారో వీణ్ణిగురించి,'' అంటూ సమర్థించింది తల్లి.

"అలా కాదే అమ్మా! ఆడగుంపంతా వీణ్ణి చూసి దడుసుకుంటారు. శేఖరంగార్నే యిక్కడికి వచ్చి వాణ్ణి పిలవమను. పగలెప్పుడైనా వెళ్తాడులే," సర్ది చెప్పింది రత్నం.

"ఈ ఆడంబరాలన్నీ ఎందుకు? ఆయ నొక్కసారి కలవటంలో తప్పేముంది? పదండి. పంచకట్టుకు వస్తాలే,"



అంటూ లేచాడు సోము. అతని కెప్పుడూ తల్లిమాట కాదనటం యిష్టం వుండదు. జుబ్బా, పంచే తొడుక్కొని, రోడ్డుమీద గుంటల్ని దాటుకుంటూ నడుస్తున్న అన్నయ్యవొంక అయిష్టంగా చూసింది సరోజ. 'ఎందు కిలా రావటం? తన స్నేహితురాళ్ళందరికీ తను యిచ్చిన వర్ణనకి వ్యతిరేకంగా.' అంటూ పెదిమి కొరుక్కొంది.

ముందుహాలు ఆడవాళ్ళతో టకికిట లాడుతోంది. వెనుక వరండాలో కుర్చీ లేసుకుని కొందరు మొగవాళ్ళు కూర్చుని వున్నారు. సోము వాళ్ళవైపు వెళ్ళి, శేఖరంగారికి నమస్కారం చేశాడు.

* * *

దీపాలు పెట్టి చాలాసే పయింది. పార్వతమ్మ, రత్నం తాంబూలాలు పుచ్చుకుని లేచారు. కానీ సరోజ జాడమటుకు లేదు. గుమ్మందాటి బైటికి వచ్చాక కూడా 'సరోజా' అని కేకలేస్తూంది



తల్లి. ఇంతలో ఖంగుమని గాజుల చప్పుడయింది.

"అమ్మా! మీరు వెళ్ళండే. నేను కాస్సేపుండి వస్తాను;" తల్లిని బ్రతిమాలుతోంది సరోజ.

"అవునండీ! నేను వచ్చి దిగబెడతానుగా." ఆ చీకట్లో సన్నగా మరో గొంతుకూడా వినిపించింది. సోము చటుక్కున పక్కకి తిరిగి చూశాడు. పెద్దపెద్ద కళ్ళు, ఆ కళ్ళనిండా పులుముకుని కాటుక, ముక్కుపుడక కాంతి పడి మెరుస్తున్న వలుచని చెంపలు, ఆ చెంపలమీదగా కిందికి వాలిపోతున్న పెద్దజడ, చామనచాయరంగు, నల్లంచు నిమ్మపండురంగు పట్టుచీర, తలనిండా మల్లెలు.

"సుబ్బులక్ష్మిరా! శేఖరంగారి రెండో కూతురు," సోము బుజం వూపింది రత్నం. అతను కనురెప్పలు పక్కకి మరల్చేముందు, వాళ్లు వీధిలోకి వాచ్చేశారు.

రాత్రి భోజనాలయి పడుకోబోతుండగా, సోముగదిలోకి పరుగెత్తుకుంటూ వచ్చింది సరోజ.

"చూ డన్నయ్యా! నా కెంత అన్యాయం చేశావో! ఆ గోధుమరంగు జుబ్బా అతనే మా అన్నయ్య అంటే నా స్నేహితురాళ్ళు నమ్మలేదు; పైపెచ్చు ఎగతాళి చేశారు."

"ఎవ రా స్నేహితులు? ఆ సుబ్బులక్ష్మినా?" తలగడ సరిచేసుకుంటూ అడిగాడు సోము.

"మరేం! ఏమంది తెలుసా?"

"పొద్దుపోయింది, వాణ్ణి పడుకోనీవే. పొద్దున్న చెబుతువుగాని ఖబుర్లు."

తల్లి కేక వేయటంతో సరోజ తుర్రున గదిలోంచి పారిపోయింది.

* * *

ఆ మర్నాడు...మర్నాడు...అలా రోజులు దొర్లుతున్నాయిగానీ, సరోజ తను చెప్పదలచుకున్న ఖబుర్లు చెప్ప మరచేపోయింది. ఎటూ వచ్చి సోము మటుకు మర్చిపోలేదు; తనంతట తానుగా అడగనూ లేక, సరోజ చేత చెప్పించనూ లేక, విషయం కోసం మహా తాపత్రయ పడిపోతున్నాడు. 'అసలా చీకట్లో కనీకనిపించకుండా మెదిలిన ఆ స్నేహితులు ఏమనుకుంటేనేం,' అని ఒక్కనాడూ మనసుని సమర్థించుకోలేదు.

దానికి తోడు సుబ్బులక్ష్మి ఓ రోజు మధ్యాహ్నం వాళ్ళింటికి వచ్చింది. సాయంత్రం దాకా అక్కడే వుంది. వంటింట్లో పార్వతమ్మకి బజ్జీలు చేయటంలో సహాయపడింది. రత్నానికి పుట్టబోయే పాపకి స్వెట్టరు అల్లుతానని వూలువుండలు తీసుకుంది. సోము గదిలోకి వచ్చి, అతని బల్లమీద వస్తువులు చనువుగా సర్దింది. షెల్ఫులో బరువయిన పుస్తకాలు కళ్ళు మరింత పెద్దవి చేసుకుంటూ తిప్పితిప్పి చూసింది. అంతేకాదు; ఆ తర్వాత రెండు మూడు సార్లు వాళ్ళందరితో కలిసి వనభోజనం కూడా చేసింది.

సోముకి యిప్పుడు ఆ అమ్మాయిని గురించి చాలా వివరాలు తెలుసు. సుబ్బులక్ష్మికి యిరవై ఏళ్ళు దగ్గిరపడుతున్నాయి. తొమ్మిదో క్లాసువరకూ చదివింది. గలగల నవ్వుతూ మాట్లాడుతుంది. ఎగిరే పక్షులనీ, కదిలే కొమ్మలనీ చూసి గూడా చాలా ఎక్సైట్ (excite) అయ్యే ప్రవృత్తి. పలకరించినవారివంక ఎంత సూటిగా చూస్తుందో, అంత కుండబద్దలుకొట్టినట్లుగా సమాధానం చెబుతుంది. ఎవరైనా దోసెడుఆనందాన్నిచ్చే విషయం చెబితే ఎగిరి గంతేసేటంతగా, మురిసిపోతుంది. కోపం వస్తే, కనుబొమలు ముడిచి, బుగ్గలు ఎఱుపు చేసుకుని, గబుక్కున లేచి వెళ్ళిపోతుంది. కానీ మరుక్షణం ఏదో మిషమీద అక్కడే తారట్లాడుతుంది. ఇక పలకరిస్తేనా – ప్రాణాలన్నీ కళ్ళల్లోకి తొంగిచూస్తూ, హాయి అయిన చిరునవ్వు యిస్తుంది. మనిషి కళ్ళెదురుగా వుండి ఎంత ఆనందాన్నివ్వగలదో కాస్తంత దూరం వెళ్ళగానే అంత బాధనీ యివ్వగలదు.

*　　*　　*

ఎక్స్‌ప్రెస్సు వుత్తరం చేత బట్టుకుని తండ్రి వగరుస్తూ రావటం చూసి, సోము తడబడ్డాడు.

"త్వరగా విప్పి చదవరా?"

సోము కవరు చించి నాలుగుపంక్తులు చదివి, విప్పారిన ముఖంతో నాలుగువైపులా చూశాడు. అప్పటికీ యింట్లో అంతా తలోకమూలా నిల్చుని అతనికేసి చూస్తున్నారు.

"మామయ్యా దగ్గిర్నుంచి నా ఉద్యోగం విషయం. అమెరికను కంపెనీలో యింటర్వ్యూ ఫలితం. ఒక వారంలో ఆర్డరు వచ్చేస్తుంది."

తండ్రి గర్వంగా కొడుకు వీపు చరిచాడు.

"నా తండ్రీ! వుండు. ముందు దిష్టి తియ్యనీ." అంటూ వంటింటివైపు వెళ్ళింది పార్వతమ్మ.

"ఢిల్లీలోనే వుద్యోగం! అయితే అన్నయ్యతో వెళ్ళి వూరు చూసివస్తాను." అంటూ గంతులువేస్తోంది సరోజ.

పార్వతమ్మ పేర ఆమర్నాడు మరో

పెద్ద వుత్తరంకూడా వచ్చింది. భార్యా భర్త లిద్దరూ ఆ వుత్తరం లోని విష యాలు గురించి చాలా ఆలోచించారు. ఉత్తరం సారాంశం: 'జడ్జీగారు సోముని అల్లుడుగా చేసుకునేందుకు పూర్తి అంగీ కారం తెలియజేశారు. అబ్బాయి కి వుద్యోగం కూడా అవబోతోంది గనుక, తాంబూలాలైనా, అంటే ఎంగేజిమెంటు ఉత్సవం చేయాలని యిష్టపడుతున్నారు.'

సోము యిప్పుడు చాలా ఉత్సాహంగా వున్నాడు. ఉద్యోగంలో చేరి, నాలుగు రాళ్ళు చేతికి వచ్చాక, ఆ ఉత్సవ మేదో జరిపించ వచ్చని తండ్రికి చెప్పాడు.

"ఏమో! నా అదృష్టం ఎలా వుందో; కోడలు వచ్చే గీత ఎప్పుడో! వాడివి పెద్ద చదువులు, పెద్ద ఊహలు. మన కేం అర్థం అయి ఏడుస్తాయి?" అంటూ వాపోయింది పార్వతమ్మ.

వారం రోజుల్లో అనుకున్న ఉద్యోగపు ఆర్డరు రానేవచ్చింది. మరునాడే ప్రయాణం కట్టాడు సోము. అతను సామాన్లవీ సర్దుకుంటుంటే గుబులుగా చూశారు యింట్లో అంతా. తినుబండారాలు కట్టియిస్తూ, శలవులకి రమ్మని మరీమరీ చెప్పింది పార్వతమ్మ

"ఢిల్లీ ఎండలకి తట్టుకోలేక వాడు ఏ సిమ్లాకో వెళతాడు; ఈ పల్లెటూరు ఎందుకు వస్తాడు?" అని తల్లిని ఎగతాళి చేసింది రత్నం.

ప్రయాణపు ఘడియ దగ్గరకొచ్చిన సోముకు హుషారు ఎక్కువయింది.

ఈల వేసుకుంటూ సామాన్లు సర్దుకుంటున్న అతనికి సరోజ గుమ్మంలో కనపడి, ఒక్క క్షణం ఆగాడు.

"మరేం! హాయిగా పట్నం వెళ్ళిపోతావు. కార్లు! సినిమాలు! మేం ఏమన్నా జ్ఞాపకమా?" సరోజ కళ్ళు తడి అవుతున్నాయి.

"పోనీ! నువ్వూ రా నాతో."

"నిజంగానా అన్నయ్యా! నిజంగానే అన్నావా?"

"నమ్మకం లేదా?"

"మరి ... మరి ..."

"ఏమిటి?" తొంగిచూసి వివ్వుతూ అడిగాడు.

"సుబ్బులక్ష్మి కూడా నాతో వస్తానంటూంది. తనూ, నేనూ ఒకేసారి ఢిల్లీ చూసేట్లు ఒప్పందంగా — మరి, ..." సరోజ నిరాశగా వెనక్కి తిరిగింది.

సోము నిశ్చేష్టుడై చెల్లికేసి చూశాడు.

* * *

ఎద్దుబండి గుమ్మంముందు ఆగింది. రత్నం లేచి వరండాలోకి వచ్చింది. నౌఖరు సామాన్లు తెచ్చేందుకు సోము గదిలోకి వెళ్ళబోయాడు. కానీ గది లోపల్నుంచి మూసివుంది.

రత్నం దగ్గిర మరికాసిని పూలు వుండలు పట్టుకెళ్ళటానికి వచ్చిన సుబ్బులక్ష్మి పొరపాటున ఆగదిలోకి వెళ్ళింది.

భయంతో వణుకుతున్న ఆపిల్ల చేతులు పట్టుకుంటూ, తలుపుమూసేశాడు సోము.

"సుబ్బులక్ష్మి! నిజం చెప్పు, ఢిల్లీ చూడాలని వుందా? నాతో వస్తావా?"

సోముచేతుల్ని విడిపించుకుంటూ దూరంగా జరిగింది ఆ అమ్మాయి.

"సరోజతో; మీతో కాదు." అంది ముఖం చిటచిట లాడిస్తూ.

"నేనంటే యిష్టంలేదా?"

"అంటే..."

సోము మాటని త్రుంచేసింది.

అతని హృదయం వేగంగా కొట్టుకుంటోంది.

"ఏోసీ! నేనంటే ఎంత యిష్టం వుంది?..."

"ఊఁ(..." అర్ధంకానట్లు తల అటూ ఇటూ తిప్పింది.

"నన్ను పెళ్ళి చేసుకుంటావా?"

సుబ్బులక్ష్మి ఎడం బుగ్గమీద చిన్న సొట్టపడింది. సాయంకాలపు సూర్యుడిలా ముఖమంతా ఎఱ్ఱనయింది. గోడపక్కకి తిరిగి చేతులతో ముఖం కప్పేసుకుంది.

"నాకేం తెలియదు. మా వాళ్ళని అడగండి," అంది. కానీ సోము తలుపు తియ్యటానికి వెళుతుంటే, అతని కడ్డం వెళ్ళింది.

"ఒద్దు! ఒద్దు! మీ రేదో పెద్ద పుస్తకాలవీ చదివి వున్నారు. నాకు అవేం తెలీవు. నేను తణుకుతప్ప మరో వూరుగూడా చూసి ఎరగను..."

సుబ్బులక్ష్మి నోటిమీద మృదువుగా తన కుడిచెయ్యి వేసి, ఎడంచేత్తో ఆమెని దగ్గిరగా తీసుకున్నాడు సోము.

"నిజంగా! నిన్ను చూశాకగానీ బ్రతుకులో యింత స్వచ్ఛత, హాయి వున్నాయని తెలియలేదు నాకు. నువ్వే నాకు కావాలి. ఉన్నత భావాలూ, పెద్ద ఆశయాలూ నాకు ఒద్దు. జీవితం కావాలి. జీవితాన్ని అనుభవించగలి! నీలాటి వ్యక్తి కావాలి.

"నేను ఎంత సమర్ధుడినో అంచనాలు నాకు ఒద్దు. వాతావరణపు చల్లదనం, ఊహాగానపు జీవితం వర్ణనలు వినివినీ విసిగిపోయి వున్నాను. దైనందిన జీవితమే ఎంత కృత్రిమంగా తయారవగలదో, మనుష్యులు కేవలం నాటకంలో పాత్రలకుమల్లే ఒకరికొకరు ఎలా అన్యాయము చేసుకోగలరో చాలినంత చూశాను. ఈ భూమ్మీద కాలు మోపే నీలాటి సామాన్యులు నాకు కావలసింది. చెప్పు! నేనంటే నీకు యిష్టమేనా..."

సుబ్బులక్ష్మికి అతని మాటలు ఎంతవరకూ అర్ధమయాయో గానీ, అతన్ని దూరంగా మటుకు తోసెయ్యలేదు. పైపెచ్చు ఆమె చెంపలమీద పడుతున్న ముంగురులు అతని షర్టు గుండీకి అందముగా చుట్టుకున్నాయి.

* * *

ధన్‌మని చప్పుడుచేస్తూ పీట లాక్కుని

పక్కన కూలబడిన కొడుకుని ఆశ్చర్య పోతూ చూసింది పార్వతమ్మ.

"ఏమైందిరా?" ఆ వి డ తడబడు తోంది.

"అమ్మా! నా కెలా చెప్పాలో తెలీ టము లేదు. మరి...మరి...సుబ్బలక్ష్మి నీకు కోడ లెందుకు కాకూడదూ?"

"ఆఁ!" అంటూ పా ర్వ త మ్మ వెనక్కి వాలిపోయేంత పనిచేసింది.

"అది కాదమ్మా! నాకు సుబ్బులక్ష్మి లాటి భార్య దొరికితే అంతకంటే అదృష్టం ఏముంది?"

"ఛత్! ఊరుకో! నీ కేమయినా మతిపోయిందా? అంత గొప్ప సంబంధం మానుకుని, పల్లెటూరుదాన్నా చివరికి! నీ తాహ తెంత! ను వ్వెంత!"

"అంతా మనం వూహించటంలోనే వుందమ్మా! సుబ్బులక్ష్మి నాకు మనిషిగా విలువ యిస్తుందమ్మా! నే నిచ్చే జీవి తంతో తృప్తిపడే శక్తి వుందమ్మా..."

అప్పటికే గుమ్మంవరకూ వచ్చిన సోముతండ్రీ, అక్కా అతని మాటలు విన్నారు.

రత్నం సైగతో వచ్చినఎద్దుబండి తిరిగి వెళ్ళిపోయింది.

* * *

మరో వారంలో ఆ వీధిలో పందిరి వెలిసింది. ఈమాటు జరీఅంచు నిమ్మ పండురంగు చీరా, తలనిండా మల్లె పూలతో సుబ్బులక్ష్మి ఆయింట్లో అడుగు పెట్టింది.

'ఆమెతో ఢిల్లీ వెళ్ళనా?' అని సరోజ వేసిన ప్రశ్నకి పాపం యింట్లో అందరూ ఎదురుచెప్పినవాళ్ళే! 



# ఎచటికి పోతావు రాత్రి



ఎచటికి పోతా నీరాత్రి ?

ఎవరు దిక్కు నాకు ?

ఈ రైల్లో అర్ధరాత్రిపూట ఇలా ప్రయాణం చేస్తూచేస్తూ ఎక్కడికో, తిరిగిరాని ఏచోటుకో వెళ్ళిపోతానేమో ?

నాకు తెలుసు. ఇంకా కొంచెంసేపట్లో రైలు పడిపోతుంది. ఇన్ని వందల ప్రాణాల అంతిమయాత్రకు ఈరాత్రి వీడ్కోలు చెబుతుంది !

నిజంగా ఎంత భయంకరమైన రాత్రి ఇది ! శాశ్వతమేమో ననిపిస్తోం దీరాత్రి !

అయినా ఈరైలు కెంతధైర్యం. ఒంటరిగా ఎడారిలోంచి, కొండలమధ్య నుంచి, నదులమీదనుంచి, అరణ్యాల లోంచి జరజర ప్రాకిపోతోంది. ఈ పెట్టెలో ఓ మూలగా కూర్చున్నా. ఎందుకో తెలియదు ఈపూట ఎన్నో భయంకరమైన ఆలోచనలు వెంటాడుతున్నాయి. నా హృదయం గుబులుతో దిగులుతో బరువెక్కిపోతున్నది.

ఇది చరమరాత్రి; ఈరాత్రి ఇంకా కొన్ని గంటలకి తెల్లారిపోతుంది. కాలదేవతకు మరో క్రొత్తరోజు పుడుతుంది కాని ఆ 'రేపు' యొక్క ఆద్యంతాలు మాకు తెలీవు. మృత్యుదూత చిరుపదాల కింకిణీరవాలు వినబడుతున్నాయి. కొన్ని నిమిషాలలో ఒక్కసారి మా అందర్నీ -

బయటకుచూస్తే గుండె గుభేలు మంటుంది. కాని సాయంకాలంనుంచీ అలాగే చూస్తూ కూర్చున్నాను. పైన బాగా మబ్బుపట్టింది. చెట్లపైన ఎర్రపూలు వర్షపుజల్లుకి తడిసిముద్దయి వణుకుతూ ముడుచుకు కూర్చున్నాయి. ఆకాశంలో తెల్లనికొంగ దారితెలియక ఎగురుతోంది.

---

"అరుణ"

ఆ సాయంకాలం గడిచిపోయింది.

కొండల్లోంచి ఒంటరిగా దూసుకుపోతోంది రైలు. అయినా దీన్నిండా మనుష్యులున్నారు ఆశల్లో!

ఇటువైపు చూస్తే మరణంలాంటి లోయ. చీకటితో నిండింది.

అటువైపున మబ్బుల కిరీటాల్ని పెట్టుకుని చీకటి తెరలమాటున రాజ్యం చేస్తున్న కొండరాణి.

ఉండి ఉండి రివ్వున మీదపడే జల్లు. మూడురోజులనుండీ ఎడాతెరిపి లేకుండా కురిసినవర్షం ఈరోజే తగ్గింది. నా ఖర్మ కొద్దీ ఈ రోజే నేను బయలుదేరవలసి వచ్చింది. రేపు సాయంకాలంగాని ఆ 'అరణ్యం' చేరను. ఆ అడవిలో అన్నీ వెదుక్కోవాలి. ఉన్నవాడిని ఉండనీయక ఎందుకొచ్చిన ట్రాన్స్‌ఫర్లు?

పైవాళ్ళమీద కోపం వచ్చింది; మా అవస్థ వాళ్ళకేం తెలుస్తుంది.

ఆశలు లేని వారికి ప్రాణభయం ఉండదు. కాని నాకు ఆశలు వున్నాయి; ఎన్నో-జీవితాన్ని నిండుగా పరిపూర్ణంగా అనుభవించాలని వున్నది. నా జీవితాన్ని తామరాకుమీది నీటి బిందువులా ప్రకాశింప చేసుకోవాలని ఉన్నది. జీవితమంటేనే అందం.

కాని ఎలా? ఈ రైలు పడిపోతున్నది. నేను బ్రతకను; నా దీర్ఘయాత్ర ఈ రైలులో సాగుతున్నది.

బయటకు చూశాను.

నిరంతర శూన్యంలో లీనమౌతోంది కాలం! కాటుక పూసునన్న కొండ రేఖామాత్రంగా కనిపిస్తూ మమ్మల్ని వెంబడిస్తోంది గతంలా.

"అయ్యో, రైలు పడిపోతోంది. ఆపెయ్యమనండి. వెళ్ళకండి." అని బ్రతిమాలుతూ చెబుతున్నది.

దాని మాట వినే దెవరు? రైలు తెగించింది. కాలచక్రముతో పోటీ పడుతున్నాయి రైలు చక్రాలు.

కొండ మాతో చాలాదూరం వచ్చింది. దారిపొడగునా దాని విలవిలలు నాకు వినిపిస్తూనే వున్నాయి. అయినా 'బుద్ధిః కర్మానుసారిణీ' అని వుండనే వున్నది కదా! ఇం కెందుకు ఆగుతుంది రైలు?

కొండ అలసి వెనకపడుతున్నది. మరో వైపు మహాలోయ అలసిపోయిన ప్రయాణీకులను సేద తీర్చుకోమంటున్నది. అటువైపు కొండ రాలేక జాలితో కన్నీరు కారుస్తున్నది.

ఇంతమంది ప్రాణుల సందడితో తన ఇల్లు కళకళలాడుతుందని సంతోష పడుతున్నది లోయ! చీకటిగోతుల్లో దాని నవ్వు ప్రతిధ్వనిస్తున్నది.

ఏమీ చేయలేక 'ఇదంతా కర్మ' అని తృప్తి పడి నిలిచిపోయింది కొండ.

ఒకవైపు భవిష్యత్తు; ఒకవైపుగతం; ఒకవైపు ప్రేమ; ఒకవైపు ద్వేషం.

ఈ రెంటిమధ్యలోంచి దూసుకుపోతోంది రైలు. అనంతమూ, భయావహమూ ఐనరాత్రిఎప్పటికితెల్లవారుతుంది?

ఈ చీకట్లో ఆ పట్టాలు సరిగా కనప డతాయా? ఉహుఁ! నిద్రకుజోగుతూ రైలు నడుపుతూంటారు. ఏదో ఓక్షణంలో –

నా కళ్ళలో వసంత మెదిలింది. ఈ పాటికి నిద్రలో వుండివుంటుంది. తెల్ల వారి 'నేను' లేని ఆ ఇంట్లో దిగులుతో తిరుగుతుంది. అయినా త్వరలోనే కలుసు కుంటాముకదా అని ధైర్యంతో లేనినవ్వు తెచ్చుకుంటుంది. కాని నా సంగతి ఎవ రికి తెలుస్తుంది అప్పుడే? ఇంకా రెండు రోజులకుగాని పేపర్లు ఈ విషాదవార్త నందించవు. అందాక వసంత ఉత్సా హంగానే ఉంటుంది!

నాకు నిద్రరావటంలేదు. రాత్రి, గృహ ములో అతిథిలా, చీకటి తిష్టవేసుకు కూర్చుంది. రివ్వున చలిగాలి వీస్తున్నది. గాజుపలక మూసివేశాను. వర్షపుజల్లు గాజుపలకమీద పడుతున్నది.

బయట ఏవీ కనపడటంలేదు. దయ లేని మబ్బులు నక్షత్రాలని దాచేసినయి; గాఢంగా క్రమ్ముకుంటున్నయి. వర్షపు చప్పుడు తప్ప ఏమీ వినిపించటంలేదు.

త్రాగినవాడిలా తూలుతున్నది రాత్రి. ప్రియుపరిష్వంగలో మైమరచి ఉన్మాదిని ఐంది చీకటి. ఆ చీకటిని శిక్షించటానికి ఆకాశం క్రోధతీక్ష్ణలను ప్రసరింపస్తూంది.

మెరుపు వెలుగులో భయంకరమైన ప్రకృతి మరోరూపం కనిపిస్తున్నది. ఈ రూపం ఎంత గొప్పదని! ఎంతశక్తి వంతమైనదని. నా కనులముందు ఒక్క సారి ఆ విశ్వరూపం ప్రత్యక్షమైంది. చూడలేని గ్రుడ్డితనం న న్నావరించింది. ఇప్పుడే, ఈ క్షణంనుంచే ఇక్కడ ప్రకృతి పరిపాలన ప్రారంభమైంది.

ప్రకృతి ఉన్నట్లుండి గర్జించింది. దూరంగా ఎక్కడో పిడుగుపడింది. నా మనస్సు భయంతో విలవిల్లాడింది. గతా నుభవాల తెరలు క్రమ్మివేశాయి. ఇంత వరకు జీవితంలో సంతృప్తిని పొందాను. ఎదురుదెబ్బలు తగ్గల్లేదింతవరకు. వసంత నన్ను అనంతంగా ప్రేమించింది; ప్రేమి స్తూంది. తనమీద తనకున్న ప్రేమకన్నా నామీద ప్రేమ ఎక్కువ వసంతకు.

అలాంటి వసంతకు దూరంగా పోతు న్నాను. ఇంక కనిపించను. సాయంకాలం కాగానే వాకిట్లోకి వచ్చి నిల్చుంటుంది.

సన్నజాజుల పరిమళం నీరెండతో కలసి ఆమెను చుట్టుముడుతుంది. అనం తము, శూన్యము అయిన ఆకాశం తన నీలిమతో ఆమెను వెక్కిరిస్తుంది. రోజు వచ్చే చిలుక చెట్టుమీద వాలి ఏడుస్తూ తిరిగిపోతుంది. భారంగా అలసిపోయిన నేడు నిన్నలోకి జారుకుంటుంది దీర్ఘనిద్ర కోసం. నా కోసమని ఏ చరిత్రలూ వెదు కరు. వసంతకి నుదుటన తిలకం బదులు గుండెల్లో ఆరనిమంట వుంటుంది. ఆ ఒంటరి వసంత మీదనుంచి శిశిర వసం తాలు జారిపోతునే వుంటాయి. అదృ శ్యంగా ఆమెచుట్టూ, ఆమె ఆత్మచుట్టూ నానీడలోంచి నారూపం దృశ్యాదృశ్యంగా

కనిపిస్తూ వుంటుంది. గొంతుచించుకుని నే పిలిచే పిలుపులు వసంతకి వినపడవు! ఆ ఏకాకితనంలో దివారాత్రాలు ఉదయించి అస్తమిస్తయి. నిద్రపట్టని రాత్రుల్లో ఏడుస్తూవెలిగే దీపంతప్ప తోడుండదు.

తీరని ఈ వెలితి జీవితాంతమూ వెంబడిస్తుంది. శూన్యగృహం లాంటి జీవితంలో పిచ్చిగా తిరుగుతూ వుంటుంది వసంత; పిచ్చి వసంత!

నా జీవితం తన పర మనుకునే వసంత. నా కోసరం ఏ త్యాగమైనా చేయగల ప్రేమమూర్తి వసంత. ఆ వసంతకి దూరంగా నేను తప్ప మరెవరైనా పోగలరా?

"వెళ్ళకండి! ఈ వర్షంలో ఎందుకు? ఈ ఒక్క రోజు వెళ్ళకపోతే ఏమీ అవదు. మీ వంట్లో అసలే సరిగా లేదు. జ్వరంగా వుందంటే కొడతారా ఏం? వర్షంలో వెళ్ళకూడదంటారు," అంటూ ప్రతిమాలినఆక్షణం కళ్ళల్లో మెదల్తోంది.

ఆఖరుసారివసంత కన్నీరుతుడిచింది. మొదటిసారివసంతకళ్ళల్లోనీరుచిందింది.

"చలిగావుంది. స్వెటర్ వేసుకోండి, మఫ్లర్ కట్టుకోండి; వెళ్ళగానే ఉత్తరం వ్రాస్తారు గదూ! వెంటనే ఇల్లు చూడండి. నేనూ పాపా వచ్చేస్తాం. ఆ హోటలు తిండి తినలేరు;" ఎన్ని అప్పగింతలు!

ఈ చీకటి ఏ శూన్యంలో మాయమౌతోందో, నేనూ ఆ శూన్యంలోనే లీనం కాబోతున్నాను.

"బటానీలు, బాబూ బటానీలు,"

ఆలోచనలలో అణిగిపోయిన నా ఆత్మ ఒక్కసారి మేలుకుంది.

నా పిచ్చిఆలోచనలను బటానీలవాడు చెదరకొట్టేశాడు.

"ఇప్పు డెవరు కొంటారయ్యా, నీ సొదగాని. ఇంకోపెట్టె చూసుకో." మూలనున్న ముసలాయన గునిశాడు.

"నీ కెందుకయ్యా గొడవ. కొన్న వాళ్ళే కొంటారు." బటానీలవాడు తిరుగబడ్డాడు. ముసలాయన మరిమాట్లాడలేదు.

ఎదురుగా కూర్చున్నవ్యక్తి బటానీలవాడిని చురచురచూసి ఒదిగ్గికూర్చున్నాడు.

ఈ గోలకి పెట్టెలోనివాళ్ళు లేచారు.

"అమ్మోయ్, లేవ్వే. బటానీలు వచ్చినయి." చిట్టిచేతులతో లేపేశాడు తల్లిని.

"ఛీ, ఇప్పుడు తినకూడదమ్మా, జబ్బు చేస్తుంది;" తల్లి అడ్డగించింది.

"మరెప్పు డేంటి?" బిక్కమొహం పెట్టాడు.

"రేపు కొనిపెడతాను, తిందువుగాని. చెల్లికి పెడతావా, నువ్వే తింటావా?" మరిపించాలని చూసింది తల్లి.

"నేనే తింటా," మురిసిపోతూ అన్నాడు కొడుకు.

ఇంతలో చెల్లి అనబడే నాలుగేళ్ళ పిల్ల ఏడుపు సాగించింది.

"ఉఁ! ఉఁ. నాకు పెట్టట్ట. నా స్నేం చెప్పాదేం? అందర్నీ తినమనలా—"

"అబ్బ, పెడతాడులేవే, ఒక టేగొడవ, పడుకో. అర్ధరాత్రిపూట ఏంగోల బాబు."

ఆవిడ పడుకుందామని చూసింది. కాని వీళ్లు పడుకోనిస్తేగా!

"పోనీ ఇప్పుడు కొనుక్కొని రేపు తింటావేవే. ఏం కొనుక్కోనా?"

"ఇప్పుడు మంచివి ఉండవు - రేపు మంచివి వస్తయి."

బటానీలవాడు ఆవిడవంక చురచుర చూశాడు. "వేడివేడి బటానీలు. గిద్దా పది పయిసాలు."

మళ్ళీ అరిచాడు.

రైలు ఏదో వంతెనమీదనుంచి పోతున్నట్లుంది. ధన్ ధన్ మన్నది.

"అబ్బబ్బ! ఏంగొడవరా! ఆయనవస్తే బాగుండేది మీ అందిరికీ," అన్నది తల్లి.

కుర్రవాడు ఏడుపు లంకించుకున్నాడు.

"రాత్రిపూట ఎందుకు ఏడిపిస్తా వమ్మా పసివాడ్ని? కొను;" ముసలాయన సలహా. తల్లికి తప్పలేదు. పది పైసాలు పెట్టి కొని జేబులోపోసింది.

"ఈ పూట తిన్నావంటే కొడతా," అని వార్నింగ్ ఇచ్చి పడుకుంది.

తల్లి పడుకుందని రూఢి అయినాక ఒకటొకటే తీసి మెల్లగా నోట్లో వేసి కుని నమలటం మొదలుపెట్టాడు. నోరు తెరుచుకు చూస్తున్న చెల్లెలికి లంచం ఇచ్చి నోరు మూయించాడు.

ఇంత సేపు ఆ ఎదురుగా కూర్చున్న వ్యక్తి ఒదిగి కూర్చున్నాడు. బటానీల వాడు వెళ్ళాక సరిగా కూర్చుని "ఏ వెధవనీ ధమ్మెందుకు వీల్లేదు," అనుకున్నాడు మొలలో దోపుకున్న సంచిని గట్టిగా పట్టుకుంటూ. దానిలో ఏముందో తెలియక పోలేదు.

మరోమూల వృద్ధుడు చుట్ట వెలిగించి చిన్మయానందం పొందుతున్నాడు. పైన బెర్తుమీద ఎవరో నిద్రపోతున్నారు.

అదృష్టవంతులు!

ఈ విచిత్ర వాతావరణం ఇంకా ఎంత సేపు కొనసాగుతుందో? శ్రావణ మాసపు అర్ధరాత్రివేళ సర్వప్రపంచమూ జలమయమైన సమయంలో రైలు సాగిపోతోంది. తప్పదు. అది దానికర్తవ్యం.

రైలు వేగం హెచ్చింది. చెక్కిలికి చేయి చేర్చి మనసు దిటవుచేసికుని ఏ ఆలోచనలు లేకుండా కూర్చుందాం అని ప్రయత్నించాను. కాని భయం నా శరీరంలో విద్యుత్తులా ప్రవహిస్తోంది. ఈ భయం మృత్యువును ముందుగా చూపిస్తోంది. జీవితం, మరణం యొక్క కల అనిపించింది.

ఏది మిథ్య, ఏది సత్యం? తెలియటము లేదు. ఏదో అస్పష్టం, ప్రళయం వస్తున్న సూచన. వాయుకుమారులు అందమైన సృష్టిని ఛిన్నాభిన్నం చేయాలని చూస్తున్నారు. నా రక్తం వేడెక్కింది. ఈ చీకటి మా బ్రతుకుల్ని తనలోకి లాక్కోవాలని చూస్తున్నది. ఒక్కసారి ప్రపంచంతో నా సంబంధం తెగిపోయినట్లయింది.

ఇదంతా నాభయమేనేమో? రైళ్ళన్నీ

పడ్తున్నయ్యా ఎందరు ప్రయాణం? చేయటం లేదు? వారికి లేని భయం నాకా? ఇలా సంతృప్తి పడటం నాకు చేతకాదు. ఈ భయం నా జీవిత పునాదులనుండి నిర్మాణం అయింది. నాలో ఒక భాగమైంది. నా జీవితానికి నేనే ప్రేక్షకుడినైనాను ఇప్పుడు. సర్వనాశనమైన ఈ భయం ప్రపంచంలో ఎవరికైనా వుంటుందా? ఈభావసమాధి కంతమెప్పుడు? "మాస్టారు, టైమెంతైంది?"

నా చూపులు ప్రకృతినుండి విడివడినయి. చూసి చెప్పాను.

అతని చర్య విచిత్రంగా వుంది.

ఇప్పటికి ఏ డజనుసార్లో సోపు తీసికుని ముఖం కడుక్కొని వచ్చాడు. ఓ పదిసార్లు క్రాపు దువ్వుకునివచ్చాడు.

ఏమిటి కథ అనుకున్నాను.

"ఎక్కడికి పోతున్నారు?"

నావంకచూసి ముసిముసిగ నవ్వాడు.

"అలాపోతున్నాను."

చప్పగా వుంది జవాబు. అతనికి వుండవచ్చు. నామాట పూర్తి కాకుండానే ఎత్తుకున్నాడు.

"మా ఆవిడ దగ్గరికి. అయిదేళ్ళ అనంతరం పోతున్నాను. అబ్బ! వింటానికే భయంగాలేదూ ఐదేళ్ళంటే? ఏంచేస్తాం? చదువు - చదువు! పెళ్ళి చేస్తారు, వద్దన్నకొద్దీ. ఆవి డ్నక్కడా న న్నిక్కడా-"

"ఏవూరు?"

చెప్పాడు.

"ఫలాన జయరామారావు తెలుసా?" అన్నాడు, అతనేదో గొప్పవాడైనట్లు.

"తెలీదు."

"పోనీలేండి. అతను బావమరది."

తలూపి వూరుకున్నాను.

అతగాడు మొదలుపెట్టాడు.

తనపెళ్ళి ఎలాజరిగిందీ, పెళ్ళిలో ఎలాంటి వేషాలువేసిందీ - అన్నీను.

అతని వివాహంమీద నా కేమీ ఇంట్రస్టులేదు. కొంచెం విసుగుకూడ కల్గింది. వింటున్నట్లునటిస్తూకూర్చున్నా. నిజానికి అతన్ని చూస్తే జాలివేస్తుంది. అత నేం చేశాడు?

జీవితాన్ని కళామయం చేసుకోవాలని చూస్తున్నాడు. కల్పనలోని అందాన్నీ ఆనందాన్నీ వాస్తవంలో చూడాలని ప్రయస్తున్నాడు. ఆమె సౌందర్యంలో పూర్తిగా లీనమై మత్తుగా మాట్లాడుతున్నాడు. ఉన్నట్లుండి నా మనస్సు అతని మనస్సునుంచి ఎగిరిపడింది. అత నెప్పుడు ఆపాడో కూడ నాకు తెలీదు.

ఇది నిద్రలేని రాత్రి. కసిగా నుసిగా నిశి రాలుతున్నది. ఈ జగదృశ్య సౌందర్యము ఎంతోగొప్పది. ఈ ఏకత్వంలో అన్నీ మరిచిపోయాను. నా నిరీక్షణ ఇంకా ఎంత సేపో నాకు తెలీదు. జీవిత స్మృతులలోని ఆనందపు పరిమళాన్ని గాని, విషాదస్వరాన్నిగాని తడమటానికి ఈ క్షణమే మిగిలింది.

ఈ చెట్లసందునుండి, ఈ కొండల మాటునుండి మాతోపాటు సమానంగా మృత్యువు పొంచిపొంచి నడుస్తున్నది. ఏ మలుపు తిరగ్గానేనో అందర్నీ చంపేస్తుంది. కాని ఒకటే తృప్తి. ఈ మరణము నాకు అపజయంకాదు.

నా హృదయంలో సర్వవినాశకరమైన జ్వాల రగులుతున్నది. వేదనతో నా కళ్ళవెంట నీళ్ళు కారుతున్నాయి. ఆర్తుడనై ఒక్కసారిగా "రైలాపండి! పడిపోతున్నది!" అని అరవాలనిపించింది. కాని ఏదో మహాబలమైన శక్తి నా నోరు నొక్కేసింది. నా గొంతు మూగబోయింది. నా అహం ఈ భయం చుట్టూ పరిభ్రమించి దానిలో ఐక్యం అయింది. ఈ భయానికి ప్రేరణ ఏమిటి? ఈ విప్లవాత్మకమైన భారం నాగుండెల్లో ఎలా ప్రవేశించింది. ఎలా దీని నుండి విముక్తి? భ్రమ మిధ్యే కావచ్చు. ఐనా ఈభయం నా హృదయాన్ని కోతకోస్తున్నది. నా నరాలు వణుకుతున్నయి! నాకు మతిస్తిమితం తప్పిపోతున్నది.

రైలు వేగం తగ్గింది.

రాత్రి శలవ తీసికుంటున్నది.

ప్రకృతి మేలిముసుగు సవరించుకుంటున్నది.

దూరంగా ఆత్మల్లా దీపాలు మినుకుమినుకు మంటున్నాయి.

అబ్బ ఎంతబాధ పడ్డాను! నా భయం కాలచక్రాన్నికూడ వేగంగాత్రిప్పిందేమో?

ఎందుకో రైలాగిపోతున్నది. ఆత్మలు దగ్గరకు వచ్చినయి. రైలాగిపోయింది.

ఎందుకు? ఎందుకు?

ఏదైనా ప్రమాదం జరిగిందా! బయట గోల. కిటికీలోంచిచూశాను. ఏదోస్టేషను.

అమ్మయ్య; కాసేపు ఆలోచనలకు-విశ్రాంతి. తల బ్రద్దలయిపోతున్నది. కళ్లు నిదురలేక మండుతున్నయి. కాస్త టీ త్రాగివస్తే నైనా బాగుండును.

బాగ్ తీసికుని క్రిందికి దిగాను.

"ఏం స్టేష నిది?"

పోర్టరు చెప్పాడు.

"రై లెంతసేపాగుతుంది?"

"క్రాసింగుంది బాబయ్యా! అరగంట ఉంటుంది."

"టీ దొరుకుతుందా ఇక్కడ?"

"ఆఁ! అప్లాట్‌ఫారమ్‌మీద వుంది. వెళ్ళిరండి." నేను వెళ్ళేసరికి టీ రెడిగా వుంది. ముఖం కడుక్కొని టీ త్రాగి వచ్చాను. బయట ప్రకృతి కళ్లు తెరిచింది ప్రసన్నంగా. తూర్పుదిక్కు పావురాల కూతలతో ప్రసవవేదన పడుతోంది.

మనసు కాస్తతేలిక పడింది.

తిరావచ్చిచూస్తే రైలులేదు.

"రైలు వెళ్ళిపోయిందా?"

"అవును, చాలసేపయింది."

స్టేషనుమాస్టరు చెప్పాడు.

"అదేమిటి? అప్పుడే-"

"అవును, ఇక్కడ అయిదునిమిషాలే వుండేది."



"ఇందాక పోర్టరు అరగంట వుంటుం దని చెప్పాడే."

"వాడిమొహం! వాడి కేం తెలుసు? ఏవూరు పోవాలి?"

చెప్పాను.

"దాని కేం ఫరవాలేదు. పదిగంటలకి బస్సువస్తుంది ఇక్కడికి. దానిలో వెళితే సాయంకాలం చేరుతారు. ఆ వెయిటింగ్ రూమ్‌లో కూర్చోండి."

ఇంక చేసేదేంలేదు. పదింటిదాకా కూర్చోవాలి. ఈ నిరీక్షణ తప్పదు. వెయిటింగ్ రూంలోకి పోయి పడుకున్నాను. వేదనకి స్వస్తి. అలసిన మనసుకు విశ్రాంతి!

రెండు నిమిషాలుకూడ కాలేదు.

ఒకటేగోలా. కేకలు.

"యాక్సిడెంట్! ట్రైన్ యాక్సిడెంట్..."

స్టేషన్ మాస్టరు హడావుడిగా పరుగెడుతున్నాడు.

నా గుండె స్పందించటం ఒక్కసారి ఆగిపోయింది.

"యాక్సిడెంటా?"

"అవునుబాబు, ఇక్కడే, మూడు మైళ్ళ దూరంలో పడిపోయింది."

నేను ఆ చోటుకు పరిగెత్తాను.

భీభత్సంగా ఉంది ఆ ప్రదేశం!

అగ్ని కణాల్లాంటి పెదవులతో ఒక్కసారి స్పృశించింది ఈ సంఘటన నా మనసుని. నారక్తం వేడెక్కింది!

ఒకసారి కళ్లు బైర్లు క్రమ్మాయి. నాకళ్ళముందు ఇక్కడే మానవులు చనిపోతున్నారు. ఒక్కరూ ఇద్దరూ కాదు. వందల్లో! ఘోరంగా, భయంగా, బాధగా.

రక్తం ఏరులై ప్రవహిస్తోంది!

అకాశం, చూడలేక మబ్బులచేతుల్తో ముఖం దాచుకుంది.

కాలం హోరున ఏడుస్తోంది!

చూడలేకపోతున్నాను. ఏవో భావాలు మనస్సును కోస్తున్నయి. నా మనస్సు శకలాలయి పోతున్నది వాళ్ళందరి మధ్యకూ వెళ్ళి నిల్చున్నాను. మృత్యువు శ్వాసలు నాకు తగులుతున్నాయి.

కొందరికాళ్లు, కొందరిచేతులు, కొందరి తలలు, పోయినయి. హాహాకారాలు, ఏడుపులతో నిండిపోతోంది. హృదయం చిట్లి రక్తం కారుతున్నది.

నా చూపులు అందరిమీదా ప్రసరించినయి. దూరంగా – అతనే ఆ పసివాడు– తల్లితో పోట్లాడి బటానీలు కొనిపించినవాడు, ఆ శిశుస్వప్నంలో బహుశ ఒకసారి 'రేపు లేదు' అని అనిపించి వుంటుంది. కాని మాయ అతన్ని కప్పేసింది. అది భాష కందని మానసిక పరిణామం. నన్ను రాచుకుంటూ పోయి మృత్యువు ఆ పసివాడి జీవితపు తాళాన్ని తీస్తుందని ఎవరికి తెలుసు? అశలలో ఆనందం వుండవచ్చు. కాని ఈ ఆశ భస్మరాసేనన్న సంగతి వాడి లేతహృదయానికి తట్టి ఉండచ్చు. అందుకే అల్పమైన అనందాన్ని క్షణకాలం అనుభవించి ధీమాగా మృత్యువు చేయి పట్టుకున్నాడు. అది అమాయకత్వంవలనకూడా కావచ్చు కాని అతని ఉనికిని స్థిరపరచుకున్నమాట నిజం. వణుకుతున్న చేతులతో వాడి జేబు వెదికాను.

ఒక్కసారిగా బిలబిలమంటూ బటానీలు క్రిందకు దొర్లి పక్కన నవ్వినై.

అన్నదగ్గర పోట్లాడి లంచం పుచ్చుకొన్న చెల్లెలు యింకా అన్నని విడిచిపెట్టలేదు. తెల్లవారితే ఆయన వస్తారు సగంభారం వహిస్తారు అనుకున్న ఆ ఇల్లాలు తానే సగంభారం తగ్గించివేసింది.

ఎందుకో?

ఆ ఎనిమిది నెలల పసివాడు నిర్జీవమైన పెదవులతో తల్లిరొమ్ముతో రహస్యాలు చెబుతున్నాడు. నిర్జీవమైన ఆమెలోని సజీవ మాతృత్వం అ పసివాడ్ని పొదివి పట్టుకుంది.

కళ్ళు తిరిగినయి!

ఎటుతిరిగినా ఒకేదృశ్యం.

ఆ యువరసికుడు ఏ దేవకన్యదగ్గర తన రసికత్వాన్ని ఒలకబోస్తాడోగాని వెళ్ళిపోయాడు. పాపం అయిదేళ్ళ తరువాత భార్యను చూస్తాననుకున్నవాడు శాశ్వతంగా ఆమెకు దూరమైనాడు. పాపం అతనిభార్య తీయని కలలతో అతనికోసరం ఎదురుచూస్తూ వుంటుంది. ఇంకేముంది? జీవితమంతా మిగిలిన ఈ ఒకపీడకలతో మెలుకువతోకూ రోొవాలి. తిరిగిరాని అతనికోసం ఆమె అన్వేషణ.

ఈ నిండుచీకట్లో మిణుగురు పురుగును పట్టుకుని దారి చూసుకోవలసిన దుర్గతిపట్టింది. మెలుకువరాని పీడకల ఆమె జీవితం. ఈ ఖాళీని ఎవరూ పూడ్చలేరు. ఆమెప్రేమ వేదనామయమై,

ఆమె రక్తంలో కలసి అంతర్వాహిని అవుతుంది. ఇంతకన్నా దారుణ శిక్ష మరేముంటుంది! విధి నాట్యం చేయటానికి ఆమెజీవితం చక్కని వేదిక అయింది. అతని ప్రేమ ఆమె కందదు.

చుట్టలో చిన్మయానందం అనుభవించిన వ్యక్తి, డబ్బుకీ ప్రాణానికీ లంకెపెట్టుకున్న వ్యక్తీ అంతిమయాత్ర కలిసే చేశారు. కాని దురదృష్టం ఏమిటంటే ఆ ధనం అతన్ననుసరించి వెళ్ళ లేదు!

అక్కడుండలేక వచ్చేశాను!

వైద్య సహాయం జరుగుతోంది. నలుగురైదుగురు విలేఖరులు ఈ విషాద దృశ్యాన్ని ఫొటోతీయటంలో మునిగారు.

"ఉండండి, ఇప్పుడే ఈ వార్త పంపకండి. వాళ్ళవాళ్ళు దీన్ని భరించ లేరు. కొన్ని వందల గృహాలలో దీపాలారిపోతాయి. వారికి లోకమంతా చీకటిగానే కనిపిస్తుంది. ఈ కాస్తసేపే ఆనందం, తమవాళ్ళు వస్తారని ఆశా, ఆ ఆశలో ఆనందం-తృప్తీ.

రేపే వార్త పేపర్లలో వచ్చేస్తుంది. రాక తప్పదు. వాళ్ళకు తెలియక తప్పదు. ఎండమావులలో ఏమీ లేదని తెలుసుకోక తప్పదు వాళ్ళకి. ఆరిపోయిన దీపం లాంటి జీవితంతో చివరివరకు బాధపడక తప్పదు.

ఈ అనుభవం నా జీవితపు ఎడారిలో మంచుబిందువై ఓ నిముషం నవ్వి ఆరిపోదు. నా ఆత్మలో, నా హృదయంలో గాఢంగా చెరగని ముద్ర వేసికుంది ఈ సంఘటన. దీని ప్రకంపన తీవ్రమైనది.

భగవాన్! ఏమిటి నీ ఆట. నీ చదరంగం బల్లమీదికి వీళ్ళని విసిరి ఎలా మారుస్తావు? నీకళామయ చిత్రంలో ఇది ఓ అర్థంలేని రంగు అనుకోమంటావా? ఎంత కఠినం నువ్వు? చావు - బ్రతుకు కాలానికి రెండువైపులు! నా కళ్ళల్లోంచి ఆఖరి కన్నీటిబొట్లు రాలాయి. తల వంచుకుని బయలుదేరాను. దేవుని మిధ్యా వ్యక్తిత్వం బయటపడింది ఈ సంఘటనతో. నా గుండెబరువు ఇంకా తగ్గలేదు. నా చుట్టు సాలెగూడు కట్టుకున్న చరిత్ర నన్ను పరిహసించింది.

ఏమైంది?

నేను తప్ప అందరూ మరణించారు. నాతో ఇంత క్రితం దాకా చీకూచింతా లేకుండా ప్రయాణం చేసినవాళ్ళు. వడ్డించిన విస్తరిని జీవితం చేసుకున్న వాళ్ళు, మరణాన్నినిర్లక్ష్యం చేసినవాళ్ళు.

ఈ క్షుద్ర జాగృతికి అంతమెక్కడ? లేదు. ఎప్పుడు లేనేలేదు. నా ఆత్మలో ఈ రకం విషాదంగా విన్పిస్తూనే వుంటుంది. ఎప్పుడైనా ఏకాకిగా ప్రకృతిలోకి వెళ్ళినప్పుడు ఆకాశంలోని నీలిమలోంచి సన్నని సన్నాయి స్వరం మల్లే నా ఆత్మని స్పృశించి మళ్ళీ ఆ నీలిమలో లీనమైపోతూ వుంటుంది.

దూరంగా పోతున్న కొద్దీ ఆ శోకం క్రమక్రమంగా తగ్గి, పుట్టినమానవుడు పెద్దవాడై వృద్ధుడై తుదకు మరణించి నట్లు, ఉచ్ఛస్వరంలో వినిపించి క్రమంగా హీనమై తుదకు నిశ్శబ్దంలో అంతరించి పోయింది. నా మనస్సు ఆవేశ తరంగాల మీద నృత్యం చేస్తున్నది.

స్టేషన్ చేరుకున్నాను. ప్రక్క పోస్టాఫీసు తప్ప అంతా శూన్యంగా వుంది. ఈ పోస్టాఫీసునుంచే దేవునిపిలు పులు వెళ్ళివుంటాయి వాళ్ళకి. అందుకే హఠాత్తుగా జీవితంలో ఉత్తమమైన బహుమతిని అందుకున్నారు. చప్పున మా తాతగారనే మాట గుర్తువచ్చింది.

'జన్మంతా ఒక పవిత్రయజ్ఞం.
చావందులో పూర్ణాహుతి.
జన్మకు సత్యం చావొక్కటే-'

పోస్టాఫీసు చూసేసరికి ఇల్లు గుర్తు వచ్చింది. ఈవార్త వసంత చూస్తుంది - చూసి - శూన్యగృహంలాంటి తన జీవి తంలో, దీపం వెలిగించుకోలేని స్థితిలో తన ఆత్మకందని పిలుపుకోసరం - విల పిస్తూ వుంటుంది.

దీపం వెలిగించాలి; తప్పదు. మళ్ళీ మృత్యువు తలుపు తట్టేంతవరకు ఈ ఇంట్లో వుండాలి.

"నేను బ్రతికేవున్నాను వసూ, నీ కోసరం, పాపకోసరం-" అని ఉత్తరం వ్రాయాలి.

కార్డు కొన్నాను. పక్కన బెంచీమీద కూర్చుని వ్రాయబోతుంటే ఒక్కసారి ఆ సంఘటన కళ్ళల్లో మెదిలింది.

"వణుకుతున్న చేతులతో వ్రాసి పోస్టు చేశాను.

"నీవు క్షమించరాని మహాపరాధం చేశావు." కాని అడ్రసు వ్రాయలేదు. వ్రాసినా అది పోదు.

శూన్యమైన ప్లాట్‌ఫారంమీద ఒంట రిగా నిలబడ్డాను. ఆకాశంలో ఎర్రని మంటలు లేచాయి. ఆ మంటలకు మధ్యగా మృత్యువు వెళ్ళిపోతున్నది. ఒక్కసా రిగా మృత్యుదేవత తన బొడ్లోంచి తాళపుచెవులగుత్తి తీసి ఇందరి జీవితపు తాళాలు తీస్తుందని ఎవరికైనా తెలుసా? మృత్యువుది ఇంత మృతసంస్కృతి అని ఎప్పుడైనా ఊహించానా?

(అంకితం: పసివాని ఆత్మశాంతికి)

———




[జగపతిగారింట్లో విందుకు ఇంద్రాణితోసహా - జానకీ శ్రీరాంలు మినహా - అందరూ వెళ్ళారు. విందు అనంతరం దేవరాణి తన దివ్యగానామృతంతో అందరినీ ముగ్ధులను చేసింది. కిరణ్‌కు ఇష్టమైనపాట కావడంవల్ల మరీసంతోషించాడు.

తరువాత కొద్దిరోజులకే ధర్మారావుగారి యింటిల్లిపాదీ సంప్రదించుకొని రాయుడుగారు కోరినప్రకారం దేవరాణిని కిరణ్‌కు ఇచ్చి వివాహం సల్పడానికి నిశ్చయించుకొని తాంబూలాలు పుచ్చుకోదల్చారు. శ్రీరాంమాత్రం భార్య జానకి ప్రోద్బలంవల్ల అయిష్టత తెల్పాడు.] — ఇక చదవండి.

"ఏమిటి జానకీ నన్ను వేధిస్తావ్? నే నేం చేయగలను చెప్పు? అక్కడికీ నేను చేయగల ప్రయత్నం చేశాను కదా!" కొంచం విసుగ్గా, కొంచం అనునయంగా అన్నాడు శ్రీరాం.

"అది చాలదు. ఇంకా చేయగలిగిందంతా చేయాల్సిందే!" ఖండితంగా అన్నది జానకి. "వాళ్ళు తాంబూలాలు కూడా తీసేసుకుంటే ఇక మనం చేయగలిగింది వుండదు. త్వరలోనే అడ్డుపడాలి. ఈ పెళ్ళి జరగడానికి వీల్లేదు. కిరణ్‌కు నా చెల్లెల్నే చెయ్యాలి."

"అది సరే, తాంబూలాలు తీసుకున్నా ఏం ఫర్వాలేదు. ఉపాయముంటే పీటల మీది పెళ్ళికూడా చెడగొట్టవచ్చు;" శ్రీరాం జవాబు.

జానకి ముఖం వికసించింది. "అలా అన్నారు బాగుంది. ఇక ఆప్రయత్నంలో వుండండి."



"సరే నువ్వుకూడా ఆలోచించు ఉపాయం."

అక్కడినుంచి సరాసరి తోటికోడలు వనజ గదిలోకి వెళ్ళింది జానకి. జానకి వనజలు తోటికోడళ్ళేగాక అక్కచెల్లెళ్ళ కుమార్తెలు కూడా! అందుకే యిద్దరూ చాలా దోస్తీగా వుంటారు.

"ఏమిటి? క్కయ్యా? నువ్వు ఇలా ప్రవర్తిస్తావని నే నెప్పుడూ అనుకోలేదు;" గదిలో ప్రవేశిస్తూనే నేర మారోపించింది జానకి.

"ఏమిటి జానకీ? ఏమిటీ నీ కోపం?" వనజ ప్రశ్న.

"కిరణ్‌కు మన్మ ఇంద్రాణిని చేద్దామని నేనూ, నాన్న తాపత్రయపడ్తున్నాం కదా! మధ్యన దయ్యంలాగా ఈ దేవరాణి అడ్డు వచ్చింది. నీకు మాత్రం తెలియదా?''

"తెలుసు; అయితే?"

"ఎంత తేలికగా అడుగుతున్నావ్?" ఖస్సుమన్నది జానకి. "నా బాధ నీది కాదా? నా తాపత్రయం నీది కాదా? నేను వెళ్ళనిదాని యింటికి నువ్వు విందుకు వెళ్ళడంలో అర్థమేమిటి?"

"వెఱ్ఱిదానా!" తేలికగా నవ్వేసింది వనజ. "నీకు వట్టి కోపమే కాని, ఏమీ తెలియదు. తోటి కోడళ్ళం యిద్దరం వెళ్ళకపోతే చూచేవా ళ్ళేమనుకుంటారు? ఇద్దరూ ఒకటయ్యారనుకోరూ? మన అభిప్రాయాలు మనలో వుండనీ; పైకి మాత్రం తెలియనీయకూడదు; చేసేపని గుట్టుగా చెయ్యాలి."

"అంతే నంటావా?"

"ఊఁ! మరేమి టనుకున్నావ్? అదీకాక యిద్దరం వెళ్ళకపోతే అక్కడేం జరిగిందో మన కెలా తెలుస్తుంది? అందుకే నేను వెళ్ళాను."

"మంచిపని చేశావ్. ఏం జరిగిందేమిటి?" కుతూహలంగా ప్రశ్నించింది జానకి.



"ఏమున్నది మామూలు భాగోతమే. వీళ్ళను వాళ్ళు పొగడటం, వాళ్ళను వీళ్ళు శ్లాఘించటం. ఆ తర్వాత ఆ వగలాడి వీణవాయిద్యం. అబ్బ, ఎన్ని ఒయ్యారాలు ఒలకబోసిం దనుకున్నావ్!"

"అయితే మొన్న గంగన్న చెప్పినదంతా నిజమే నన్నమాట! ఛీ ఛీ, అయినా అదేం పాడుపద్ధతే? పరాయివాళ్ళ ఎదర ఆ గానసభ లేమిటి?" అసహ్యించుకుంది జానకి.

ఆ విద్యలతోటీ, వన్నెచిన్నెలతోటీనే కదా మరి, అందర్నీ ఆకట్టుకొంటూన్నది! అయినా జానకీ, నాకు తెలియ కడుగుతాను—ఎందుకు మన కింత శ్రమ చెప్పు? దాని సంగీతం మైకంలో పడిపోయిన వాడినీ, వాడి మనసునూ

సక్రమంగా [illegible]

# ఫోర్‌హాన్స్ టూత్‌పేస్టు పనుదిగుళ్ల బాధలను దంత క్షయమును నిలుపును

**ఇగుళ్ల బాధలను దంతక్షయమును నిలుపుటలో ఫోర్‌హాన్స్ టూత్ పేస్టు సాధించిన అద్భుతమైన ఫలితాలను గూర్చి చిన్నా పెద్దా అనేభేదం లేకుండా అయాచితంగా చేసిన ప్రశంస లెలావున్నయో చదవండి.**



• "ఫోర్‌హన్స్ టూత్ పేస్టును, ఫోర్‌హన్స్ టూత్ బ్రష్‌ను సక్రమంగా ఉపయోగించే ఒకడిని నేను. అహ్లాదకరమైన వాసనతో కూడి అది నిజంగానే చాలా ప్రభావమైనది ఫోర్‌హన్స్ టూత్ బ్రష్ సహాయంతో ఫోర్‌హన్స్ టూతా పేస్టు వేసి తోముకోవడము మొదలు పెట్టినప్పటినుంచీ నాకెలాంటి పంటిరోగములు కనిపించ లేదు." ఎస్. ఆర్. పి. దేవ్‌లాలి



• "పటుతరమైన మీ ఫోర్‌హన్స్ టూత్ పేస్టు అత్యంత తృప్తికరంగా నా యిగుళ్ళ సమస్యలను నివారించినదని తెలుపుటకు నాకెంతో ఆనందముగావుంది ఇప్పుడు మా యింటిల్లిపాదీ ఫోర్‌హన్స్ పైననే ఆధారపడి వున్నారు."

ఎస్. ఆర్. హోరా

• ఈ ప్రశంసా పత్రాలను జెఫ్రీ మేనర్స్ అండ్ కంపెనీ వారి యే కార్యాలయములోనైనా చూడ వచ్చును.

## ఫోర్‌హన్స్ — ఒక దంతవైద్యునిచే సృష్టించ బడిన టూత్ పేస్టు

సరియైన పంటి జాగ్రత్తకోసం ప్రతి రాత్రి, ప్రొద్దుటా ఫోర్‌హన్స్ టూత్‌పేస్టును, ఫోర్‌హన్స్ డబుల్-ఏక్షన్ టూత్‌బ్రష్‌నూ వాడండి...మరియు మీ దంత వైద్యుని వద్దకు నియమాను సారము వెళ్లండి.




ఉచితం! "పళ్లు, ఇగుళ్లను గురించి తీసుకో వలసిన శ్రద్ధ" అనే రంగుల చిన్న పుస్తకం ఇంగ్లీషు, తెలుగు భాషల్లో లభిస్తున్న యీ చిన్న పుస్తకము కావలసినయెడల యీ కూపన్‌ను 10 పైసల తపాలా బిళ్లతో పాటు (తపాలా ఖర్చుల నిమిత్తం) మేనర్స్ డెంటల్ అడ్వయిజరీ బ్యూరో, పోస్టు బ్యాగ్ నంబరు 10031, బొంబాయి - 1కి పంపండి.

పేరు ..................................................

చిరునామా ..................................................

..................................................

భాష ..................................................

Y-11

ఇంద్రాణి మీదికి త్రిప్పగలమా? అయినా, కిరణ్ చేసుకోనంత మాత్రాన ఇంద్రాణికి మరి పెండ్లే కాదని భయమా? ఇంద్రాణి కేం లోటు?''

''ఓస్! అంతవరకేనా అక్కయ్యా నువ్వు ఆలోచించింది? అయితే నీ కింతవరకూ అసలువిషయం తట్టనే లేదా?"

"ఏమిటది?"

రహస్యంగా, నెమ్మదిగా చెప్పింది జానకి: ''ఇంద్రాణికి మహా యింతోటి మొగుడూ మరెక్కడా దొరక్కపోతాడని కాదు నా భయం; ఊరికనే ఆ విషయం అడ్డుగా పెట్టాను...అంత చదువూ, అందం, సంగీతం, ఐశ్వర్యం, అన్నీ వున్న దేవరాణి ఈ యింటికి కోడలై మనతో పోటీకి వస్తే మన మేం కనిపిస్తాం దాని ముందు. ఇక అందరూ దాన్నే గౌరవిస్తూ, పొగడ్తూ, దేవతను చూచినట్టు చూస్తారు. దానిముందు మనం ఎంత అల్పంగా కన్పిస్తాం? కాని నలుగురికీ మన అసలుఅనువు ఏమాత్రం తెలియకుండా నా పట్టుదల అంతా ఇంద్రాణి పెళ్ళిమీద కేంద్రీకరించినట్టు కన్పిస్తున్నాను, అంతే.''

కొద్దిసేపు మాట్లాడజాలని వనజ నోరావలించింది; "నిజమే సుమా!!" అంటూ కళ్ళు పెద్దవిచేసి, బుగ్గలు నొక్కుకుంది భయాశ్చర్యాలతో. "ఇంతవరకూ నా కా సంగతి తట్టనేలేదు. అయితే, ఈ విషయమై గట్టి ప్రయత్నమే చెయ్యాలి. ఇక ఉపేక్ష చేయరాదు!''

# 10

ఆదిత్య తాపం తగ్గి మెల్లమెల్లగా సంధ్యాశోభ వికసిస్తూన్నది. మలయపవనుని బాహువులలో ప్రకృతి అనిర్వచనీయానందం అనుభవిస్తూ ఊయల లూగుతున్నది. సౌమ్యహృదయ, సౌజన్యమూర్తి, సౌందర్యప్రతిమ అయిన దేవరాణి తలంపుతో కిరణ్ హృదయం ఉబ్బుత లూగుతున్నది. శాశ్వతంగా గుండెలలో నిలచిపోయిన ఆమెయొక్క వీణానిక్వణం అతడి హృదయతంత్రులను సున్నితంగా మీటుతూ తీయగా ఆహ్వానిస్తూన్నది.

ఆసుందర వాతావరణంలో ఒక్కసారిగా హృదయరాణిని చూడాలనే కోర్కె బలవత్తరమై ఉరకలు వేయించసాగింది కిరణ్ అంతరంగాన్ని. కాని...సంకోచం వెనక్కు లాగుతూన్నది. నవ్వుకున్నాడు తనలోతాను. 'ఈ వివాహప్రసక్తి లేక మునుపే నిస్సంకోచంగా వెళ్ళివచ్చేవాడిని. కాని, ఇప్పుడు—ఆమె నాకు వాగ్దత్తమైనప్పటినుండీ ఎవ రేమనుకొంటారో ననే సంకోచం కలుగుతూన్నది!'

తీయని తలపులతో త్వరత్వరగా స్నానాదులు ముగించి, సీటుగా తయారవ్వసాగాడు కిరణ్. అంతకుపూర్వమే భర్తతో కలిసి పథకం తయారుచేసుకొన్నది జానకి. తెల్లని దుస్తులతో, చలువ కళ్ళద్దాలతో, చేతిలో ఒక గ్రంథంతో నవ మన్మథునిలా మెరసిపోతూ బయల్దేరి, మేడమెట్లు దిగుతూన్న కిరణ్‌కు ఎదురు వచ్చింది జానకి.

''ఎక్కడికి చినబాబూ?" నవ్వుతూ ప్రశ్నించింది.

కిరణ్ సమాధానం చెప్పలేదు. ఆ రోజున రాయుడు గృహానికి విందుకై వెళ్ళే ముందు జరిగిన తీవ్ర సంభాషణానంతరం తిరిగి యివే మాటలు ఇద్దరి మధ్యనా.

"ఎక్కడికి చినబాబూ? మాట్లాడరేం?" నవ్వుతూనే తిరిగి రెట్టించింది జానకి.

"ఎక్కడికో నేనే చెప్పాల నెక్కడుంది వదినా? యుక్తి మీకే తెల్సుగా? గంగన్న మీ చేతిలో మనిషి!" అంటూనే చకచకా వెళ్ళిపోయాడు, నివ్వెరపోయిన జానకి తిరిగి మాట్లాడే లోపుగానే.

కావి గేటు దాటుతూండగా, ఇంద్రాణి ఆపుజేసింది అతడిని. గేటు ఆర్చీమీద ప్రాకిన మధుమాలతీ పూలను అతిప్రయత్నంతో కోయడంలో నిమగ్నమైవున్న ఆమె, "బావగారూ! ఎక్కడికో వెళ్ళిపోతున్నారే!" అంటూ పలకరించింది.

"ఔను, ఏం?" అగి చిరుదరహాసంతో అడిగాడు కిరణ్.

"ఏం లేదు. మనమంతా సినిమాకు వెళ్తున్నట్లుగా అక్కయ్య చెప్పింది? మీరే ప్రోగ్రాం వేశారట?"

"నేనా?" ఆశ్చర్యపోయాడు కిరణ్.

"ఆహా, తమరే! నాకు తెలీదనుకుని అబద్ధాలు చెప్పకండి మళ్ళి." ఏమీ తెలియని ఇంద్రాణి అమాయకంగా మాట్లాడసాగింది. "నేను రాణిఅక్కయ్య దగ్గరకు వెళ్ళబోతూంటే — 'అక్కడలేదు. బహుశః, వస్తే ఆమే ఇక్కడకు వస్తుంది." అన్నది అక్క. మీరు త్వరలోనే మళ్ళీ ఉద్యోగానికి వెళ్ళిపోతున్నారట. అంచేత అందరం కలసి సరదాగా సినిమాకు వెళ్ళాలని ప్రోగ్రాం వేశారు— నేను ఎరుగుదును. ఇప్పుడు మీరు రాణి అక్కనుకూడా తీసుకొచ్చేందుకు వెళ్తున్నారు కదూ?"

జానకి ఎందు కిటువంటి వల పన్నుతున్నదో అర్థంకాక ఆలోచిస్తూన్న కిరణ్, ఇంద్రాణికి సమాధానం చెప్పలేకపోయాడు.

అంతలో జగపతే అటుగా వచ్చి, "ఏమిటి, పెద్ద సమస్యలో పడ్డట్టుగా పెట్టారు ముఖాలు?" అనడిగాడు నవ్వుతూ.

"ఏమీ లేదండి," అంటూ నవ్వేశాడు కిరణ్.



కాని క్షణాలలో అసలు విషయం గ్రహించగలిగిన ఇంద్రాణి టకీమని జవాబు చెప్పింది జగపతికి: "మేమంతా సినిమాకు వెళ్తున్నాం, రమ్మంటే రావటంలేదు బావగారు." ఫిర్యాదు చేస్తున్నట్టు చెప్పింది.

ప్రయాణానికి సిద్ధంగా కారువచ్చి గుమ్మంలో విల్చొంది. అందుండి దిగిన శ్రీరాం లోనికి వస్తూ, అక్కడే నిలబడిన తండ్రినీ, తమ్ముడినీ, ఇంద్రాణినీ ఒక్కక్షణం పరకాయించి చూచాడు.

తమ్ముడితో అన్నాడు : "అన్నట్లు...చెప్పడం మఱచాను చినబాబూ ! ఇంద్రాణి రేపు వెళ్ళిపోతుందట; ఇవ్వాళ అందరం సరదాగా పట్నం పోయి సినిమా చూచివద్దాం."

అసలే ఆశ్చర్యంగావున్న కిరణ్ మరింత విస్మయం జెందాడు. తాను వెళ్ళిపోతూన్నట్టు ఇంద్రాణికి తానకి చెప్తే, ఇంద్రాణి వెళ్ళిపోతూన్నట్టు అన్న శ్రీరాం తనకు చెప్తున్నాడు ! ఇందు ఏది నిజం ?' అందుకే సంశయనిర్మూలనకై ఇంద్రాణినే అడిగాడు : "రేపే వెళ్ళిపోవడమేం ? సెలవులంతా ఇక్కడే వుంటామని అన్నారుగా ?'' జగపతికూడా అదే ప్రశ్న వేశాడు.

ఇంద్రాణి గుంభనంగా నవ్వింది; భావయుక్తంగా చెప్పింది, ''చూడక, తెలియక—సరదాగా పల్లె చూద్దామని వచ్చాను, అంతే, వెళ్ళిపోతున్నాను."

అందలి అర్థం అందరికీ స్ఫురించలేదు కానీ, అవ్వవలసినవారికి మాత్రం అర్థమైంది.

''ఇప్పుడే వెళ్దాం ఓ అరగంటలో, ఎక్కడికీ వెళ్ళిపోకు,'' అంటూ లోపలికి పోతూన్న శ్రీరాంను, ''ఎవరెవరూ వెళ్ళేది ?" అనడిగాడు కిరణ్.

"ఇంకెవరూ ? మనం ముగ్గురం, మీ వదిన లిద్దరూ, ఇంద్రాణీ !'' అంటూనే మరి కిరణ్‌కు మాటల కవకాశ మీయకుండా వెళ్ళిపోయాడు శ్రీరాం.

కిరణ్ ముఖంలో సంతోషం కన్పించలేదు. "మీరంతా వెళ్ళండి, నేను రాను." అని తన దారిన పోబోయాడు.

''ఏం ?" జగపతి ప్రశ్న.

''ఏమీలేదు. చల్లగాలికి అలా తిరిగి వద్దామనీ......''

''పోనీ అందరూ కలసి సరదాగా వెళ్ళరాదూ ? షికార్లకేం, రోజూ వెళ్ళేవేగా ?''

"సరే, నేను రోజూ చూస్తూనే వుంటాను టౌనులో. ఇవాళ ఈ పల్లెనుండి పనిగట్టుకు పట్నం వెళ్ళి సినీమా చూడాలన్నంత ఆత్రంగా లేను." అంటూ ముందుకు సాగిపోబోయిన కిరణ్ కాళ్ళకు ఇంద్రాణి మాటలే అడ్డుపడ్డాయి.

"అయినా సరదా వుండనే వుంటుంది. మీ రేమి ముసలి వగ్గులూ, సర్వసంగ పరిత్యాగులూ కారుగా ? ఆట్టే బెట్టుచేయకండి, నేను పోయి, రాణిఅక్కతో చెప్పి, ఆమెనుకూడా తీసుకువస్తాను. అందరం సరదాగా గడపాలి, నేను వెళ్ళిపోయే

# మీకు అన్ని విధాలా సరిపడే పథకాన్ని ఎంచుకోండి —పొదుపు చేయండి

మీరు పొదుపు చేసి తీరాలి. మీ కొరకు, కుటుంబం కొరకు, మీ దేశం కొరకు. మరింత పొదుపు చేయండి. తక్కువ ఖర్చు చేయండి.

ఏ విధమైన పొదుపు అనేదే ప్రశ్న. పొదుపు అలవాటుని వృద్ధి పరచడానికి ప్రభుత్వం అనేక లాభసాటి అయిన పథకాలని ప్రవేశ పెట్టింది. వీటినుండి లాభం పొందడానికి అధిక మొత్తాలు మీ వద్ద ఉండ నవసరం లేదు.

**పోస్టు ఆఫీసు సేవింగ్సు బ్యాంకు అకౌంటు**

మీ సొమ్ము పెరుగుతూండటాన్ని కనిపెట్టండి. ఇది మీకు సాలీనా 4 శాతం పన్నులేని వడ్డీని తెస్తుంది! రెండు రూపాయలుంటే మీరు ప్రారంభించవచ్చును.

**క్యుములేటివ్ టైమ్ డిపాజిట్ అకౌంటు**

ప్రతినెలా ఒక నిర్ణీత మొత్తాన్ని డిపాజిట్ చేయండి, మళ్లీ దాన్ని 5, 10, లేక 15 సంవత్సరాల తర్వాత మంచి పన్నులేని వడ్డీ తోబాటు పొందండి. 10 మరియు 5 సం॥ల అకౌంట్లలో డిపాజిట్లు, రాబడి పన్ను చట్టం క్రింద రాబడి పన్ను తగ్గింపులకు అర్హమౌతాయి.

**జాతీయ పొదుపు సర్టిఫికేట్లు (మొదటి విడుదల)**

ఇప్పుడు 10 రూపాయలు కట్టి 10 సంవత్సరాల తర్వాత 18 రూపాయలను పొందండి. ఇప్పుడు 100 రూపాయలు కట్టి 10 సం॥ల తర్వాత 180 రూపాయలను పొందండి.

**జాతీయ రక్షణ సర్టిఫికేట్లు**

పొదుపు చేయడానికి ఒక మంచి మార్గం. ఒక ఏడాది తర్వాత నగదుగా మార్చుకోవచ్చును. కాని ఎంతకాలం వుంచితే, అంత ఎక్కువ వడ్డీ వస్తుంది. రూ 10/- 12 సం॥లలో రూ 17.50కి పెరుగుతాయి. వడ్డీకి పన్నులేదు.

**రక్షణ డిపాజిట్ సర్టిఫికేట్లు**

సాలీనా 4½ శాతం చొప్పున ప్రతి సంవత్సరం పన్నులేని వడ్డీ యివ్వబడుతుంది. మీరు మీ సొమ్మును 10 సంవత్సరాల తర్వాత పొందుతారు.

వివరాల కొరకు మీకు దగ్గరలో వున్న పోస్టు ఆఫీసులో కాని, లేక స్థానిక జాతీయ పొదుపు ఉద్యమ జిల్లా ఆర్గనైజర్‌ను కాని సంప్రదించండి.



జాతీయ పొదుపు ఉద్యమ సంస్థ

DA-66/

ముందు,'' అంటూ సమాధానంకొరకు చూడకుండానే చకచకా పోయింది కారులో. కారు సాగిపోయింది.

ఆమె ప్రవర్తనకు ఆశ్చర్యంతో, సంతోషంతో తండ్రీకొడుకు లిరువురూ కొద్ది సేపు బండిపోయిన దిక్కే తిలకిస్తూ విల్చున్నారు.

తర్వాత మెల్లగా అన్నాడు జగపతి: "అవును; రాణికూడా వస్తే సరదాగా వుంటుంది; అంతా కలసి వెళ్ళరండి. మళ్ళీ నువ్వు ఉద్యోగానికి పోతే రాణీ, నీవూ చాలా కాలానికిగాని కల్పుకోవడం కుదరదు.''

అర్థంగానట్లు చూచాడు కిరణ్.

గ్రహించిన జగపతి చుట్టూ చూచి, తగ్గు స్వరంలో చెప్పాడు : "ఇప్పుడు నేను రాయుడు యింటికే పోయి వచ్చాను, ముహూర్త నిర్ణయం చేయించటానికి, కాని యశోదాదేవి అభ్యంతరం పెట్టింది. చెట్టంత కొడుకు మరణించి ఏడాదైనా తిరుగక ముందే కుమార్తె పెళ్ళి చేయడం తనకు ఇష్టంలేదనీ, అది శుభప్రదం కాజాలదనీ భయపడ్తూన్నదామె......ఆలోచించగా నాకూ అలానే తోచింది. వివాహమైనా మరొకటైనా చేసిన పని ఆనందదాయకం కావాలనేగా నా కోరిక? అంచేత, తొందరేమొచ్చింది? ఈ నాలుగు నెలలూ పోయాకనే చేయవచ్చనే నిర్ణయాని కొచ్చాను. ఏమంటావ్ ?"

అనతికాలంలోనే వివాహం కాగలదని ఉవ్విళ్ళూరుతూన్న కిరణ్‌కు ఆ వార్త వినీవినగానే అసంతృప్తి రేకెత్తినా, పెద్దల నిర్ణయంలో ఆలోచనా, అర్థమూ, ప్రయోజనమూ ఉండగలవని గుర్తించాడు. వారి అభిప్రాయం అతడికీ సమంజసం గానే తోచింది. 'నాలుగు నెలలేమిటి—నా దేవరాణికోసం నాలుగు యుగాలైనా వేచి వుండగలను,' అనుకున్నాడు. తండ్రితో ప్రకాశంగా అన్నాడు. "మీకే అన్నీ తెల్సు. మీ ఇష్టప్రకారమే కానీయండి. అయితే, నేను సెలవు పొడిగించనవసరం లేదన్న మాట? మరొక్క పదిరోజులే వున్నాయి సెలవులు.''

గంభీరంగా అన్నాడు. "నీ యిష్టం, మరి నాల్గురోజులు వుండాలనుకుంటే వుండు. నేను వెళ్ళి ఇంట్లో అందరికీకూడా చెప్తాను వార్త." అంటూ వెళ్ళిపోయాడు.

జగపతి లోనికి వెళ్ళేసరికి, వంటగదిలో రెండవకోడలు జానకీ, అత్తగారూ మంచి వాగ్వాదంలో వున్నారు.

"ఏమైనాసరే అత్తయ్యా, మీరు మామగారికి చెప్పితీరాలి. కిరణ్‌కు ఎట్లాగైనా ఇంద్రాణిని చేసుకోవాలి;" జానకి ఖచ్చితంగా అంటూన్నది.

"ఇదెక్కడి వితండవాదం జానకీ ! నువ్వే న్యాయం ఆలోచించు;" కమల

సానునయంగా, ఓర్పుగా కోడలికి నచ్చజెప్ప ప్రయత్నిస్తున్నది. "ఇంద్రాణి అంటే నాకుమాత్రం యిష్టంలేదా? కాని ఏకారణంగానో అబ్బాయి దృష్టి అటు లేదు. భగవత్కృపవల్ల లోపంలేని పిల్లే దొరికింది కదకు. దేవరాణికూడా ఈ యింటికి తగిన కోడలు. తీరా కుదిరిపోయి, అన్నిమాటలూ అయ్యాక, ఇవాళోరేపో తాంబూలాలుకూడా పుచ్చుకోబోతూన్న వివాహానికిక ఎవరుమాత్రంఅడ్డుచెప్పవచ్చా?"

జానకి ముఖం కోపంతో ఎఱ్ఱబడింది. "అసలు మీ అందరూ ఆ దేవరాణి సంగీతం మత్తులో పడిపోయారు. ఇంకా అసలు సంగతి నాకు తెల్సు; ఆమె తండ్రికి ఒకతే కూతురు. మాకంటె ఆస్తిపరులు. అందుకే మీకామెపై అంత మక్కువ."

నిర్ఘాంతపోయిన కమల మందస్వరంతో అన్నది. "జానకీ! నీకు కోపం వచ్చినా సరే ఒక్కమాట అంటున్నాను. నీకు అలవిమాలిన ఆవేశమేకాని, ఎవరితో ఎలా మాట్లాడాలో—అసలు ఏం మాట్లాడుతున్నావో కూడా తెలియదు. అయినింటి ఆడపిల్ల అత్తవారింట ప్రవర్తించవలసిన తీరూ, వుండడం యిట్లాగేనా? వెళ్ళు, ఇంకేమీ అధికంగా మాట్లాడకు. ఎవరైనా విన్నా బాగుండదు. కుదిరిన పెళ్ళి మరి తిరగదు. అయినా ఎందుకు నీకీ పట్టుదల? ఇంద్రాణికి మరి పెళ్ళి కాదా?"

త్రాచుపాము లాగా బుసలు కొట్టింది జానకి, "వెళ్తాను, నేనూ చెప్తున్నాను ఒకమాట—కిరణ్ పెళ్ళి ఆ రాణితోనే గనుక అయితే నేను ఆ పెళ్ళి కండ్లతో కూడా చూడను. ఉన్నది ఇద్దరమే అక్కచెల్లెళ్ళం—ఒకే యింటికోడళ్ళమై ఒకే చోట వుండాలనుకుని ముచ్చట పడ్డాను. మా ముచ్చట మీరు గ్రహించనప్పుడు, మీ ముద్దు ముచ్చటలు నేను మాత్రం ఎందుకు తీర్చాలి?" కోపంగా పోతూపోతూ, గుమ్మంలో నిలబడిన జగపతిని చూచి ఒక్క క్షణం ఆగింది జానకి. మరుక్షణంలో ముఖం గిరుక్కున తిప్పుకుని వెళ్ళిపోయింది.

కోడలు వెళ్ళినవైపుకే చూస్తూ నిట్టూర్చుతూన్న కమలను చూచి గంభీరంగా అన్నాడు జగపతి: "మరేం విచారించకు కమలా. నలుగురున్న యింటో నాలుగు రకాల మాటలు విన్పిస్తూంటాయి. ఫర్వాలేదు, ఆ కోడలిపిల్ల అలిగినంతమాత్రాన నీ ముద్దులకొడుకు వివాహం ఆగిపోదులే."

"ఇంతకూ మీరు వెళ్ళినపని? ముహూర్తం నిశ్చయించారా?"

"లేదు. యశోదాదేవి కొద్ది అభ్యంతరం చెప్పింది. వచ్చే శ్రావణమాసంలో చేయవచ్చు. ఇంకా నాల్గునెలలు ఆగాలి."

"మంచిది."

Printed and Published by Sri A. Sudhakar Rao for Yuva Concerns
at Yuva Press, Hyderabad-1. Telephones, 36336, Press, 34400
Controlling Editor: Sri "CHAKRAPANI"

శ్రేష్ఠమైన వర్జీనియా పొగాకు
యొక్క సువాసనను పొందాలంటే

# హై కోర్టు

... **వర్జీనియా** సువాసనను
నిలపడానికి ఫోయిల్‌తో
కప్పబడింది.

**వర్జీనియా** రుచిని పొందండి



కాల్చండి
**హై కోర్టు**




22 పైసలకు 10



వజీర్ సుల్తాన్
తయారీ

CMVS-12 TEL